# పోతన వచన మహాభాగవతం

3



శ్రీ పోతన మహాభాగవతమునకు అనుసృతి

అయినంపూడి గురునాథరావు

# ఎమెస్కో వచన మహాభాగవతం

(మూడవ సంపుటం)

శ్రీ పోతన మహాభాగవతమునకు అనుకృతి

అయినంపూడి గురునాథరావు



264

యం. శేషాచలం అండ్ కంపెనీ
మచిలీపట్నం - సికింద్రాబాద్

# EMESCO VACHANA MAHA BHAGAVATAM-1

As retold by

Sri AYINAMPUDI GURUNATHA RAO

First Edition :

August, 1985



Publishers :

M. SESHACHALAM & Co.,

Machilipatnam - Secunderabad - 3



Printers :

PUSHPA PRINTERS,

Tilak Nagar, Hyderabad-500 044




Cover Design

BAPU

Distributors :

ANDHRA PRADESH BOOK DISTRIBUTORS,

3287, Rashtrapati Road, Secunderabad-500 003

Price : Rs. 15-00

శ్రీ

# మహా భాగవతం

## (షష్ఠ స్కంధం)

పరీక్షిన్నరేంద్రుడు శుకమహర్షికి ఇలా అన్నాడు— "మునీంద్రా! ఏ మార్గాన ముక్తిపదం పొందదగునో దాని మహిమ ఎలాంటిదో తేట తెల్లంగా చెప్పావు. భక్తియోగంచేత బ్రహ్మలోకం పొంది ఆపైన బ్రహ్మతోగూడ ముక్తి పొందవచ్చుననిన్నీ కూడా చెప్పావు. అలాగే సత్వరజస్తమో గుణప్రభావంచేత మువ్విధాలైన కర్మలుచేస్తూ ప్రకృతికి వశంగతుడై పురుషుడు సుఖదుఃఖాను భూతిపొందుతాడనిన్నీ, ఆ సుఖదుఃఖానుభవానికి సత్త్వాది గుణపరిణామమైన దేహ సంబంధమే హేతువనిన్నీ చెప్పి నాకు కనువిప్పు కలిగించావు. అదేరీతిగా నానా విధ నరకాలను గురించీ కళ్లకు కట్టినట్లు చెప్పావు.

అంతేకాక స్వాయంభువ మన్వంతరం, ప్రియవ్రతోత్తానపాదుల వంశం, వారిచరిత్ర శ్రవణసుభగంగా వినిపించావు. ద్వీపాలు, వర్షాలు, సముద్రాలు, నదులు, ఉద్యానాలు, భూమండలం, దాని అవాంతరవిభాగాలు, వాటిప్రమాణం, అద్భుతంగా వర్ణించి చెప్పావు. అదేవిధంగా నీవు చెప్పిన జ్యోతిశ్చక్రచలన విధానం వింటుంటే నా శరీరం పులకించింది. ఇంతెందుకూ పరమేశ్వర నిర్మిత మైన సృష్టిలోని సమస్తరహస్యాలు తెలియజేశావు. మునినాథా! నీవు సామాన్యు డవా? షడ్గుణైశ్వర్యసంపన్నుడవు. ఇంకొకవిషయం తెలిసికోవాలని నాకు కుతూ హలంగా ఉంది. దురంత వేదనలకు కారణభూతమైన నరకకూపరాశిలో పడకుండా మానవుడు బ్రతికే దారిలేదా?"- అని అడిగేసరికి పరీక్షిన్నరపతికి శుకమహర్షి యిలా చెప్పడం మొదలుపెట్టాడు.

"రాజేంద్రా! విను. మనోవాక్కాయములచే కలిగిన పాపరాశిని ఎప్పటి కప్పుడు నిర్మూలం చెయ్యకపోతే మరణానంతరం జీవికి నరకపాతం తప్పదు. కనుక మానవుడు యమకింకరుల వికృతరూపాలను చూడకముందే, మృత్యు భావన మనస్సులో కలవరపాటును కలిగించకముందే, శరీరంలో శైథిల్య

వెలుగుతూండి మేని సొంపు తప్పక పూర్వమే, నిష్కల్మషమైన మనస్సుతో పాప నిర్మూలనానికి దారిని ఆలోచించాలి. వైద్యుడు రోగనిదానం (రోగానికి మూల కారణం) తెలిసికొని తగిన చికిత్సచేసి ఆ రోగాన్ని నిర్మూలించునట్లు మానవుడు తాను చేసిన పాపానికి హేతువు తెలుసుకొని దాని మూలచ్ఛేదం చెయ్యాలి"— అనగా పరీక్షిద్భూకాంతుడిలా అన్నాడు.

"మునీంద్రా ! ప్రత్యక్షంగా చూడడంవలన గాని, విజ్ఞులు చెప్పడం వలనగాని మానవుడు ఏది పాపమో తెలిసికొంటాడు. అది తాను చెయ్యకూడ దని పరితపిస్తాడు. కాని విషయవపడై తిరిగీ ఆ పాపాన్నే ఆచరిస్తాడు. అలాంటి మూఢాత్మునకు పాపవిముక్తి ఎలాకలుగుతుంది? అంతేకాక ఒకవ్వ డొక పాపకృత్యంచేసి ఆ పాపనిరాసానికి ఏదో ప్రాయశ్చిత్తం చేసుకున్నా ఇంద్రియచాపల్యంచేత తిరిగీ పాపానికి ఒడికట్టితే ఆ ప్రాయశ్చిత్తకర్మ, మేని మలినం పోకుండా ఏనుగు నీటిలో వేసిన మునుకలాగా నిష్ఫలమేకదా!"— అనగా శుకమహర్షి ఈరీతిగా చెప్పాడు.

"రాజేంద్రా! నీవన్నదినిజమే. ప్రతిపదోక్తాలైన ప్రాయశ్చిత్తాది కర్మల వలన పాపాలు నిర్మూలంకావు. అది తాత్కాలిక చికిత్సమాత్రమే. అంచేత ఆ ప్రాయశ్చిత్త విధులు కేవలం వ్యర్థాలని అంటానికి వీలులేదు. పథ్యమైన అన్నం తినేవానిని వ్యాధులు దరిజేరవు. అలాగే ప్రాయశ్చిత్త కర్మలకు ఉండే పరిమిత ప్రయోజనం ఉండనే ఉంటుంది. సద్వ్రతుడు, నిర్మలమనస్కుడూ అయినవాడు పాపరాశిని తొలగించుకుంటాడు.

అంతేకాదు. తపం, బ్రహ్మచర్యం, దానం, శమం, దమం, జపం, సత్యం, శౌచం కలిగిన ధర్మతత్పరులు, అగ్ని వెదురుపొదలను దహించునట్లు త్రికరణాల వలన పుట్టిన పాపసమూహాన్ని తుంచివేస్తారు. వారేకాదు. గోపకుమారకుని చరణ కమల మకరందాన్ని త్రావి మత్తిల్లెడు తుమ్మెదలను చిత్తములుగల హరిభక్తులు భక్తియోగంచేత సూర్యుడు మంచును హరించునట్లు దోషాలను నిర్మూలనం చేస్తారు.

హస్తిపురాధీశ్వరా ! నేనొక రహస్యం చెపుతాను విను. హరిభక్తిఒక్కటే కలుషాత్మునకుకూడా ముక్తినిస్తుంది. శమదమాదులవల్లకూడా ఏమీ ప్రయో జనంలేదు. శ్రీహరికి అర్థం ప్రాణం అర్పించినవానికి, హరిభక్తులను సేవించిన వానికి, శ్రీహరి కథాశ్రవణమునందు ఆసక్తికలవానికి, శ్రీహరివ్రతాచరణంచేసే వానికి, లభించెడి కైవల్యపదం అన్యులకు లభించడం కల్ల. మోక్షం వైష్ణవ జ్ఞానంవలన ప్రాప్తిస్తుందికాని తపశ్చర్యవలనగాని బ్రహ్మచర్యాది నియమాల

వలనగాని, శమదమాదులవలనగాని, సత్యశౌచాలవలనగాని, దానధర్మాలవలన గాని, యజ్ఞయాగాదులవలనగాని ప్రాప్తించదు.

సాధువులకు, పుణ్యశీలురకు, హరిభక్తులకుతప్ప, నెవరికైనా ఏనాడైనా చేటులేని ముక్తిమార్గం లభించిందా? హరిభక్తి మధుకలశంలాంటిది. ఎన్ని నదులైనా దానితో సరితూగుతాయా? అలాగే మానవుడెన్ని పుణ్యకార్యాలుచేసినా అవి హరిభక్తితో సమానంకావు. నిరంతరం శ్రీహరి గుణానురక్తుడై ఆ దేవ దేవుని దివ్యచరణారవిందములందు మనస్సు నిల్పెడి మహాత్ములకు పాశహస్తులైన యమకింకరులు కలలోకూడా కనబడరు. దుష్టకర్మలు వారిని ఏవిధంగాను దరిజేరవు. ఇందుకు తార్కాణంగా పురాతనమైన ఒక ఇతిహాసం ఉంది. విష్ణు దూతలకు యమదూతలకు జరిగిన సంవాదమది. అది చెపుతాను విను.

## అజామిళోపాఖ్యానం

కన్యాకుబ్జనగరంలో అజామిళుడనే బ్రాహ్మణుడున్నాడు. అతడు మహా పాతకుడు అభాగ్యుడు, సదాచారాలను పాటించడు. పాపక్రియలకు వెలవడు. జూదాలాడతాడు. దుర్వాదాలు చేస్తాడు. ఒకదాసిని ఆత్మపత్నిగా వరించి పది మంది కొడుకులను కన్నాడు. అహోరాత్రాలు మోహసముద్రంలో మునిగితేలుతూ ఆ కొడుకులను లాలిస్తూ పాలిస్తూ చాలాకాలం సుఖించాడు. జీవితసాఫల్యం పొందకుండా పతితుడయ్యాడు. మరణ సమయం ఆసన్నమైంది.

కాలుష్యాన్ని వీడి ప్రసన్నమైన మనస్సులాగా అపుడాతని నల్లని వెంట్రుకలు తెల్లనయ్యాయి. మోహపాశం ముడివిడి జారినట్లు అవయవాలు శిథిలమై జారిపోయాయి. ఇంద్రియవాంఛలిక అక్కరలేదని అంటున్నట్లు తల వణకటం మొదలుపెట్టింది. వయసూ, వాంఛా ఉడిగిపోయినట్లు చూపు తగ్గిపోయింది. దంతాలు ఊడిపోయాయి. ఆయాసం, దగ్గు ఆరంభమయ్యాయి. శిరోభారం ఎక్కువైంది. మనస్సు నిలకడతప్పింది.

అప్పటికి అతనికి ఎనుబదెనిమిది సంవత్సరాలు పైబడ్డాయి. అతని కడ గొట్టుబిడ్డ పేరు నారాయణుడు. వానిమీద అతనికి, అతని సతికి అమితమైన వ్యామోహం. అతణ్ణి నిరంతరం ముద్దాడుతూ ఆనందంతో పరవశిస్తారు. ఆ పిల్లవాని మాటలు ముగ్ధమోహనంగా ఉంటాయి. ఆతని నుదురు ముచ్చటగా, ముద్దులొలుకుతూంటుంది. వాని లావణ్యం, వర్తనా, వారికి ఎంతో ఆనందాన్ని చేకూరుస్తుంది. నియమ నిష్ఠలకు ఏనాడో తిలోదకాలిచ్చిన ఆ బ్రాహ్మణుడు వానిని చూచి చెప్ప రాని మనోానందం చెందేవాడు. అతడు తింటున్నా త్రాగుతున్నా ఆ కుఱ్ఱవాడు

దగ్గర ఉండాలి. వానితో ఆతడెప్పుడూ ఆడుతూ వినోదిస్తూఉంటాడు. కాని ఆ మూర్ఖుడు ఆసన్నమైన మృత్యువును మాత్రం చూడలేకపోతున్నాడు.

జ్ఞానహీనుడై ఆ బ్రాహ్మణుడలా చరిస్తూండగా మృత్యుకాలం దగ్గర పడ్డది. ఆ అంత్యసమయంలో ఆతడు వాత్సల్యాతిశయంచేత తన కొడుకును తలచుకొని 'నారాయణా' అని మనస్సులో విలపించాడు. అంతలో లోకభయంకరులూ, దుష్టజననాశంకరులూ, అయిన యమకింకరులు రానేవచ్చారు. వారిని దూరంనుండి చూచి అతడు గజగజలాడిపోయాడు. వారు రోషంతో నిప్పులు గ్రక్కుతున్నారు. వారి పెదవులు లావుగా ఉన్నాయి. ముఖాలు వికృతంగా ఉన్నాయి. చూపులు గర్వాన్ని వ్యక్తం చేస్తున్నాయి. చెక్కిళ్లు అమితవిశాలంగా ఉన్నాయి. కనుగ్రుడ్లు ఎగుడుదిగుడుగా తిరుగుతున్నాయి. వారి శరీరయష్టి అత్యంత నిష్ఠురంగా ఉంది. రోమాలు నిక్కపొడుచుకుని ఉన్నాయి. వారిచేతుల్లో భయంకరపాశాలున్నాయి. జీవుల ప్రాణాన్ని హరించడం వారికి అభ్యస్తవిద్య.

అలాంటి యమకింకరులు ముప్వురు కంటబడేసరికి అజామిళుని ఇంద్రియాలు వికలం చెందాయి.. ప్రాణాలు చలించాయి. చూపులు వికృతమయ్యాయి. ఆత్మ విహ్వలించింది. ఆ సమయంలో ఆతని ముద్దు కొడుకు దూరానఎక్కడో ఆడుకుంటున్నాడు. అతడు తన స్మృతి వీథిలో మెలగేసరికి అజామిళుడు "నారాయణా! నారాయణా. నారాయణా!" అని ముమ్మారు కేకవెట్టాడు.

మరణసమయంలో ఆతడలా శ్రీమన్నారాయణ నామసంస్మరణం చేసేసరికి ఆ పరిసరాల్లోఉన్న శ్రీహరిదూతలు తమ యేలికనామం విని సంభ్రమపాటుతో వెంటనే అక్కడకు వచ్చారు. సరిగా అదేసమయంలో వికృతాకారులూ, దీర్ఘరోములూ అయిన యమభటులు అజామిళుని దుర్భాషలాడుతూ అతని శరీరం నుండి జీవుని వెలికిలాగుతున్నారు. శ్రీహరిదూతలు ఆ యమదూతలను అదలిచ్చి అవలకు త్రోసివేశారు.

## విష్ణుదూత యమదూతల సంవాదం

యమభటుల్లావిఫల ప్రయత్నులై నివ్వెరపోయి- ఎవరయ్యా మీరు? మమ్మల్ని ఇలా అడ్డగించారెందుకూ? మాచేజిక్కిన ఈ కలుషాత్ముని విడిపించారే! మీకింతకొవ్వా? ఇక యముని శాసనం దేనికి? నగుబాట్లకా? ఇంతకూ ఎవరు మీరు? మీరూపాలు నేత్రపర్వంగా ఉన్నాయి. మీరు దివిజులా? భువిజులా? దేవతలా? సిద్ధులా? లేక సాధ్యులా? మీ నేత్రాలు వికసించిన వెలిదామరరేకుల్లాగా ఉన్నాయి. చక్కని పట్టుబట్టలు ధరించారు. కర్ణకుండలాలు చెక్కిళ్ళపై నాట్యం చేస్తున్నాయి.

శిరస్సుపై కిరీటాలను ధరించారు. తెల్లదామరల హారాన్ని ధరించారు. బాహువులకు కేయూరాంగదాలు దాల్చారు. నాల్గుభుజాలతో. నయనానందకరంగా ఉన్నారు. నీలమేఘశ్యాములైన మీరు నిత్యయౌవనులుగా కనబడుతున్నారు.

ధనువులు, తూణీరాలు, శంఖం, చక్రం, ఖడ్గం, గద, లీలాకమలం ధరించిన మిమ్మల్ని చూస్తూంటే ఎవరికి విస్మయం కలగదూ? మీ శరీరకాంతులు దిగంతాల యందలము కొన్న చిమ్మచీకట్లను పారదోలుతూ లోకాలకు ఆనందం కలిగిస్తున్నాయి. మనోహరాకారులూ, మహాతేజస్వులూ, ధర్మపాలకులూ అయిన మీరు ధర్మపాలకులమైన మమ్మల్ని ఇలా వారించడానికి కారణమేమిటి? అని అడిగేసరికి వారు యమధర్మరాజు భటులని భావించి హరిదూతలు మందస్మితంచేసి మేఘ గంభీర వాక్కులతో ఇలా అన్నారు.

ఓహో! మీరు యముని దూతలా? అయితే పుణ్యమంటే ఏమిటో, పాపమంటే ఏమిటో, దండన విధి ఎలా ఉంటుందో, ఇతనికి అనుగుణమైన పరలోక నివాసమేదో, చెప్పండి. అంతే కాక దండ్యులెవ్వరు? జీవులందరు దండ్యులేనా? లేక కేవల పాపాత్ములేనా?—అని ప్రశ్నించగా యమభటులిలా అన్నారు.

వేదప్రతిపాదితమైనది ధర్మం. దానికి భిన్నమైనది అధర్మం. వేదం భగవత్స్వరూపం. ఆ వేద స్వరూపుడైన నారాయణుడే రజస్సత్వతమో గుణమయమైన దేవమనుష్యాది జీవకోటిని, శాంతిక్షమాదిగుణాలను, నానావిధాలైన క్రియలను, రూపాలను ఏర్పాటుస్తాడు. అతడే జీవరాశిలో అంతర్యామియై ఉంటాడు.

అయితే జీవు లనుక్షణమూ చేసెడి ధర్మాధర్మాలు అనంతాలు. అలాంటప్పుడు వానినెలా తెలిసికొనడం? అంటే-మానవుడు చేసే ధర్మాధర్మాలకు సూర్యుడు, అగ్ని, ఆకాశం, వాయువు, గ్రహాలు, చంద్రుడు, సంధ్యలు, పవళ్ళు, రాత్రులు, భూమి, కాలం సాక్షీభూతులు. వారే తెలియజేస్తారు. దాన్ని అనుసరించి దండనవిధానం, దండనస్థానం, సద్ధర్మగతి నిర్ణయింపబడతాయి. దేహి గుణసాంగత్యంచేతనే కర్మాచరణానికి పూనుకుంటాడు. ఆ కర్మాచరణంతో శుభాలు అశుభాలుకూడ కలుగవచ్చు. కనుక కర్మబద్ధులైన జీవులందరు దండనార్హులే. అయితే జీవి ప్రకృతం తాను చేసిన సుకృతదుష్కృతాల పరిమితికి అనుగుణమైన ఫలితాన్నే అనుభవిస్తాడు.

జీవులు ముప్పిధాలుగా ఉంటారు. కొందరు శాంతస్వభావులు. వారు ధర్మానువర్తనులై సుఖం అనుభవిస్తారు. కొందరు క్రూరులు. వారు అధర్మా

నికే ఎక్కువగా ఒడిగట్టి చేజేతా దుఃఖం తెచ్చిపెట్టుకుంటారు. కొందరు మూఢులు, వారు ధర్మాల్లూ చేస్తారు. అధర్మాలూ చేస్తారు. వారి జీవితం సుఖదుఃఖ సమ్మిశ్రితంగా ఉంటుంది. జన్మాంతరంలో కూడ వారికి అలాంటి అనుభూతియే కలుగుతుంది. యముడు సర్వభూతాంతర్యామి. ధర్మాధర్మాలతో గూడిన జీవుల పూర్వరూపాలను తన విశిష్టరూపాలతో చూస్తూ వారి యెడల ఎలా ప్రవర్తించాలో ఆలోచిస్తాడు.

పూర్వజన్మల్లో చేసిన కర్మవిశేషాలవల్లనే వర్తమానదేహం కలుగుతుంది. కాని అజ్ఞానమే ఉపాధి (ఆధారం) గా గలజీవి తమోగుణప్రభావం చేత అది గ్రహించక ఎప్పటికప్పుడేర్పడిన దేహమే తాననుకుంటాడు. వానికి పూర్వ జన్మస్మృతి ఉండదు. రాబోవు జన్మలను గూర్చి అసలే యోజించడు. అందేత భగవదనుగ్రహం సంపాదించడానికి తగిన శుభకర్మ చెయ్యకుండా కర్మేంద్రియాలచేత ప్రకృతదేహానికి ఉచితములైన కర్మలు చేస్తాడు. జ్ఞానేంద్రియాల చేత జ్ఞానసముపార్జనం చెయ్యకుండా తమోగుణానికి లక్ష్యాలైన శబ్దస్పర్శరూప గంధాలను మాత్రం తెలిసికొని అనుభవిస్తాడు.

కర్మేంద్రియాలు అయిదు. జ్ఞానేంద్రియాలు అయిదు. తమోవిషయాలైన ఇంద్రియ విషయాలు శబ్దస్పర్శాదులు అయిదు. పదియాఅవది మనస్సు. ఈ పదియాఱింటితో గూడి జీవుడు పదునేడవవాడై ఉపాధియందు అంతర్గతుడై ఉంటాడు. అతడు స్వతంత్రుడు. ఒక్కడే. అయినా సర్వేంద్రియాలతో సంబంధం కల్పించుకొని షోడశకళలతో గూడిన లింగశరీరమని వ్యవహరింపబడతాడు. అప్పుడు సత్వాదిగుణ సంస్పర్శంవలన హర్షశోకభయాలకు ఆకరమైన సంసారం కల్పించుకుంటాడు.

పట్టుపురుగు తనకు తెలియకుండానే దారం అల్లుకుంటూ తనచుట్టూ తాను తిరుగుతూ తుదకు ఆ దారపు టల్లికలో చిక్కుకొని పోతుంది. ఇక బయటకు ఎలా రావాలో తెలియదు. అలాగే కామక్రోధాదులను జయించిన వాడుకూడా కర్మలతో నిమిత్తంలేని బుద్ధిని గూర్చి విని, తెలిసికొనీ కూడా కర్మలు చేస్తూ ఆ కర్మబంధంలో చిక్కుకుంటాడు. దానిలోనుంచి ఎలా బయటపడాలో తెలియక తన నాశనానికి తానే దారి కల్పించుకుంటాడు.

ప్రస్తుతం మనం వసంతఋతుశోభను అనుభవిస్తున్నాం అనుకుందాం. ఇది మనకు భూతభవిష్యద్వసంత కాలపు స్మృతులను కలిగిస్తుంది. అలాగే వర్తమాన జీవితంలో మన అనుభవాలనుబట్టీ, మనం ఆచరించే ధర్మాధర్మాలనుబట్టీ, మన గత జీవితాలు ఎలాగడిచాయో భవిష్యజ్జీవితాల్లో మనం ఎలాంటి సుఖదుఃఖాలు అనుభవిస్తామో గ్రహించవచ్చు. పురుషుడు అస్వతంత్రుడు. అందేత పూర్వ

సంస్కారాలతో గూడిన గుణాలవలన అవశుడై బలవంతంగా అనుక్షణమూ ఏదో కర్మచేస్తుంటాడు. ఆ కర్మవాసనల నాశ్రయించి లింగదేహం ఉత్పత్తి దశలో స్థూలాకారం వహించి మరణావస్థలో తిరిగి సూక్ష్మరూపం పొందుతుంది. ఆ విధంగా స్థూల సూక్ష్మశరీరాలు జీవికి మాతాపితృసదృశాలౌతాయి. ప్రకృతి సంగ మంవలన పురుషునకు ఈ అనర్థం ప్రాప్తిస్తుంది. పురాణపురుషుడైన పరమేశ్వ రుని సేవిస్తే ఆ ప్రకృతి తొలగిపోతుంది.

కనుక ఇతడు (అజామిళుడు) తన పూర్వ జన్మలో చేసుకొన్న సత్కర్మ వర్తనం వలన బ్రాహ్మణకులంలో జన్మించాడు. శమదమాదిగుణాలు అలవరచు కున్నాడు. ధర్మశీలుడయ్యాడు. వేదాధ్యయనం చేశాడు. గురువులకు అతి థులకు శుశ్రూషలు చేశాడు. సర్వభూతములను సమభావంతో చూచాడు. అనేక మంత్ర సిద్ధులు పొందాడు. సత్యనిరతుడనిపించుకున్నాడు. నిత్యనైమిత్తిక విధులను ఆచరించాడు. లోభాదిగుణాలకు ఎన్నడూ వశంగతుడు కాలేదు. నిజా చారాలను విడువలేదు. జ్ఞానమార్గంలో అడుగుపెట్టాడు.

ఈ స్థితిలో అతనికి యౌవనప్రాదుర్భావం కలిగింది. క్రమంగా అతని మనస్సు ఉద్రిక్తమైంది. శరీరంలో కామవికారాలు పొడచూపాయి. ముఖంలో చిఱునగవు అంకురించింది. శరీరదార్ఢ్యం పెరిగింది. కురులు నిగనిగమెఱుస్తు న్నాయి. జఘన భారంచేత తొడలజిగి యినుమడించింది. బాహువులు పొడు గయ్యాయి. వక్షస్థలం విశాలమైంది. శరీరమందొకనూతన కాంతి పొడగట్టింది. అతని హృదయంలో పుట్టిన యౌవనమదాన్ని బయటకు వ్యక్తం చేస్తూన్నట్లు అతని ముఖాన నూనూగు మీసాలు మొలకెత్తాయి. అవి క్రమంగా నల్లనై తామర పువ్వుమీద వ్రాలిన తుమ్మెద బారులాగా అతని నెమ్మొగానికి వన్నె తెచ్చాయి.

ఇంతలో మన్మథ బ్రహ్మతంత్రానికి వసంతుడొనర్చెడి అంకురార్పణా రంభంలాగా సర్వజనమనోహరమైన మధుమాసం వచ్చి వనవృక్షాలను చిగురాకుల తోను, పూగుత్తులతోను, పండ్లతోను, అలంకరించింది. ఆ చిగురాకులు కాము కుల హృదయపల్లవాలను ఛేదించెడి బాణాల్లాగా ఉన్నాయి. ఆ పూగుత్తులనుండి వెల్వడు సుగంధపు పుప్పొడి ఆకాశాన్ని క్రమ్మివేస్తోంది. ఆ ఫలాలనుండి స్రవించెడి మకరందం త్రావి మత్తమధుపాలు చేసెడి ఝుంకారనినాదాలతో దిగ్వలయం ప్రతినదిస్తోంది. ఆ ఫలాలు పక్వమై ధారాళంగా రసస్రావం చేస్తూంటే ఆ రసానుభూతితో పరవశించి శుకపికాదులు కోలాహలం చేస్తున్నాయి.

అలాంటి మధుమాసంలో అజామిళుడొకనాడు తనతండ్రి యాజ్ఞననుసరించి దర్భలు, సమిధలు, పూవులు, పండ్లు, తీసికొని రావడానికి అడవికివెళ్ళి తిరిగి

వచ్చేటప్పుడు ఒక పొదరింటిలో యౌవన వతియైన యొక శూద్రకాంతతో రతి క్రీడావినోదంలో మైమఱచియున్న ఒక విటుణ్ణి చూచాడు. కామకళలో నిష్ణాత యైన ఆ కామినికూడ బద్ధానురాగంతో రతికేళీ పరవశయై ఉంది.

ఆ విటుడున్నూ రతిశాస్త్రంలో ఆరితేరినవాడు. నిండుజవ్వనంతో మదించి ఉన్నాడు. అతని ఒంటిపై గుడ్డకూడాలేదు. సురతంలో మైమఱచి ఉన్నాడు. మద్యపానంచేత ఆ మదవతి కళ్ళు గిరగిరతిరుగుతూన్నాయి. ఆమె అనంగకేళీ సంరంభంలో మునిగిపోయింది. ఆమె ముంగురులు చెదరిపోయాయి. ప్రియుని గాఢంగా కౌగిలించుకొని ఉంది. వారిని చూచేసరికి అజామిళునకు ఒడలు పుల కించింది.

ఇంతలో ఆమె పురుషాయితానికి ఉపక్రమించింది. ఆ సమయంలో అవ్యక్తమధురాలైన వారి మాటలు, ఆమె మొలనూలు మువ్వల రవళులతో కలిసి ఆ కలకంఠి చేస్తున్న సురతక్రీడయొక్క గమకాన్ని వ్యక్తం చేస్తూన్నాయి. యౌవన గర్వరేఖతో ఆమె అతని పైబడి మన్మథక్రీడ చేస్తున్నప్పుడు ముంగు రులు నుదురుపై ఎగిరి పడుతూన్నాయి. జుట్టుముడి వీడి చెదరిపోయింది. మణిహారాలు చనుదోయి పైనాట్యం చేస్తున్నాయి. నడుముపై మొలనూలు చలిస్తూ తాళం వేస్తున్నట్లుంది. ఆమె కరకంకణాలు శ్రవణసుఖంగా మ్రోగు తున్నాయి. ఆమె సన్నని నడుము ఊగిసలాడుతోంది.

అలా నానావిధ రతిక్రియలతో తన ప్రియుని ఆనందాంబుధిలో ఓలలాడి స్తూన్న సుకుమారశరీరయగు ఆ జవ్వనిని చూచి అజామిళుడు కామాతురుడయ్యాడు. అతని మనస్సు పారవశ్యంతో ఉవ్విళ్లూరడం మొదలు పెట్టింది. ఆ యువతీ యువకుల సంభోగ క్రీడలను పదేపదే చూడడంవలన అతడు మోహోద్రిక్తు డయ్యాడు, తన విహితకర్మయైన వేదాధ్యయనంలో అతడు మనస్సు నిలపలేక పోతున్నాడు. మన్మథుడు తన మనోరణ్యాన్ని అగ్నిలాగా దహించివేస్తున్నాడు. అతని మనోవీథిలో ఆ వృషలి (శూద్రస్త్రీ) మనోహరాకారం, శృంగారచేష్టలు మెదలుతున్నాయి. ఆమె నునుచెక్కిళులు, ఆమె హాసవిలాసాలు, ఆమె నుదురుపై చలించెడి ముంగురులు, ఆమె చూడ్కులబెడగూ, ఆమె చెవుల చెల్వమూ, ఆమె పాలిండ్ల పరువమూ, కామాగ్నితో దహించుకొనిపోతున్న అతని మనస్సులో స్థిరముద్ర వేశాయి. అవి మరచిపోలేకుండా వున్నాడు. ఎలాగో ఆ వన్నెలాడిని తన వశం చేసుకున్నాడు. నిజకులాచారాలకు స్వస్తి చెప్పాడు. గుణశీలా దులను మట్టిపాలు చేశాడు. పిత్రర్థం అంతా ఆమె పాలుచేశాడు. తనతో రతి కేళిని కాంక్షించెడి సతిని తృణీకరించాడు. ఇంటిలో ఉన్నప్పుడు మూర్ఖంగా ప్రవర్తించేవాడు.

తన తండ్రి యిచ్చిన ఆస్తి అంతా హరించిపోయింది. దానితో ఆతడు సహనం కోల్పోయి ఎవరైనా హితంచెపితే వారిని తిట్టిపోసేవాడు. తుదకు చేతిలో చిల్లిగవ్వకూడా లేకుండాపోయేసరికి దారులుకాచి ధనాపహరణానికికూడా సిద్ధపడ్డాడు. ఎవరేమన్నా గణించక అలాగడించిన ధనాన్ని తన ప్రియురాలికిచ్చి ఆమెను ఎలాగో చనవు చేసుకొని ఆమె దయతలచి యింత పెడితే తిని ఆమె దగ్గతే ఉన్నాడు.

వేద చర్చమాని ఆమె కుచతటంమీద చందన చర్చకు (పూతకు) పూనుకుంటాడు. తర్కశాస్త్రపాఠాలుమాని ఆమెతో ప్రణయతర్కానికి దిగుతాడు. స్మృతులలోని పదాలను వాక్యాలనుగాక ఆమె పదసౌందర్యాన్ని వాక్యవిలాసాన్ని గుఱించి ప్రసంగిస్తాడు. నాటకాలను, అలంకారాలను చర్చించడంమాని ఆమె నటనలనూ, ఆమె అలంకార విశేషాలను వర్ణిస్తాడు. ఈవిధంగా అతడు చిరకాలం పాపనియతుడై ఆ దాసికుటుంబభారం తలదాల్చి ఆమెనే తనభార్యగా భావించి భ్రష్టుడయ్యాడు.

పాపాత్ముడూ, క్రూరుడూ, ధూర్తుడూ, కుటిలుడూ కనుకనే మేము ఈతణ్ణి తీసికొనిపోవడానికి వచ్చాం. ఇతని దుష్కర్మలకు తగిన శిక్ష అనుభవిస్తే ఇతడు ధన్యుడవుతాడు. కాని మీరు అడ్డువచ్చి ఈ యత్నం విఫలం చేశారు- అని యమకింకరులనేసరికి నీతికోవిదులైన భగవద్దూతలు వారిని వారించి యిలా అన్నారు.

ఔరా! ఎంతటి ధర్మవేత్తలూ? మీ పస తెలిసిపోయింది. పాపం మీకు దండనవిధి తెలియదు. పుణ్యాత్ములను, అదండ్యులను ఎలా దండించాలో తెలుసు. ఇంతవఱకు అదే ఏకరువుపెట్టారు. సములూ, సాధువులూ, దయాళువులూ, శుభగుణాన్వితులూ అయిన తల్లిదండ్రులే బిడ్డలకు కీడుచేస్తే ఇకవారు ఎవరికి మొఱ పెట్టుకుంటారూ? ఈ విషయం మీరు మీ మనస్సులో బాగా వితర్కించండి. జ్ఞానవంతుడేదిచేస్తే ఇతరులుకూడా అదే చేస్తారు. అతడు ఇది సత్యమంటే లోకం దాన్నే నమ్ముతుంది.

స్నేహాతిశయంచేత తన తొడలపై నిద్రించు చెలికానికి విశ్వాసపాత్రుడైన వాడెవడైనా నీతిదూరుడై ద్రోహం చేస్తాడా? మనసిచ్చి మమకారంతోవచ్చి, మెచ్చి, విశ్వసించిన వ్యక్తికి కరుణాన్వితుడు, సౌమ్యుడూ అయినవాడు అనాలోచితంగా కీడుచేస్తాడా? తన ప్రేమకు పాత్రురాలై తనకు మనసిచ్చి తనను నమ్ముకొనిన ఒక అబల నిమిత్తం ఈ విప్రుడు అకృత్యాలకు పాల్పడ్డాడు. అంతే కాని క్రౌర్యంతోగాని దుర్బుద్ధితోగాని కాదు. ఈ ధర్మసూక్ష్మం మీరు గ్రహించలేదు. అదీగాక అతడు దేహావసాన సమయంలో కోటిజన్మల్లో ఆర్జించిన పాపాలను

కూడ పార్రదోలగలిగిన అమృతమయాక్షర సంకలితలైన శ్రీహరి నామస్మరణం చేశాడు. అతనినా మీరు దండించేది?

శ్రీహరినామ సంకీర్తన మహిమ మీకు తెలియదా? హరినామ కీర్తనాలు బ్రహ్మహత్యాది పాపాటవులను దహించెడి అగ్నికీలలు. గురుపత్నీ గమనం లాంటి పాపాలనెడి క్రూరసర్పాల పాలిటి నెమిళ్లు[1]. స్వర్ణస్తేయం[2] అనెడి కాఱు చీకటిని పార్రదోలెడి రవికిరణాలు. మధుపాన పాతకమను మదగజసమూహానికి మృగేంద్రాలవంటివి. అంతేకాదు శ్రీహరి నామసంకీర్తనాలు యమనియమాది యోగసమాధిలో నిర్వికారమైన ఆనందం పొందెడి బ్రహ్మాదులకుకూడా పొంద రాని మోక్షసామ్రాజ్యపు క్రీడాసనలు.

హరినామ సంకీర్తనాల మహిమలింకా ఎన్నోఉన్నాయి. అవి ముక్తి కాంతకు ప్రీతిపాత్రాలైన విహారకృత్యాలు. సత్యలోకానంద సంధాయకాలు. మోక్షసామ్రాజ్యాభిషేకాలు. చిరకాల తపఃఫలసారాలు. పుణ్యామూలాలు. అపాయ రహితమైన పోషకద్రవ్యాలు. అభిమతార్థప్రదాయకాలు. అజ్ఞానహరణసాధనాలు. వేదాంతోపలబ్ధాలైన అమృతసేవనాలు. ఆర్తులకు శుభంకరాలు.

విష్ణునామంకన్న కాంక్షించదగ్గది ఏదీలేదు. అది క్షేమంకరమైన పుణ్య మార్గం. మునీంద్రుల హృదయమను సరస్సు దానికి క్రీడాస్థలం. అలాంటి శ్రీహరి నామస్మరణం చేసేవానికన్న అధికుడింకెవ్వడూలేడు. "అతని కొడుకుపేరు నారాయణుడు. అతడు సుతవ్యామోహంతో నారాయణా అని పిలిచాడేకాని అతడు మనఃపూర్వకంగా నారాయణ నామస్మరణం చేయలే"దని మీరు సందేహింప నక్కరలేదు. శ్రియఃపతిపేరు ఏవిధంగా పిలిచినా శ్రీహరి అందులో అంతర్యామిగా వుండి మోక్షమిస్తాడు.

బిడ్డపేరుపెట్టి పిలిచినా విశ్రాంతి వేళల్లోనూ, ఆటపాటల్లోనూ వినోదానికి ఉచ్చరించినా, గద్యపద్యగీతాల్లో వర్ణించినా, నారాయణనామం సకలకల్మషాలను హరిస్తుంది. కాలుజారిపడినపుడుగాని, దెబ్బతగిలి దుఃఖం తటస్థించినపుడుగాని, జ్వరంతో పేలిపోతూన్నపుడుగాని, సర్పాదివిషజంతువుల పీడకలిగినపుడుగాని, ఆర్తితో తూలిపడిపోవునపుడుగాని భగవన్నామస్మరణం చేస్తే దుఃఖభారం తగ్గి పోతుంది. యమయాతనలు అనుభవింపవలసిన అవసరం ఉండదు.

ఘోర పాపాలుచేసినా, స్వల్పపాపాలు చేసినా వాటి నిష్కృతికి ఋషులు చెప్పిన ప్రాయశ్చిత్తాది కర్మలు తాత్కాలికోపశమనాలే కాని ఆ పాపాలను మొద లంట తొలగించలేవు. సర్వకర్మలను సంహరించి మనస్సుకు తత్వసిద్ధి ఇవ్వ

1. సర్పాలకు నెమళ్ళంటే భయం. 2. బంగారం దొంగలించడం.

గలిగినది ఒక హరిసేవ మాత్రమే. అన్యమేదైనా నిష్ప్రయోజనమే. హరి అంటే ఏమో తెలియని పసిబాలుడు కూడా ఇతర హరిభక్తులతో గూడి శ్రీహరి సంకీర్తనంచేస్తే అది, వాయువుతో గూడి అగ్ని గడ్డిని దహించునట్లు సకలదోషాలను దహించివేస్తుంది. శక్తివంతమైన ఔషధం యాదృచ్ఛికంగా తీసుకున్నా అది రోగనివారణం చేస్తుంది. అలాగే పామరుడు తెలియకగాని, అవహేళనగాగాని హరినామ స్మరణంచేస్తే దాని ఫలితం ఉండకుండా పోదు.

అవసాన సమయంలో ధైర్యం కోలుపోయినపుడు కేశవుని స్మరించడం పురాకృత సుకృతం అనుకోవాలి. కాక లోకాలన్నిటినీ తనలో ఇముడ్చుకొన్న సర్వేశ్వరుడేమిటి ? ఒకని మనస్సులో స్ఫురించడం ఏమిటి ? అనింద్యమూ, నిత్యమూ, జ్ఞానదాయకమూ, నిరహంకార గుణోపేతమూ, నిర్దోషమూ అయిన శ్రీహరి నామస్మరణామృతాన్ని ఈవిప్రుడు ప్రత్యక్షంగా సేవించాడు. అది వ్యర్థమౌతుందా ?—అని శ్రీహరిదూతలు భాగవత ధర్మాన్ని వివరించి ఆ బ్రాహ్మణుని యమభటుల బారినుండి తప్పించారు. అనంతరం ఆ యమభటులు మనశ్శాంతి చెంది భగవత్తత్వజిజ్ఞాసువులై చేసేది ఏదీలేక యమలోకానికి తిరిగి వెళ్లి పితృపతికి జరిగినదంతా నివేదించారు.

పాశబంధం తొలిగిపోయేసరికి అజామిళుడు మహానందం చెందాడు. స్వస్థత చిక్కింది. భయం తొలగిపోయింది. హరిదూతలకు కృతజ్ఞతా పూర్వకంగా మనస్సులో నమస్కరించాడు. లేచి చేమోడ్చి వారితో ఏదో భాషించాలనుకున్నాడు. కాని అతని మనోగతం గ్రహించి భగవద్దూతలు అదృశ్యులై శ్రీహరి సాన్నిధ్యానికి వెళ్ళారు.

వేదత్రియంనుండి గ్రహింపదగ్గదీ, సద్గుణాలకు ఆశ్రయభూతమైనదీ, భాగవత ధర్మాన్ని ప్రబోధించేదీ అయిన ఆ దూతల సంవాదం అజామిళుడు సావధానంగా విన్నాడు. వెంటనే అతనికి జ్ఞానోదయం కలిగింది. శ్రీహరి చరణ ధ్యానమనెడి నీటితో అతని పాపాలన్నీ ప్రక్షాళితమయ్యాయి. ధీరతతో అలా అరికట్టిన పాపాలను తలచుకుంటూ అతడు ఎంతో పరితపించాడు. తుదకు శ్రీహరి నాశ్రయించి యిలా తలపోశాడు.

అయ్యో ! నేను ఎంత అవ్యక్తంగా ప్రవర్తించానూ ? శూద్రస్త్రీయందు అనురాగం పెంచుకొని బిడ్డలను కని కులాన్ని గోదావరిలో కలిపాను. రచ్చలనెక్కి నోటికి వచ్చినట్లు దుర్భాషలాడి నలుగురిలో తలవంపులు తెచ్చుకున్నాను. వయసు మళ్ళినా కర్మబంధాల్లో చిక్కుకొని నిందలపాలయ్యాను. స్త్రీ లోలుడనై ఐహిక భోగాలనాశించాను. నా జన్మ తగులబడి పోయింది. నా చదువు చట్టుబడ్డది. నా శాస్త్రాలు మట్టిలో కలిసి పోయాయి. నా బుద్ధి పురువు మేసింది. నా పుణ్యం

నశించింది. నా నీతి నిర్మూల మైంది. నా తెలివి తెల్లవారింది. నా జ్ఞానం శూన్య మైంది.

అహో! పాపాగ్ని కీలలు చుట్టుముట్టి నన్ను దహింపజేయకుండా ఉన్నాయే! నాకీధైర్యం ఎక్కడనుండి వచ్చింది? నాలాంటి దురాత్ముడులేడు. తల్లిదండ్రులనూ, అకల్మషచిత్తులైన పెద్దలనూ, అనాధులనూ నానాతిప్పలుపెట్టి వెళ్ళగొట్టాను. నా వికృతచేష్టలను పరిగణించకుండా బాల్యంనుండి నన్ను పెంచి పెద్దచేసిన సుకృతాత్ములైన నా తలిదండ్రులను, ఆత్మబంధువులను కృతఘ్నుడనై విడిచిపెట్టాను. నా పాపఫలంగా నరకకూపంలోపడనున్న నన్ను రక్షించిన ఆ ధర్మపురుషులెవ్వరో?

ఏదో కల అనుకున్నాను. కాని ఆ కలలో చూచినదంతా ప్రత్యక్షమై నన్ను ఆశ్చర్యంలో ముంచి యెత్తింది. నన్ను ఈడ్చిన ఆ వీరులు భయంకరంగా ఉన్నారు. వారు వికృతాకారులు. కుటిలత్వం వారికి సహజలక్షణంగా కనబడుతోంది. వారి సంరంభం, కార్యదీక్ష చూచి నేను విస్మయం చెందాను. వారు నన్ను పాశాలతో బంధించారు. నరకకూపంలోపడనున్న నన్ను నల్వురు పుణ్యమూర్తులు వచ్చి రక్షించారు. వారినేత్రాలు తామరరేకుల్లాగా ఉన్నాయి. వారి శరీరకాంతులు సూర్యకాంతిని తిరస్కరిస్తున్నాయి. ఆ దయాశీలురు ఎవ్వరో? ఎక్కడకు వెళ్లారో ?

నన్ను రక్షించిన ఆ మహానుభావులు కాటుకలాగా నల్లగా ఉన్నారు. వారి చేతుల్లో శంఖచక్రాలున్నాయి. వారు ఆజానుబాహువులు. వారి ముఖంలో మంద స్మితం తాండవిస్తోంది. తామరరేకుల్లాంటి వారి విశాలనేత్రాలలో దయారసం తొణికిసలాడుతోంది! వారు ఎక్కడనుండి వచ్చారో? ఎక్కడకు వెళ్లారో? నా పురాకృత పుణ్యవిశేషంచేత నాకు ఆ దివ్యపురుషుల సందర్శనభాగ్యం లభించింది. కాక మహాపాతకుడనైన నాకు అది సాధ్యమా? వారి సందర్శనం వలన నా మనస్సు తేటపడ్డది. లేకపోతే పాపవర్తనంతో శూద్రస్త్రీని మరిగిన నాకు అవసానసమయంలో శ్రీమన్నారాయణ నామగ్రహణం సంభవిస్తుందా!

మహాపాపిని. మూర్ఖుడను, బ్రహ్మహంతను. దురభిమానం, లోభం, మోహం, మాత్సర్యం గలవాడను. భగవన్నామాన్ని కీర్తించే అదృష్టం నాకు లభిస్తుందా? దారుణమైన మోహాంధకారంలో కనుగానకున్నాను. నేను చెయ్యని పాతకంలేదు. కుటిలత్వం, మోసం నా నిత్యవిధులు. దుఃఖపరంపరలెన్నో నన్ను చుట్టుముట్టాయి. నింద్యుడను, గుణహీనుడను, హతభాగ్యుడను. ఏదో పూర్వ సుకృతం చేతకాకపోతే విస్మయకరమైన హరినామ స్మరణంచేసే అర్హత నాకెక్కడిది?

ఇకనైనా మనస్సును, ఇంద్రియాలను, ప్రాణవాయువును నిగ్రహించి హరివ్రతాలు ఆచరిస్తాను. పుణ్యకార్యాలు చేస్తాను. జ్ఞానమార్గంలో అడుగు పెడతాను. మోక్షపదవియందు ఆసక్తి వహిస్తాను. ఇహపర సౌఖ్యప్రదాయకుడు, మనోహరాకారుడు, సకల విశ్వంభరుడు అయిన శ్రీహరి పాద పద్మాలను భక్తితో సేవిస్తాను. నా భవబంధాలు తెగిపోయాయి. మాయాజనితమైన అజ్ఞానం నశించింది. కామ క్రోధాదుల నిర్జించాను. జనన దుఃఖహేతువైన కర్మసముద్రాన్ని తరించాను. స్త్రీ రూపంలో వచ్చి గుహలాంటి భోగలాలస అనునోటితో మ్రింగి నన్ను 'అధో లోకానికి త్రోసిన ఆత్మ మాయ తొలగిపోయింది.

అతనికి అలా ఆత్మస్నేహంచేత వైష్ణవజ్ఞాన దీపం గోచరించే సరికి భగవద్భక్తులతో సాంగత్యం చేశాడు. మంత్రతుల్యాలైన వారి వాక్కుల వలన అతనికి జ్ఞానోదయమైంది. మోహాతిశయంచే కలిగిన భవబంధాలు తెగిపోయాయి. సతీసుత బంధుమిత్రాదులపైగల భ్రాంతివీడిపోయింది. జగన్నాథుని అనుగ్రహ మొక్కటే కోరదగినదని భావించాడు. హరిభక్తుల మహిమ చెప్పనలవికాదు. వారితోడి మాటలు తరగని పుణ్యధనపు మూటలు. ముక్తికాంత విహరించెడి తోటలు. కామక్రోధాదులను శత్రువులు ప్రవేశింప నలవి కానికోటలు—

అని అజామిళుడు తత్వజ్ఞానమేమిటో తెలుసుకున్నాడు. భవబంధాలు త్రెంచివైచుకున్నాడు. గంగాద్వారం చేరాడు. అక్కడ ఒక దేవాలయంలో కూర్చుండి యోగమార్గాన్ని ఆశ్రయించి గుణాతీతుడై తన ఆత్మను పరమాత్మతో అనుసంధానం చేశాడు. అక్కడ తాను పూర్వంచూచిన పుణ్యపురుషులు నలుగురినీ చూచాడు. వారికి చాగిలి మ్రొక్కాడు. ఆనందాతిశయంతో అతనికి పులకాంకురాలు జనించాయి.. చిరుచమటలు క్రమ్మాయి. విస్మయం కలిగించి. ముఖంమీద చిరునగవుల కాంతులు తొంగిచూచాయి. అతని ఉత్సాహానికి అవధుల్లేవు. నిఖిలలోకాలచే కీర్తింపబడెడి శ్రీహరి శుభాకార సందర్శనం కోసం తహతహలాడాడు. ఆ దివ్య పురుషులకు పదేపదే ప్రణామాలుచేశాడు. వెంటనే ఆ భాగీరథీతీరాన తన భౌతిక కాయాన్ని విడిచిపెట్టాడు. ఆశ్చర్యకరంగా ఆ శ్రీహరి పార్శ్వవర్తుల స్వరూపం ధరించి వారితోగూడి మణిమయమైన కాంచన విమానం ఎక్కి నిఖిలానందభోగాస్పదమైన వైకుంఠానికి వెళ్లాడు. అక్కడ అతనికి శ్రీమన్నారాయణ చరణ పరిచర్య చేసే మహోన్నతస్థితి లభించింది. ఈరీతిగా సర్వధర్మాలను త్యజించి దాసీపతియై నింద్యకర్మలాచరించి పతితుడై నరకకూపంలో కాలుపెట్టడానికి సిద్ధంగా ఉన్నపుడు ఆ విప్రుడు భగన్నామగ్రహణంచేత సద్యోముక్తుడయ్యాడు.

కనుక పరీక్షిన్నరేంద్రా! మనస్సు దుర్మదంతో ఎన్నిదారులు త్రొక్కినా కర్మబంధంనుంచి విడివడడానికి శ్రీమన్నారాయణుని నామం ప్రేమతో ఉచ్చరించ

డంకంటే వేరేమర్మంలేదు. ఈ ఇతిహాసం పరమ పవిత్రమైంది. అనన్యమైన భక్తితో దీన్ని విన్నా, చదివినా మోక్షం కరగతమౌతుంది. అతదు యమకింకరుల కంట బడదు. ఇలా కొడుకునకు పెట్టిన శ్రీహరినామం అవసాన కాలంలో స్మరించి అజామిళుడు హరినిలయం చేరాడు. ఇక విశుద్ధమైన భక్తితో హరినామస్మరణం చేస్తే ఎంతఫలం ఉంటుందో ఊహించు. ఇన్నిమాట లెందుకూ? మనస్సులో శ్రీహరిని స్మరించిన వారికి కైవల్యపదం ఇట్టేలభిస్తుంది. అలా హరినామ స్మరణం చెయ్యకుండా ఎన్నిత్రోవలు త్రొక్కినా అది లభించదు."

అని శుకర్షి అనేసరికి పరీక్షిన్మన్నరేంద్రుడు– "మునీంద్రా! విష్ణుదూతలు యముని ఆజ్ఞను ధిక్కరించి యమభటులను తరిమివేశాక ఏంజరిగిందీ! వారు వెళ్లి యమునకు జరిగిన వృత్తాంతం అంతా చెప్పలేదూ! చెపితే అతడేమన్నాడో! ఎన్నడైనా ఎవరైనా యమదండనను తిరస్కరించిన దృష్టాంతం ఉందా? ఈ సందేహం నీవొక్కడవు తప్పితే ఇంకెవ్వరూ తీర్చలేరు. నీ వాగమృత రసం త్రాగితే మనస్సు తేటపడుతుంది–" అనేసరికి శుకయోగి యిలా అన్నాడు.

"రాజేంద్రా! విష్ణుభటులచేత తిరస్కృతులైన యమభటులు యమునకు జరిగినగాథ అంతా వివరంగా చెపుతూ ఇలా అన్నారు. దేవా! మేమొక విషయం తెలిసికోవాలని కుతూహలపడుతున్నాం. లోకంలో ధర్మకార్యాలు, అధర్మకార్యాలు ధర్మాధర్మకార్యాలుచేసెడి మూడువిధాలైన పురుషులున్నారు. అయితే ఆయాకర్మ ఫలాన్ని తెలిసిదండించేవారు ఎంతమంది ఉన్నారోచెప్పండి. శాసించేవారు చాలమంది ఉంటే తలకొకశాస్త్రాన్ని పురస్కరించుకొని ఒకడు విధించిన దానిని మరొకడు నివారిస్తాడు. ఎవడికివాడే తనశాసనం అప్రతిహతమైనదని అనుకొనడం-సామాన్య మండలాధిపతి తానే సార్వభౌముడననీ, సర్వనియంతననీ అనుకున్నట్లుంటుంది. ఒకవేళ వివిధకర్మలు ఆచరించేవారు ఎందరో ఉండడంచేత శాసించేవారు కూడా పెక్కండ్రు ఉండవచ్చు. అయితే వారి శాసనాలు పరస్పర విరుద్ధాలు కాకుండా ఏకానుగతాలై ఉండాలి. లేకపోతే లోకవ్యవస్థ తారుమారవుతుంది.

కనుక ముల్లోకాల్లోని భూతకోటిని వారి కర్మవిపాకాన్ని బట్టి దండింపదగిన వాడవు నీవొక్కడవే అనిన్నీ నీ శాసనం అనుల్లంఘనీయమనిన్నీ మా ప్రగాఢ విశ్వాసం. నీ కొక్కనికి తప్పితే దండ ధరత్వం ఇతరులకు ఎలా ఉంటుందీ? లోకంలో నీ వొక్కడివే దండనవిధిని చేపట్టి దండ్యులను దండిస్తావు. అంచేతనే నిన్ను దణ్ణధరుడంటారు. నీ శాసనాన్ని ముల్లోకాల్లోను కాదనేవాడులేడు, ఇంతకూ ఏమిజరిగిందంటే?

నీ శాసనాన్ని అనుసరించి మేం మనుజలోకంలో ఒక క్రూరాత్ముని పాశ బద్ధుణిచేసి ఈడ్చుకొనివస్తుంటే అద్భుతాకారులైన ఎవరో నలుగురు మమ్మల్ని

అదల్చి ఏ యాజ్ఞనుకూడా కాదని ఆతని పాశవిముక్తునిచేశారు. మమ్మల్ని గెంటివేశారు. వారెవ్వరూ? అని యమభటులు పరితాపంతో పలికేసరికి దండధరుడు పుండరీకాక్షుని పాదకమలాలను మనస్సులో ధ్యానించి నమస్కరించి పరమ భక్తితో వారికిలా అన్నాడు.

వినండి. నాకంటె ఘనుడొకడున్నాడు, ఆతడీ బాహ్యచక్షువులకు గోచరుడు కాడు. అతడు విశ్వమంతటా అంతర్యామియై ఉంటాడు. నూలుపోగులు వస్త్రం అంతటా ఇమిడి ఉన్నట్లు విశ్వమంతా అతనిలో వ్యాపించిఉంటుంది. విశ్వంలోని జీవరాసులన్నీ దామెనకు (గుంజకు) కట్టిన పశువుల్లాగా ఒక పరిధికి లోబడి తిరుగుతూ ఉంటాయి. నేను అనుదినం సేవించేది ఆ మహానుభావునే. సృష్టిస్థితి సంహారాలు అతనికి లీలావినోదాలు. లోకాలన్నీ అతనిలో అంతర్లీనమైఉంటాయి. అతని నామసంకీర్తనం కర్మబంధాలను అణచివేస్తుంది.

నేనూ, మహేంద్రుడూ, వరుణుడూ, వీతిహోత్రుడూ, నిరృతీ, వాయువూ, సూర్యచంద్రులూ, బ్రహ్మ, మరుద్గణాలు, మహేశుడూ, రుద్రగణమూ, సంయములూ, సిద్ధులూకూడా ఆతని రూపాన్ని చూడలేం. సత్త్వప్రధానులైనవారే శ్రీహరి నిత్యైకత్వాన్ని గ్రహించలేరు. ఇక రజస్తమోగుణపాశాలచే బద్ధులైన వారి కది సాధ్యమా? తనయందూ, తనకు వెలుపలా వెలుగొందెడి అభవుడూ, అమేయుడూ, అవ్యయుడూ, అనంతుడూ అయిన పురుషోత్తముని సర్వవస్తువులనూ చూస్తూ తనను తాను చూడలేని కన్నులాగా ఎంతటివాడునూ చూడలేడు.

మీరు చూచిన ఆ నల్వురు మనోహరాకారులూ, భక్తలోకపాలకుడూ, దుష్టజన సంహారకుడూ అయిన శ్రీహరి ప్రేమకుపాత్రులైన దూతలు. సురేంద్రాదులు కూడా వారికి నమస్కరిస్తారు. రూపంలోను, గుణంలోను, స్వభావంలోను వారు శ్రీహరికి తీసిపోరు. దేహకాంతులు దిక్కులు పిక్కటిల్లగా వారెప్పుడూ అన్ని లోకాల్లో సంచరిస్తూంటారు. వారు మహాబలాఢ్యులు, ధర్మనిరతులు, శాంతస్వభావులు, సాహసోపేతులు. హరిభక్తులను రక్షించడానికి వారెప్పుడూ తిరుగుతూ ఉంటారు. నావలనను, శివలనను, దేవాసురవలనను ముల్లోకాల్లో వైష్ణవులకు ఏ కష్టాలూ రాకుండా చూడడం వారి విధి.

దేవతలు, గరుడులు, ఉరగులు, సిద్ధులు, సాధ్యులు చరులు ఋషులు తాపసులు, ఖేచరులుకూడ భగవన్మహితధర్మాన్ని తెలుసుకోలేరు. ఇకవారేమిటి? శరీరమంతా కన్నులుగల శక్రునకు, వామభాగాన స్త్రీమూర్తిని ధరించిన శివునకు, ప్రాణికులవేల్పు బ్రహ్మకుకూడా శేషశాయియైన శ్రీహరి తత్త్వం తెలియదు. ఇక అంతటంతటకు అది సాధ్యమా? వైష్ణవజ్ఞానం మహాద్భుతమైనది. అది తెలిసినవారు అరిది.

శివుడు, బ్రహ్మ, కార్తికేయుడు, కపిలుడు, నారదుడు, భీష్ముడు, మనువు, బలి, జనకుడు, ప్రహ్లాదుడు, శుకుడు, వ్యాసుడు ఈ పన్నెండుగురు తప్ప విశుద్ధమూ, జ్ఞానానందమయమూ, ఉపనిషద్రహస్యమూ అయిన శ్రీహరి నామ మహిమచేత ప్రదీపితమైన భాగవతధర్మక్రమాన్ని ఇతరులెవ్వరూ ఎఱుగరు. హరికీర్తనం అమరం. అది సద్ధర్మపథం. మూర్తీభవించిన భక్తియోగం. మీరు ఆ దేవదేవుని నామకీర్తన ఫలం కనులారా చూచారుకదా! మృత్యుపాశంలో తగుల్కొనికూడా అజామిళుడు జాణతనంతో తప్పించుకొన్నాడు. శ్రీహరి నామసంకీర్తనం పాపాటవులను దహించివేస్తుంది. అందులో సందేహంలేదు. తుంటరి, దోషకారి అయ్యిండీన్నీ అజామిళుడు అవసానదశలో నారాయణుడను పేరుగల తనకొడుకుని పిలిచి ముక్తిచెందలేదూ? దురంతమైన మాయచే జ్ఞాన దీప్తిని పోగొట్టుకుని హీనాత్ములైనవారు ఇలాంటిగాథలు నిజమని నమ్మరు.

ఈవిధంగా బుధులు ఏకాగ్రమైన మనస్సుతో నిష్కామంగా శ్రీహరిని హృదయమందు నిలుపుకొని భాగవతయోగిగా పరిపక్వదశ పొందుతారు. అటువంటి వారిజోలికి మీరు వెళ్ళవద్దు. వారు మా దండన పరిధిలోనికిరారు. వారిని గుర్తించి ఆదరిస్తే సకలపాపాలు తొలగిపోతాయి. వారిని రక్షించడానికి విష్ణుచక్రం ఎప్పుడూ వారిని వెన్నాడి తిరుగుతూనే ఉంటుంది. వారిని దేవతలు కూడా సేవిస్తారు. ముక్తిపొందడానికి వారికంటె అర్హులైన పెద్దలెవ్వరూలేరు.

సిద్ధులు, సాధ్యులు, ఖేచరులు, ఈశానులు ఎవరిగాథలను కీర్తిస్తారో, ఎవరు ముక్తిసౌధంలో స్వర్ణమయములైన చంద్రశాలల్లో విహరిస్తూ ఉంటారో, ఎవరిచేతుల్లో మహోగ్రములైన శంఖం, చక్రం, ఖడ్గం, గద ఉంటాయో వారిని వైష్ణవులుగా గ్రహించండి. వారు మనోహరాకారులు. వారికి వారేసాటి. భాగవతులంటే ఇంకా ఎలాంటివారో చెపుతాను వినండి. భాగవతులు వేదాంతంలో స్థిరమైన బుద్ధి కలిగి దానికి అనుగుణమైన భగవత్ప్రసంగాలు చేస్తారు. సనకాది మునీంద్రులనుభవించెడి నిత్యానంద భాగ్యానికి నోచుకొన్న ధన్యాత్ములువారు. శ్రీకృష్ణ పదధ్యానమనెడి అమృతాన్ని సేవించడంచేత వారు పరిణత మనస్కులై ఉంటారు. పాపసమూహాన్ని త్రొక్కివేయడంలో వారు పరుషంగా భయంకరంగా వ్యవహరిస్తారు. వారు తత్త్వార్థం తెలిసినవారు. బ్రహ్మవాదులను అనుసరిస్తారు. వారున్న చోట సిరులుంటాయి. వారికెన్నడూ ఏచేటూ కలగదు.

అందుచేత మీరు విష్ణుభక్తుల జోలికి పోవద్దు. శ్రీహరిపదధ్యానానికి విముఖులైన ధూర్తులను మాత్రమే బంధించి తీసుకొనిరండి. పరిహాసానికైనా హరినామ స్మరణం చెయ్యనివారిని, కలయందైనా శ్రీహరి పాదకమలాలను దర్శించనివారిని, వినోదానికైనా శ్రీహరి ప్రసంగానికి చెవియొగ్గనివారిని, యాత్రల్లోను, ఉత్సవాల్లోనూ

ఐనా ఈశ్వరాలయంవైపు అడుగుపెట్టని వారిని, భాగవతుల పాదధూళిసమస్త తీర్థసారమని తెలియనివారిని, వారిని అనుసరించు వారిని బంధించి తీసుకొనిరండి.

సమస్తపాపాలకు నిలయమైన యింటిలో మతిచెడి తృష్ణాతురులై సాధువులను పరిగణింపక వర్తించెడి వంచకులను పట్టి తీసికొనిరండి. నోటితో హరినామం పలకని వానికి, మనస్సుతో హరిచరణ ధ్యానం చెయ్యనివానికి విష్ణుభక్తులకు లభించినట్లు ముక్తిఎలా లభిస్తుందీ? అదేమైనా సులభంగా అందుకొని అనుభవించడానికి పెరటిలో తంగేటి చెట్టునకు పట్టిన తేనెపట్టా? కనుక శ్రీహరియెడగల భక్తి యోగమే ముక్తియోగమని గ్రహించినవారూ, వారిని అనుసరించెడివారూ, త్రొక్కిన దారిని త్రొక్కకండి.

శ్రీకృష్ణుని నామకీర్తనం జగన్మంగళం. జగన్మోహనం. ముల్లోకాల్లో అందరూ ఆ నామాన్ని కీర్తిస్తారు. సకలపాప పరిహారానికి అది ఏకైక మార్గం. అది దుఃఖాన్ని దారిద్ర్యాన్ని నిర్మూలిస్తుంది. మాయాగుణాలను ఛేదిస్తుంది. శ్రీహరి పరాక్రమ గాథలు వినడంవల్ల మనస్సు నిర్మలమైనట్లు ఇతర వ్రతాచరణంవల్ల కాదు. శ్రీహరి పాదపద్మాలను తమ హృదయసీమలో నిలుపుకొనువారు ఇతర పాపకర్మలైన అవిద్యావ్యసనాల జోలికిపోరు— అని యమధర్మరాజు భగవన్మహిమను కీర్తింపగా వినికాలకింకరులు విస్మితులయ్యారు. నాటినుండివారు విష్ణుభక్తులవంక తేరిచూడటానికి కూడా భయపడతారు. నరేంద్రా! పరమ రహస్యమైన ఈ ఇతిహాసాన్ని పూర్వం జ్ఞాననిధియైన అగస్త్యుడు పుణ్యనిలయమూ, దుఃఖవిలయమూ అయిన మలయపర్వతమందు పురాణ పురుషుడైన పురుషోత్తముని ఆరాధిస్తున్నపుడు నాకు చెప్పాడు" అని శుకయోగి అనేసరికి పరీక్షిన్నరేంద్రుడు విస్మితుడై ఆనందపారవశ్యంతో— "మునీంద్రా! స్వాయంభువ మనువు పరిపాలించేటప్పుడు దేవతలు, దానవులు, నానావిధ నరజాతులు, పశువులు, సర్పాలు మొదలైన వాని సృష్టిక్రమం చెప్పావు. దానినే విస్తరించి చెప్పు"— అని అర్థించగా శుకయోగి ఆనందించి యిలాచెప్పడం మొదలుపెట్టాడు.

"ప్రాచీన బర్హిషుని ప్రఖ్యాతిగన్న ప్రచేతసు పుత్రులు పదిమందీ కొన్ని వేల సంవత్సరాలు సముద్రమధ్యంలో రుద్రోపదిష్టమైన గీతాన్ని జపిస్తూ తపస్సు చేశారని చెప్పానుగదా! తపశ్చర్యానంతరం వారు సముద్ర మధ్యనుండి బయటికివచ్చి చూచేసరికి ప్రాచీన బర్హికాలంలో భూమండలం అంతా యజ్ఞవాటిక కావడంచేత కృష్యాదులు లేక వృక్షాదులు యథేచ్ఛగా పెరిగి భూమండలం అంతా క్రమ్మివేయడం చూచి వారు ఆగ్రహం చెందారు వృక్షజాతిని నిర్మూలం చెయ్యాలని సంకల్పించారు. వెంటనే వారి నోటినుండి వాయుప్రేరితాగ్నులు బయలుదేరి వృక్షాలను దగ్ధం చెయ్యడం మొదలుపెట్టాయి. అపుడు ఓషధీశుడైన చంద్రుడు తల్లడిల్లి వారి కోపాన్ని ఉపశమింప జేయడానికి వారిని ఇలా అర్థించాడు—

మహానుభావులారా. దిక్కులేని ఈ వృక్షసమూహంపై మీకెంత కోపందేనికి? వీటిని మీరు ఇలా దగ్ధంచెయ్యడం తగదు. సర్వాత్ముడు మిమ్మల్ని ప్రజాసృష్టిని వృద్ధిచెయ్యడానికి సృజించి మిమ్మల్ని ప్రజాపతులన్నాడు. అలాంటి మీరే ఈవన స్పతులను దహింపచెయ్యడం సమంజసమా! సృష్టికి పూర్వం బ్రహ్మకుకూడా కారణభూతుడైన శ్రీహరి వనస్పతులను ఓషధులను జీవకోటి శారీరక పుష్టి కాంక్షించి ముందుగా సృష్టించాడు. వాటికి పాదాలులేవు. అవి కదలలేవు. వాటి ఆహారాన్ని అవే సంపాదించుకొని స్వయం పోషకాలుగా ఉండడమేకాక పాదచారు లైన జీవకోటికికూడా ఉపభోగ్యమైన ముఖ్యాన్నాన్ని అవే అందజేస్తున్నాయి. కరచరణాలుగల నరులకు చేతులులేని చతుష్పాత్తులుకూడా ఆహారంగా సృజింప బడ్డాయి. అవీకాక ఈశ్వరుడు మిమ్మల్ని అనఘులైన ప్రజాస్రష్టలుగా పేర్కొ న్నాడు. అలాంటి మీరు సర్వోపభోగ్యాలుగా సృజింపబడిన ఈ వనస్పతులకు, ఓషధులకు ద్రోహం చెయ్యరాదు.

మీ తండ్రులు, తాతలు ఎంత శాంతస్వభావులూ? వారెన్నడైనా కోపాన్ని దగ్గరకు రానిచ్చారా? మీరున్నూ వారిని అనుసరించి దుష్కృతమతమైన కోపాన్ని విడిచిపెట్టండి సత్వగుణసంపన్నులైన మహాపురుషులను స్మరించండి. భయాక్రాంతమైన ఈ వృక్షసముదాయాన్ని కరుణించి కాపాడండి. పిల్లలకు తల్లి దండ్రులూ, కళ్ళకు రెప్పలూ, కాంతకు భర్తా, ప్రజలకు గృహస్థుడూ, మూఢు లకు ఉత్తములూ, బంధువులు. అంతేకాని ఆపదలో అడ్డుపడని మూర్ఖులు నిజమైన బంధువులెలా అవుతారూ?

అఖిల భూతకోటి శరీరమందున్న ఆత్మయే పరమేశ్వరుడు. ఆ పరమేశ్వ రుని అంతర్దృష్టితో చూడాలి. అలా చూడగలిగిన పరిశుద్ధాత్ములైన మిమ్మల్ని అచ్యుతుడు మెచ్చుకుంటాడు. మీరు ఎక్కడెక్కడ సర్వాంతర్యామియైన భగ వంతుని చూస్తారో అక్కడ మీరు మీ కోపాన్ని ప్రదర్శించరాదు. కనుక ఇప్పు డైనా మీరు వివేచనతో నాప్రార్థన అంగీకరించి దగ్ధంకాగా మిగిలిన వృక్షసంతతిని బ్రతకనీయండి. ఇదిగో మారిషయను ఈ కన్యను మీరు గ్రహించండి. ఈమె కండుమహర్షికి ప్రమ్లోచయను అచ్చరవలన జనించింది. సకల శుభలక్షణాన్విత యైన ఈమెను ఈ వృక్షాలు పెంచాయి. వివాహయోగ్యఅయిన ఈమెను మీరు పత్నిగా గ్రహించండి- అని చంద్రుడు వారికి ఆ కన్యనిచ్చి వెళ్ళిపోయాడు.

వారు ఆమెను విధి చోదితంగా వివాహమాడారు. పూర్వం బ్రహ్మదేవుని అంగుష్ఠాన ఉదయించి రుద్రాపరాధవశంచేత ఆ శరీరాన్ని విడిచిన దక్షుడు ప్రచేతసులకు మారిష కడుపునపుట్టి ప్రాచేతసుడని పేరుపొందాడు. ఆతని సంతానం భూమండలం అంతా వరదలో నీరు నిలిచియున్నట్లు నిండి నిలిచిఉంది.

అతడు మనస్సంకల్పంచేత కొంత సృష్టినీ, వీర్యంచేతకొంత సృష్టినీచేశాడు. ఆ సృష్టిలో కొన్ని ఆకాశాన, కొన్నిభూమిమీద, కొన్ని అడవుల్లో, కొన్ని నీటిలో చరిస్తున్నాయి. అలాగే కొన్ని పగటివేళా కొన్ని రాత్రిపూటా తిరుగుతాయి. అతడు నరులు, సురలు, గరుడులు, ఉరగులు, కిన్నరులు, దానవులు, యక్షులు, పక్షులు, పర్వతాలు, వృక్షాలు మొదలైన భౌతిక సృష్టిని అపారంగాచేసి మహా కీర్తి గడించాడు. అంతటి మహత్తరమైన జీవసృష్టిచేసినా అతనిలో లేశమాత్ర మైనా గర్వంగాని మహాకార్యంచేశాననే భావనగాని లేదు. అలా అతను బహు విధాలుగా అనేకముఖాలతో అనేకరూపాలతో అనేకలోకాల్లో భూతకోటిని సృజించాడేకాని ఎందుచేతనో మనస్తాపం చెందాడు. ఇక సృష్టి కార్యంమాని పరమపురుషుని సేవించాలనుకున్నాడు. వెంటనే వింధ్యప్రత్యంత పర్వతానికి వెళ్లాడు. హాసభావవిలాసాలతో గూడిన క్రీగంటి చూపులతో కోయపడుచులు ఆ కొండకోనల్లో తిరుగుతూ ఎంతోముచ్చటగా ఉన్నారు. ఆ ప్రాంతం ఆనంద నిలయం. సకల సుఖాస్పదం. అచట భేదమనేదిలేదు. ప్రాచేతసుడైన దక్షుడు ఆ వింధ్యపాదమందున్న అఘమర్షణమను తీర్థంలో స్నానంచేసి యజ్ఞదీక్షితుడై దారుణమైన తపస్సున కుపక్రమించి శ్రీహరిని హంసగుహ్యమను స్తోత్రంతో ఇలా స్తుతించాడు.

## దక్షకృత హంస గుహ్యస్తోత్రం

ఎవని సంకల్పజ్ఞానం వ్యర్థంకాదో; ఎవడు గుణోన్మేషణానికి కారణభూత మైన ప్రకృతియే శరీరంగా గలవాడో, ఆ పరమేశ్వరునకు నా నమస్కారం. జీవాంతర్యామియైన ఏ పరమాత్మను జీవుడు దేహగోచర జ్ఞానంవలన తెలిసికొన లేడో, ఆ పరంధామునకు నాప్రణుతి. మనస్సు, శరీరం, భూతాలూ, ఇంద్రియాలూ ప్రాణాలూ, తమకంటె వ్యతిరిక్తుడై తమ్ము తెలిసికొనుచున్న జీవాత్మను తెలిసి కోలేనట్లు, జీవుడు తనను, తనగుణాలను, తనశరీరాన్ని ఎఱిగి తనకంటె వ్యతి రిక్తుడైయున్న యే పరమాత్మను నెఱుగజాలడో ఆ ఆది పురుషునకు నా కై మోడ్పు. నానావిధ నామరూపాలుగల మనస్సునకు సమాధిస్థితిలో, రాగాదుల చేత కలుషితంకాని ఉపాసనాత్మక జ్ఞానంవలన నెవని సాక్షాత్కారం లభిస్తుందో అట్టి హంసస్వరూపునకు నా ప్రాంజలి.

వాక్కులచేతను, బుద్ధిచేతను, ఇంద్రియాలచేతను, మనస్సుచేతను, ఎవని గుణరూపాలు చెప్పడానికిగాని, నిరూపించడానికిగాని సాధ్యంకాదో, [illegible] ణుడో సర్వజ్ఞుడో, ఎవనివలన సృష్టి స్థితి సంహారకార్యాలు జరుగుతూ ఉంటాయో ఆ పరతత్త్వాన్ని నేను ఆశ్రయిస్తాను. [illegible] కారణత్వాన్ని గూర్చి వాద ప్రతి



వాదాలుచేసే వారికి ఎవని ప్రభావం విషయీభూతమై అప్పటప్పటికి వ్యామోహాన్ని కలిగిస్తుందో ఆ అనంతకల్యాణగుణాలుకల దేవదేవుడు నన్ను అనుగ్రహించు గాక! ఒక్కడైయుండి 'అస్తి, నాస్తి'యను వస్తుద్వయ నిష్ఠకలిగి విరుద్ధ ధర్మాలుగా కనబడు ఉపాసనా శాస్త్రానికీ సాంఖ్యశాస్త్రానికీ సమమై వీక్షింపదగి అతీంద్రియశక్తి సంపన్నుడైన పరముడు నన్ను రక్షించుగాక! తెలిసికొన నలవి కాని రూపగుణాలు కలవాడైనప్పటికీ, లోకసంగ్రహార్థం ఎవడు నామరూపాలతో తేజరిల్లుతూ ఉంటాడో అట్టి అనంతుడైన భగవంతునకు నా ప్రణుతి. ఎవడు ప్రాణికోటి పురాకృత జ్ఞానవిశేషంచేత అంతర్యామియై పృథ్వీకంటె విలక్షణమై పృథ్వియొక్క గుణమైన గంధాన్ని ఆశ్రయించిన వాయువులాగా వర్తిస్తూ ఉంటాడో ఆ పరమేశ్వరుడు నా మనోరథాన్ని సఫలం చేయుగాక—

అని యిలా ప్రాచేతసుడు నుతింపగా భక్తవత్సలుడైన శ్రీహరి గరుడారూఢుడై వచ్చి అతని యెదుట సాక్షాత్కరించాడు. గరుడుని యిరువైపులా నీలమేఘశ్యామలుడైన ఆ శ్రీహరి పాదాలు మేరుపర్వతం ఉభయ తటముల యందున్న నీలమణిగనుల్లాగా కాంతులు చిమ్ముతున్నాయి. దిగ్గజాల తొండాల లాగాఉన్న అతని ఎనిమిదిచేతుల్లో చక్రం, విల్లు, కత్తి, శంఖం, నందకం, పాశం, చర్మం, గద మెఱుస్తున్నాయి. నల్లనిమేనితో, చల్లనిచూపుతో, నగుమోముతో, పసిడికాసెతో, మణిమయభూషణాలకాంతులు వెదజల్లుతూ, వచ్చిన ఆ దేవదేవుని సోయగం వర్ణింపనలవికాదు.

అంతేకాదు. మణిమయాలైన కుండలాలు చెక్కిళ్లపై ప్రతిబింబించి రాకా చంద్రుని రామణీయకాన్ని తలపింపజేస్తున్నాయి. కిరీటకాంతులు ఆకాశలక్ష్మికి కుంకుమ పూవురంగు చీరెను సంతరించినట్లు అంతట వ్యాపించాయి. వక్షస్థల మందలి వనమాల వన్నియలు శ్రీవత్స కౌస్తుభాల కాంతులతో స్పర్థవహించి నట్లున్నాయి. ఆతడు ధరించిన స్వర్ణాభరణాలు నీలాద్రిని పెనవేసుకున్న మెఱుపు తీగల్లాగా తళుక్కుమంటున్నాయి. అతడు జగన్మోహనాకారుడు. నారదాది మునులు అతన్ని సేవిస్తూ అతని వెంటనున్నారు. దేవతలు అతన్ని స్తుతిస్తున్నారు. గంధర్వులు కిన్నరులు శ్రవణసుభగంగా గానం చేస్తున్నారు.

అలా తన యెదుట సాక్షాత్కరించిన సర్వేశ్వరుని చూచి దక్షుడు ఆశ్చర్య చకితుడయ్యాడు. భయం, హర్షం, విస్మయం మనస్సులో ముప్పిరికొనగా స్వాస్థ్యం కోల్పోయాడు. కొంతసేపటికి తేరుకొని తత్తరపాటుతో నేలపై సాగిల పడి దండప్రణామాలాచరించాడు. లేచి చేతులు జోడించాడు. సెలయేళ్ళ వచ్చి పడడంతో పొంగి గట్లను ఒరయుచూ ప్రవహించి సముద్రాన్ని తన్ని నిలిచిన నదిలాగా ఆనందాతిశయంతో దక్షుని శరీరం ఉప్పొంగిపోయింది. ఎలాగో చిత్తాన్ని ఆత్మాయత్తం చేసుకున్నాడు. కాని మాట్లాడలేకపోతున్నాడు. మంగళా

పాదకాలైన శ్రీహరి నామాన్ని కీర్తించలేకపోతున్నాడు. అతని సాహసకృత్యా లను నుతింపలేకపోతున్నాడు. తన మనోవాంఛితాన్ని చెప్పలేకపోతున్నాడు. అలా సంవిగ్నస్థితిలోపడిన దక్షుని చూచి శ్రీహరి సర్వజ్ఞుడు, సర్వప్రాణి హృదంత రస్థుడు కావున ఆతని మనోరథం తెలిసికొని ఆర్తజనపోషణాలైన భాషణములతో ఇలా అన్నాడు.

దక్షా! నీ తపస్సునకు మెచ్చాను. ఇప్పటికది ఫలించింది. లోకంలో నా వైభవాన్ని ఉన్నదున్నట్లుగా పొందడానికి ఎవనికీ సాధ్యంకాదు. ఇక తపం చాలించు. జీవకోటికి వైభవాలు సంక్రమిస్తాయి. నా మనస్సులోగల సంకల్పం కూడా అదే. నీ మనోవాంఛితంకూడా అదేకదా! అది ఇప్పటికి నీవలన వ్యక్తమై ఫలించింది. బ్రహ్మ, రుద్రుడూ, ప్రజాపతులూ, మనువులూ, ఇంద్రులూ- సమస్త భూతకోటికి భూతిహేతువులైన నా భూతివిభవాలే. యమనియమాలతో గూడిన సంధ్యావందనాది రూపకమైన తపస్సు నా హృదయం. సాంగమైన జప ధ్యాన రూపకమగు విద్య నా శరీరం. ధ్యానాది విషయాలకు సాధనభూతమైన భాషనాదిశబ్దవాచ్యమగు క్రియ నా ఆకృతి. క్రతువులు నా అవయవాలు. ధర్మం నా ఆత్మ. దేవతలు నా ప్రాణాలు. వేదం నా స్వరూపం.

జగదుత్పత్తికి మునుదు నేనొక్కడనే ఉంటాను. వెలుపలగాని లోపలగాని అన్యమేదీ ఉండదు. సుషుప్తియందు సమస్తమూ లీనమైనపుడు సంజ్ఞామాత్రుడూ, అవ్యక్తుడూ అయిన జీవునిలాగా నేనొక్కడనే ఉంటాను. అనంతుడనై అనంత గుణాలుకల మాయవలన గుణాత్మకమైన బ్రహ్మాండమూ, అయోనిజుడూ, స్వయంభువూ అయిన బ్రహ్మ ఉద్భవించారు. కాని నా వీర్యంచేత ప్రవృద్ధుడై యుండిన్నీ చతుర్ముఖుడు అసమర్థుడులాగా స్వీయవిధిని నిర్వర్తింపలేనేమో అను పిఱికితనంతో సృష్టికార్యానికి పూనుకున్నాడు. నేనది గ్రహించి అతనిని తపశ్చర్యకు పురికొల్పగా అతడు ఘోరతపం చేశాడు. అనంతరం ఆ తపోబలం చేత తొల్తగా ప్రజాపతులగు మిమ్మల్ని సృజించాడు. కాని బ్రహ్మకు కలిగి నట్లుగానే నీకున్నూ సృష్టికార్యంలో నిస్పృహ ఏర్పడ్డది.

ఇదిగో ఈకన్య అసిక్ని. ఈమె పంచజన ప్రజాపతి కూతురు. ఈమెను నీవు భార్యగా గ్రహించు. మిథునకృత్యమే ధర్మంగాగల నీవు అదే ధర్మంగాగల ఈమెయందు ప్రజాసృష్టిని విస్తృతంగా చేస్తావు. నీ అనంతరం ఇదేరీతిలో ప్రజలందఱు నా మాయచే మోహితులై మైథున ధర్మం పాటించి ప్రజావృద్ధి చేస్తూ నన్నారాధిస్తారు— అని పలికి విశ్వభావనుడైన శ్రీహరి స్వప్నంలోచూచిన అర్థంలాగా తటుకున అంతర్హితుడయ్యాడు.

అపుడు దక్షుడు విష్ణుమాయా శక్తిచేత పాంచజనియైన అసిక్నియందు పదివేలమంది కొడుకులను కన్నాడు. వారుహర్యశ్వులనే పేరుతో ప్రసిద్ధికెక్కారు.

సమధర్మ శీలురైన వారందరు తండ్రి యాజ్ఞానుసారం ప్రజాసృష్టికోసం తపస్సు చేయడానికి నారాయణ సరస్సను తీర్థం దగ్గఱకు వెళ్లారు. అది పడమట దిక్కున సింధుసముద్ర సంగమ స్థలంలోఉంది. దేవతలు, మునులు, సిద్ధులు ఆ పుణ్యతీర్థాన్ని సేవిస్తూ ఉంటారు. ఆ సరోజలాన్ని స్పృశిస్తేచాలు సకల పాపాలూ హరిస్తాయి. మనస్సు నిర్మలమౌతుంది. హర్యశ్వులు ఆ సరస్తీరాన తపస్సు చేస్తుండగా దేవర్షి నారదుడు అక్కడకువచ్చి వారితో ఇలాఅన్నాడు—

మీరు మూఢులు. మీముందుగతి యేమిటో మీకు తెలియదు. ఇంతకు మీరు పసిబిడ్డలు. ఈభూమియొక్క పరిమాణం ఎంతోకూడా మీకు తెలియదే! ఊరకే ప్రజోత్పత్తి చేస్తుపోతే అందులో ఏంగొప్పదనం ఉంది? మీకింకో రహస్యం చెపుతాను వినండి. ఇచట మహాత్ముడైన పురుషు[1] డొకడున్నాడు. అనేక రూపాలు గల ఒకస్త్రీ[2]ఉంది. అది పుంశ్చలి[3]. అక్కడ ఒక పెద్ద గొయ్యి[4]ఉంది. దానిలో ఒకనది[5] రెండువైపులా ప్రవహిస్తూఉంటుంది. ఇరువదియైదు ద్రవ్యాలతో[6] నిర్మితమైన గృహం ఒకటిఉంది. అక్కడ ఒక హంస[7] బయటకు రావడానికి దారి తెలియక అక్కడే ఉంటుంది. వజ్రసన్నిభమైన ఒకయంత్రం[8] దానంతట అదే తిరుగుతూ ఉంటుంది. ఆ పరమ రహస్యాలు గ్రహించక ఆత్మఅంటే యేమిటో తెలియక తండ్రి యాజ్ఞను పాలిస్తామంటున్నారు. మీరు మూఢులని తెలిసీకూడా మిమ్మల్ని అనే పనిఏముందీ?— అని నారదుడనే సరికి హర్యశ్వులు సహజబుద్ధి చేత దుర్భేద్యాలైన నారదవాక్యాలను గురించి తమలోతాము ఇలా వితర్కించుకున్నారు.

ఈ భూమియొక్క అంతం మనకు తెలియదు. క్షేత్రం (శరీరం) అంటే ఏమిటో బంధహేతువైన లింగశరీరం (జీవుడు) అంటే ఏమిటో? తెలిసికోకుండా ఊరకే అసత్కర్మలుచేస్తే మోక్షం లభిస్తుందా? సర్వసాక్షీ, స్వాశ్రయుడూ, స్వయంభువుడూ, పరముడూ, అయిన భగవంతుడొకడున్నాడు. అతణ్ణిచూడక బ్రహ్మకైనా దుష్కర్మలుచేస్తే ముక్తిపదం ప్రాప్తిస్తుందా? పాతాళంలో చిక్కుకొని అక్కడనుండి బయటపడేదారి తెలియని వానివలె జీవుడు హృదయబిలంలో తగుల్కొని స్వయం ప్రకాశమైన ఆత్మరూపాన్ని చూడలేడు. అలాంటి వానికి నశ్వరాలైన స్వర్గసుఖాల నిచ్చేడి వ్యర్థకర్మలవలన ఫలితమేముంటుందీ?

---

1. పరమాత్మ 2. ప్రకృతి 3. బుద్ధి 4. జననమరణాత్మకమైన సంసారం 5. సృష్టిలయాలనెడి ప్రవాహం 6. పంచభూతాలు, పంచతన్మాత్రలు, పంచకర్మేంద్రియాలు, పంచజ్ఞానేంద్రియాలు (20), మనస్సు బుద్ధి చిత్తం అహంకారం (24), పురుషుడు (25), -వీటితోగూడిన శరీరం 7. చైతన్యం, ప్రాణం 8. కాలచక్రం

పరబ్రహ్మమందు నిష్ఠలేనివానికి ఈ దుష్కర్మలు నిరుపయోగాలు. బుద్ధి నానావిధ వృత్తులు కలదై జారిణిలాగా మోహజనకాలైన దుర్గుణ సంపదలాంటి గుణాలతోగూడి వర్తిస్తుంది. దానికి అంతం ఎప్పుడో జీవుడెఱుగడు. ఆ ఎఱుకను జీవునకు కల్పించలేని తుచ్ఛ కర్మలు నిరర్థకాలు. అంతులేకుండా ప్రజోత్పత్తి చేస్తూ ఆ ప్రవాహంలో పడినవాడు తిరిగి గట్టుకుచేరడంకల్ల. ఆ ప్రవాహవేగంలో అటూఇటూ కొట్టుకుంటూ ఉంటాడు. వివశుడై ఎవడు హితం చెప్పినా వినడు. జననమరణ చక్రంలో అలా పరిభ్రమించెడి వాడు తిరిగి సన్మార్గంలో అడుగు పెట్టి పరతత్వాన్ని చేరడం సాధ్యంకాదు. దుర్మతియైన భర్త కుత్సితురాలైన భార్యను చేపడితే అహోరాత్రాలు సుఖదుఃఖాది ద్వంద్వాలలోపడి కొట్టుకొనడం తప్పితే అందుండి బయటపడి తిరిగి స్వస్వరూపం తెలిసికొనడం అసంభవం. అలాంటివానికి-రక్షణ అనేది ఎలా ఉంటుందీ?

పరమాత్మ అద్దంలాంటివాడు. పంచవింశతి తత్వాలూ అందులో కళ్ళకు గట్టినట్లు ప్రతిబింబిస్తాయి. అయినా జీవుడు ఆతణ్ణి పట్టుకోలేక అల్పత్వంతో ఏవో దుష్కర్మలాచరిస్తాడు. అలాంటివానికి సద్గతియెలా లభిస్తుందీ? బంధమోక్షాలను క్రమంగా అనుసంధానంచేసేది శాస్త్రం. శాస్త్రంవలననే ఈశ్వరుని తెలిసికొనడం సాధ్యం. అలాంటి శాస్త్రాన్ని తిరస్కరించిన జ్ఞానాంధుడు ఎన్నికర్మలు చేసినా శుభం కలుగదు. కాలచక్రం అప్రతిహతమైనది. ఈ సృష్టియావత్తూ చుట్టిచుట్టి లయం చెయ్యగలశక్తి దానికుంది. ఆ కాలచక్రాన్ని చూడకుండా యేవో కర్మలు చేస్తే మోక్షపదం లభిస్తుందా? పూర్వం తండ్రి యాజ్ఞానుసారం చతుర్ముఖ బ్రహ్మకూడా ప్రజోత్పత్తికి పూనుకున్నాడు. కాని అది గుణమయ ప్రవృత్తిలోకి దింపుతుందని నిష్పృహచెంది ఆ పనిమానుకున్నాడు—

అని వితర్కించి హర్యశ్వులు నారదుడన్నరీతిలోనే నడవడానికి నిశ్చయించుకున్నారు. ఆ దేవర్షికి ప్రదక్షిణ నమస్కారం చేశారు. తిరిగి యెన్నడూ తిరిగిరాని మోక్షమార్గం త్రొక్కిపెళ్ళారు. సహజసత్వబ్రహ్మమయమైన శ్రీహరి చరణకమలమకరందాన్ని త్రావి మత్తిల్లిన చిత్తంతో నారదుడు శ్రీహరి యశోగానం చేస్తూ ఆ గానానుసారంగా మ్రోగెడి మహతి (వీణ)ని చేధాల్చి లోకం తనను సన్నుతిస్తుండగా యథేచ్ఛగా వెళ్లిపోయాడు.

అనంతరం నారదుడే ఈవార్తను దక్షునకు చెప్పగా దక్షుడు దుఃఖాతిశయంతో చలిత మనస్కుడయ్యాడు. బ్రహ్మదేవుని ఆదేశానుసారం అతడు తిరిగీ అసిక్నియందు శబళాశ్వులను పేరుగల వేలకొలది పుత్రులను పుట్టించాడు. వారున్నూ తండ్రి మనోగతం తెలుసుకొని ప్రజోత్పత్తికి దీక్షపట్టి తపస్సు చెయ్యడానికి హర్యశ్వులు వెళ్లిన నారాయణ తీర్థానికే వెళ్ళారు. ఆ తీర్థంలో

క్రుంకిడి పవిత్రులయ్యారు. బ్రహ్మేంద్రాదులకుకూడా అందని పరబ్రహ్మాన్ని ధ్యానిస్తూ జపిస్తూ ఆ దేవదేవుని సాక్షాత్కరింపజేసుకోవాలనే తహతహతో దారుణ తపస్సు చెయ్యడం మొదలుపెట్టారు.

ఒకే పాదంయొక్క బొటనవ్రేలిమీద నిశ్చలంగా నిలబడ్డారు. చేతులు జోడించి పైకెత్తి ఆకాశాన్ని పట్టుకొన్నారు. నిడుదలూ, మహోగ్రాలూ అయిన చూపులతో ఉష్ణభానుని పొడిచిపట్టుకున్నారు. కొన్నాళ్లు వాయుభక్షణం చేశారు. అనంతరం అదీమాని నిరాహారులై దారుణమైన తపస్సు చేశారు. ఆ తపస్సుకు లోకాలు తల్లడిల్లిపోయాయి. దేవతలు భయాక్రాంతులయ్యారు.

## నారదుడు శబళాశ్వులకు నివృత్తిమార్గం బోధించడం

భగవన్మంత్రాలు జపిస్తూ ప్రజాసృష్టికోసం ఉగ్రతపం చేస్తూన్న శబళాశ్వుల దగ్గఱకు నారదుడు వచ్చి పూర్వపురీతిగానే యిలా అన్నాడు. 'మీరు భ్రాతృవత్సలులు. వేదాంతసారాన్ని స్రవించెడి నా మాటలు విని మీ తోబుట్టువులు త్రొక్కిన దారిని అనుసరించండి. అగ్రజులు చనిన దారిని వర్తించెడి వారిని విశేషధర్మమెఱిగిన వారినిగా అందఱూ ప్రశంసిస్తారు. అలాచేస్తే మీకు పుణ్యబంధువులైన దేవతల సహవాసం లభిస్తుంది' అనిచెప్పి నారదుడు యథేచ్ఛగా వెళ్లిపోయాడు. శబళాశ్వులు నారదవాక్యాలు విన్నాక కర్మమార్గంలో మోహం విడిచిపెట్టి తమ అగ్రజులు పోయినరీతిగా ఎన్నడూ తిరిగిచూడని త్రోవ ద్రొక్కి వెళ్లిపోయారు. గడచిపోయిన రాత్రులు ఎలా తిరిగిరావో అలాగేవారూ తిరిగిరాలేదు.

ఆ సమయంలో దక్షునకు ఎన్నో దుర్నిమిత్తాలు తోచాయి. ఈ కొడుకులు కూడా తన మాటకాదని వేరేదారి త్రొక్కినందుకు ఎంతో వ్యథ చెందాడు. ఇదంతా నారదకృతమని గ్రహించాడు. వెంటనే ఆ దేవర్షి దగ్గరకు వెళ్ళాడు. పట్టరాని కోపంతో దక్షుడు చలించి పోయాడు. ముఖం జేవురించింది. కనుబొమలు ముడివడ్డాయి. పెదవులు కంపించాయి. పండ్లు పట పట కొఱకుతూ ఆ దేవర్షితో ఇలా అన్నాడు.

నారదా! నీవు ధూర్తుడవు. సాధువులాగా వచ్చి నా బిడ్డలను సన్యాస మార్గం పట్టిస్తావా? వారి దుర్గతికి నేను దుఃఖించకుండా ఎలా వుండగలను? నా భయంకరమైన శాపాగ్నితో ఇప్పుడు నిన్ను సంతప్తుణ్ణి చేస్తాను. చూడూ. ఈ పసిబిడ్డలకు కర్మవిముఖత్వంకల్పించి దేవఋణం, ఋషిఋణం, పితృఋణం తీర్చకుండా చేశావు. వారికి నివృత్తిమార్గం బోధించి వారిన్ని ఇహ పరభోగాలు అనుభవింపకుండాచేశావు. ఉభయలోకాల్లోనూ వారికి శ్రేయోహాని కల్గించావు.

ఇంతటి పాతకానికి పాల్పడిన నీవు భాగవోత్తముల నడుమ సిగ్గులేనివాడవై చరిస్తావు! నా పుత్రులు నిరపరాధులు. నీవు వారియెడల అకారణ వైరం వహించి వారికి ద్రోహంచేశావు. భాగవతులు సహజంగా భూతానుగ్రహ పరవశులు. కాని నీవు అలాంటివాడవుకావు. అంచేత ఏ లోకంలోను స్థిరనివాసం లేకుండా నీవు నిరంతరం లోకాలన్నీ తిరుగుతూ ఉంటావు— అని నిర్దయుడై దక్షుడు నారదుని శపించాడు.

కాని నారదుడు దక్షుని క్రోధవాక్యాలకు కోపం చెందలేదు. 'అలాగేకానీ' అని యథేచ్ఛగా వెళ్లిపోయాడు. నరేంద్రా! చూచావా? నారదుడెంతటి శాంత స్వభావుడో! అంతటి శాంత స్వభావుని నిజంగా సర్వాతీతుడైన సర్వేశ్వరు డనవచ్చు.

తనయత్నం సఫలం కానందుకు శోకాకుల చిత్తుడైన దక్షుడు తిరిగి పితామహుని ఆదేశాన్ని అనుసరించి తన భార్యయైన అసిక్నియందు పితృవత్సలలైన, అరువదిమంది పుత్రికలనుకన్నాడు. వారిలో పదిమందిని ధర్మునకు, పదుమువ్వురను కశ్యపునకు, ఇరువదేడ్వురను చంద్రునకు, భూతునకు, అంగీరసునకు, కృశాశ్వునకు ఇద్దఱేసి చొప్పున అర్గురను, చివరి నలువురను తార్క్ష్యుడను నామాంతరం గల కశ్యపునకు ఇచ్చిపెండ్లి చేశాడు. వారు ఎంతటి పుణ్యవతులో చెప్పలేం. వారిని కడుపారకన్న తల్లిదండ్రులు ఎన్నినోములు నోచారో! వారు సవతుల య్యుండీన్నీ పోరూపొక్కూ లేకుండా హాయిగా జీవయాత్రచేస్తూ అపారమైన సంతతిపొందారు. వారి సంతతితో ముల్లోకాలు నిండిపోయాయి. నరేంద్రా ! ఆ పుణ్యాంగనల పేర్లూ, వారి వంశక్రమం చెపుతాను. విను" అని శుకుడు ఇలా చెప్పడం మొదలుపెట్టాడు.

## దక్ష సంతతి - కశ్యప సంతతి

"దక్షుని అరువదిమంది కుమార్తెలలో— భానువు, లంబ, కకుప్పు, జామి విశ్వ, సాధ్య, మరుత్వతి, వసువు, ముహూర్త, సంకల్ప— ఈ పదిమంది ధర్ము నకు పత్నులై సంతానవతులయ్యారు. వారిలో 1 భానువునకు వేదఋషభుడు పుట్టాడు. అతనికి ఇంద్రసేనుడు జన్మించాడు. 2 లంబకు విద్యోతుడు కలిగాడు. అతనికి స్తనయిత్నువులను వారుపుట్టారు. 3 కకుప్పునకు సంకటుడు, అతనికి కీటకుడు, కీటకునకు దుర్గాభిమానులైన దేవతలు జన్మించారు. 4 జామికి దుర్గభూముల కధిష్ఠాన దేవతలు జనించారు. వారికి స్వర్గుడు, నందిపుట్టారు. 5 విశ్వకు విశ్వేదేవ గణాలు జన్మించారు. ఆ విశ్వేదేవగణాలకు సంతానంలేదు. 6 సాధ్యకు సాధ్య గణాలు జన్మించారు. వానికి అర్థసిద్ధియను వాడు పుట్టాడు. 7 మరుత్వతికి మరు

త్వతుడు, జయంతుడు అనువారు ఉదయించారు. వారిలో జయంతుడు వాసుదే వాంశంలో పుట్టిన ఉపేంద్రుడుగా ప్రఖ్యాతిచెందాడు. 8 ముహూర్తకు సకల భూతకోటికీ ఆయాకాలాల్లో కలిగెడి ఆయాఫలాల నిచ్చు మౌహూర్తకు లనియెడి దేవగణాలు పుట్టారు. 9 సంకల్ప యనునామెకు సంకల్పుడు, ఆ సంకల్పునకు కాముడు జనించారు.

10 వసువను దేవికి ద్రోణుడు, ప్రాణుడు, ధ్రువుడు, అర్కుడు, అగ్ని, దోషుడు, వస్తువు, విభావసువు— అను అష్టవసువులు జననమందారు. వారిలో 1 ద్రోణునకు అభిమతియను భార్యయందు హర్షశోకభయాదుల జననం కలిగింది. 2 ప్రాణునకు ఊర్జస్వతియను పత్నియందు సహుడు, ఆయువు, పురోజవుడు అనువారు జన్మించారు. 3 ధ్రువునకు ధరణియను భార్యవలన నానావిధాలైన పురాలు సంభవించాయి. 4 అర్కునిభార్య వాసన. అతనికి ఆమెయందు తర్షుడు మొదలైనవారు పుట్టారు. 5 అగ్నికి వసోర్ధారయందు ద్రవిణకాదులుపుట్టారు. ఆ అగ్నికే కృత్తికలందు స్కందుడు (కుమారస్వామి) కలిగాడు. ఆ స్కందునకు విశాఖాదులు పుట్టారు. 6 దోషునకు శర్వరియను భార్యయందు హరికళ, శింశు మారుడు జన్మించారు. 7 వస్తువునకు ఆంగిరసవలన విశ్వకర్మయను శిల్పా చార్యుడు పుట్టాడు. ఆ విశ్వకర్మకు ఆకృతియను సతియందు చాక్షుషుడు మనువు జన్మించారు. ఆ మనువు వలన విశ్వలు, సాధ్యులు అనువారు కలిగారు. 8 విభావసు నకు ఉషయందు వ్యుష్టి, రోచి, ఆతపుడు అనువారు కలిగారు. వారిలో ఆతపునికి పంచయామ్ముడను దినాభిమానదేవత జన్మించాడు.

శంకరాంశజుడైన భూతునకు సురూపయను భార్యయందు కోట్లసంఖ్యగల రుద్రగణాలు పుట్టారు. ఆ రుద్రగణాలకు— రైవతుడు, అజుడు, భవుడు, భీముడు, వాముడు, ఉగ్రుడు, వృషాకపి, అజైకపొత్తు, అహిర్బుధ్న్యుడు, బహురూపుడు, మహాంతుడు- అనువారు నాయకులు. వారినే ఏకాదశ రుద్రులంటారు. భూతునకు మఱియొక భార్య అయిన అన్యయందు రుద్రపారిషదగణాలు, భయంకరులైన ప్రేతగణాలు వినాయకులు పుట్టారు. అంగిరసుడను ప్రజాపతికి స్వధయనుభార్య వలన పితృగణాలు, సతియను నామెయందు అధర్వ వేదాభిమాన దేవతలు జన్మిం చారు. కృశాశ్వునకు అర్చియను భార్యయందు ధూమ్రకేశుడు, ధీషణయను సతి వలన వేదశిరుడు, దేవలుడు, వయునుడు, మనువు అను పుత్రులు కలిగారు.

వినత, కద్రువ, పతంగి, యామిని- ఈ నలుగురు తార్క్ష్యుని భార్యలు. వారిలో పతంగికి పక్షులూ, యామినికి మిడుతలు మొదలైన కీటకాలూ, పుట్టాయి. వినతకు యజ్ఞపతియైన విష్ణువు సాక్షాత్కరించగా ఆమెకు గరుడుడు పుట్టి విష్ణుని వాహనమయ్యాడు. ఆమెకే అరుణుడను వాడు జన్మించి సూర్యునకు సారథి అయ్యాడు. కద్రువకు నానావిధ సర్పజాతులు జన్మించాయి. చంద్రుడు దక్షుని

కుమార్తెలు కృత్తికాదులు ఇరువదియేడుమందిని పరిణయమాడాడు. కాని అతనికి రోహిణియందు మాత్రమే అధికానురాగం. అంచేత దక్షుడు ఆగ్రహించి శపించగా అతడు క్షయవ్యాధి పీడితుడయ్యాడు. ఆ కారణంవలన అతనికి సంతానం కలుగలేదు. కాని మళ్లీ దక్షానుగ్రహం చేత క్షయ పీడితాలైన షోడశకళలను పొందాడు. రాజా ఇవి దక్షప్రజాపతి సంతతి. ఇక కశ్యప ప్రజాపతి సంతతిని గురించి చెపుతాను విను.

అదితి, దితి, దనువు, కాష్ఠ, అరిష్ట, సురస, ఇళ, ముని, క్రోధవశ, తామ్ర, సురభి, సరమ, తిమి- ఈ పదముగ్గురు కశ్యపుని భార్యలు. వారి ప్రతిభ ఇంతా అంతా అని చెప్పడానికి వీలులేదు. కామిత ప్రదుడైన కశ్యపుని కౌగిటిలో ప్రేమపంచుకొని ఆ ప్రజాపతిని భోగవారాశిలో తేల్చిన మహాసాధ్వులు. అఖిల లోకాలకు అవ్వలై వారు అందరికి పూజనీయులయ్యారు. వారు కళ్లారా చూచి ఆనందించగా వారిపుత్రులు, పౌత్రులు ముల్లోకాలను పాలించారు. వారు గడించిన పుణ్యాలు రాసులై కొంగుబంగారంగా మూల్గుతూ ఉంటాయి. వారి సంతతిని విడమరచి చెప్పడం సాధ్యంకాదు. వారిలో కొందరి వంశాలు మాత్రం సంగ్రహంగా చెపుతాను విను.

వారిలో తిమికి జలచరాలు పుట్టాయి. సరమకు పులి, కుక్క, పిల్లి మొదలైన జంతువులు పుట్టాయి. ఇవి గోళ్లతో కొట్టి హింసిస్తాయి. సురభికి గేదె,దున్న ఆవు మొదలైన జంతువులుపుట్టాయి. వీటిగిట్టలు చీలిఉంటాయి. తామ్రకు డేగలు గ్రద్దలు మొదలైన పక్షులు జన్మించాయి. మునికి అప్సరసలు పుట్టారు. ఇళకు వృక్ష జాతులు, క్రోధవశకు సర్పాలు ఉద్భవించాయి. సురసకు యాతుధానులు, అరిష్టకు గంధర్వులు జన్మించారు.

ద్విమూర్ధుడు, శంబరుడు, అరిష్టుడు, హయగ్రీవుడు, విభావసుడు, అయోముఖుడు, శంకుశిరుడు, స్వర్భానుడు, కపిలుడు, అరుణి, పులోముడు, వృషపర్వుడు, ఏకచక్రుడు, అనుతాపకుడు, ధూమ్రకేశుడు, విరూపాక్షుడు, దుర్జయుడు విప్రచిత్తి- ఈ పదు నెనిమిదిమంది దనువు పుత్రులైన దానవులు. వీరు మహాబలవంతులు. దేవవిరోధులు.

వీరిలో స్వర్భానువునకు సుప్రభ అను కన్య పుట్టింది. ఆమెను నముచి వివాహమాడాడు. వృషపర్వునకు శర్మిష్ఠ అను కూతురు జనించింది. ఆమెను నహుషపుత్రుడు యయాతి పరిణయమాడాడు. వైశ్వానరునకు ఉపదానవి, హయశిరస, పులోమ, కాలక—— అను నలుగురు పుత్రికలు కలిగారు. వారిలో ఉపదానవిని హిరణ్యాక్షుడు, హయశిరసను క్రతువు పెండ్లియాడారు. చతుర్ముఖుని ఆదేశానుసారం పులోమను, కాలకను, కశ్యప ప్రజాపతి చేపట్టాడు. పులోమకు పౌలో

ములు, కాలకకు కాలకేయులు పుట్టారు. వారేకాక ఆ యిరువురికి ఇంకా అరువది వేలమంది రాక్షసులు జన్మించారు. యజ్ఞాలను భంగించడం వారిపని. ఇంద్ర ప్రీతిగా వీరందరిని నీ తాత అర్జునుడు వధించాడు. విప్రచిత్తి సింహికయను భార్యవలన రాహువు జ్యేష్ఠుడుగా వందమంది కేతువులను పొందాడు. వారందరూ గ్రహాలయ్యారు.

రాజేంద్రా . ఏ వంశంలో నారాయణుడు నిజాంశంతో అవతరించాడో ఆ అదితివంశక్రమాన్ని అభివర్ణిస్తాను. సావధానంగా విను. అదితికి- వివస్వంతుడు, అర్యముడు, పూషుడు, త్వష్ట, సవిత, భగుడు, ధాత, విధాత, వరుణుడు, మిత్రుడు, శక్రుడు, ఉరుక్రముడు— అను పన్నిద్దరు పుత్రులు కలిగారు.

వివస్వంతునకు సంజ్ఞాదేవియందు శ్రాద్ధదేవుడను మనువూ, యముడు, యమీ అను మిథునం కలిగారు. ఆ సంజ్ఞయే బడబ (ఆడుగుఱ్ఱం) రూపంపొంది అశ్విని దేవతలను కన్నది. వివస్వంతునకు ఛాయాదేవియను మఱోభార్యయందు శనైశ్చరుడు, సావర్ణియను మనువు, తపతియనుకూతురు పుట్టారు. తపతిని సంవరణుడనేవాడు వరించాడు.

అర్యముని భార్య మాతృక. ఆమెకు చర్షణులను వారు జన్మించారు. వారి మూలంగానే మనుష్యజాతి భూలోకంలో స్థిరమగునట్లు కల్పించాడు. పూర్వం దక్షునితో కలహించిన శివుని చూచి పూషుడు పండ్లికిలించి నవ్వాడు కదా! అందుచేత దక్షాధ్వరధ్వంస కాలంలో రుద్రపార్షదులు అతని దంతాలు ఊడగొట్టారు. అప్పటి నుండి అతడు బోసి నోటితో పిండి ఆహారంగా జీవ యాత్ర చేస్తున్నాడు. అతనికి పిల్లలు లేరు. త్వష్టకు, దైత్యులకు చెల్లెలైన రచనయందు విశ్వరూపుడను కొడుకు కలిగాడు. అతడు మహా బలశాలి. అనంతరం ఒకప్పుడు బృహస్పతి దేవతలపై అలిగి ఆచార్యత్వం వదలుకొని వెళ్ళిపోగా దేవతలు విశ్వరూపుని ఆచార్యుడుగా వరించారు"—అని చెప్పగా విని శుక యోగీంద్రునకు పరీక్షిన్నరేంద్రుడిలా అన్నాడు.

"యోగీంద్రా! బృహస్పతి దేవతలకు ఆచార్యత్వం వదలివెళ్ళి పోయాడా! ఆశ్చర్యంగా ఉందే! ఆయనకు కోపం ఎందుకు వచ్చింది? దేవతలు గీష్పతి యెడల ఏమైనా అపరాధం చేశారా? వివరంగా చెప్పండి ."అనగా శుకుడు ఇలా చెప్పడం మొదలు పెట్టాడు.

"ఇంద్రుడొకనాడు రత్న సింహాస నాసీనుడై నిండు కొలువున్నాడు. అతని సతి శచి అతని అంక పీఠి నధివశించింది. వసువులు, రుద్రులు, ఆదిత్యులు, మరుత్తులు, అశ్విదేవతలు, సిద్ధచారణ గంధర్వోరగాదులు, సురలు, మునులు, యథాస్థానాల్లో కూర్చుండి సురేంద్రుని సన్నుతిస్తున్నారు రంభ మొదలైన అప్స

రంగనలు ఆడుతూ పాడుతూ అతనికి మనోనందం కల్పిస్తున్నారు. రాజలాంఛన మైన సితాతపత్రం (తెల్లని గొడుగు) నిండుపున్నమనాటి చంద్రుని సోయగాన్ని ధిక్కరిస్తోంది. మిన్నేటితరంగాలను స్పృశించి మేలుకొల్పుతూన్నట్లుంది. దేవతాస్త్రీలు సవిలాసంగా వింజామరలు చేదాల్చి వీస్తున్నారు. దిక్పాలకులు యథోచితస్థానాల నలంకరించి దేవేంద్రుని సేవిస్తున్నారు. ఐశ్వర్యమదంతో ఇంద్రుడు కన్నూ మిన్నూ కానకుండా ఉన్నాడు.

ఆ సమయంలో ధర్మవిదుడూ నీతిశాస్త్ర పారంగతుడూ దేవతలకు మంత్రోపదేష్టా, వాచస్పతీ, సురాచార్యుడూ అయిన బృహస్పతి అక్కడకు వచ్చాడు. మహాతపస్సంపన్నుడూ, కరుణాత్ముడూ అయిన గీష్పతిని చూచి కూడా మదాంధుడైన ఇంద్రుడు సింహాసనంనుండి లేవలేదు. ఎదురేగి స్వాగతం పలకలేదు. ఏ విధమైన గౌరవోపచారాలూ చేయలేదు. తుదకు ఆసనంకూడా చూపలేదు. రాజ్యమదవికారంచేత సురపతి కనులు మూసుకొనిపోయాయని ఆచార్యుడు గ్రహించాడు. ఖిన్నుడై కిమ్మనకుండా వచ్చిన దారిని తిరిగి వెళ్లిపోయాడు.

కొంతసేపటికి ఇంద్రునకు కనువిప్పు కలిగింది. అజ్ఞానవశంచేత గురు తిరస్కారంచేశానే అని ఆశ్చర్యపడ్డాడు. భయక్రాంతుడయ్యాడు. చింతించాడు. అయ్యో! ఆ మహానుభావుని పాదపద్మాలను పూజింపక అల్పబుద్ధితో తీరని అపచారం చేశానే అని వాపోయాడు. ముల్లోకాల్లో నాకన్న అధికవైభవం కలవాడు లేడనే మదంతో 'అసురభావం' వహించి, ప్రసన్నుడై నా కొలువునకు వచ్చిన గురువునకు కీడుచేశాను. నాకు ఉపతం తప్పదు.

"రాజ్యపదవి బ్రహ్మపదంతో తుల్యమైనది. కనుక రాజులు ఎంతటి వారికైనా లేవవలసిన పనిలేదు"— అని బుధులంటారు. కాని అలా అనేవారిని ధర్మవిదులుగా భావించడం సమంజసం కాదు. వేదువాక్కుత్రొక్కి కుత్సితంగా మాట్లాడడంలో ఆరితేరినవారు ధర్మం తెలిసికొని ఆ దారినుండి తొలగలేరు. తుదకు అధోగతిలోపడతారు. రాతితో నిర్మించిన తెప్ప నీటిలో మునిగిపోకుండా ఎన్నడైనా తేలుతుందా? కనుక లోకవంద్యుడూ, కార్యవిదుడూ అయిన సురాచార్యుని యింటికివెళ్లి పవిత్రములైన ఆతని పాదపద్మాలపై తలవాల్చి నమస్కరిస్తాను. ఉచిత సపర్యలతో అతన్ని ప్రసన్నుని చేసుకుంటాను- అని దేవేంద్రుడు శీఘ్రగమనంతో దేవగురువు నిలయానికి వెళ్లాడు.

దేవేంద్రుడు తన యింటికే వస్తున్నాడని బృహస్పతి తెలిసికొన్నాడు. అతని కంటబడడానికి సురగురువునకు ఇష్టంలేదు. యోగమాయచేత అక్కడే అదృశ్యంగా ఉన్నాడు. దేవేంద్రుడు నలుమూలలా వెదికాడు. కాని గురువుజాడ

ఎక్కడా కనబడలేదు. చింతించాడు. చిన్నబుచ్చుకున్నాడు. ఈ వృత్తాంతం అంతా దేవ విరోధులైన రాక్షసవీరులు వేగులవలన తెలిసికొన్నారు. వెంటనే అందఱూ తెలివిగా అసురాచార్యుడైన శుక్రుని ఆశ్రయించారు. ఆయన కృపా దృష్టిచేత వారి శక్తి ప్రవృద్ధమైంది. క్షణంకూడా ఆలసించకుండా వారు దేవతలపై దాడిచేశారు.

వారందఱందఱూ ధూర్తులు. పాపాత్ములు. నిరంతరం ధర్మదూరమైన మార్గంలో చరిస్తారు. అవినీతికి వారుపెట్టినవిపేరు. అలాంటి దానవయోధులు ధనుర్బాణాలు ధరించి రథాలూ, గుఱ్ఱాలూ, ఏనుగులూ అధిరోహించి సురవర్గంమీద వచ్చిపడ్డారు. బ్రహ్మాండాలు బ్రద్దలయ్యేటట్లు జయధ్వానాలు చేశారు. దేవతలు కూడా వెనుకంజవేయకుండా దిక్కులు క్షోభించేలాగా ఆర్భాటంచేస్తూ వారిని ఎదుర్కొన్నారు.

మదోద్రేకంతో దేవదానవులు ఒకరినిమించి ఒకరు పోరుతూండగా దానవులు శుక్రాచార్యుని మంత్రప్రభావంచేత అమిత తీక్ష్ణాలైన అస్త్రాలతో బొబ్బరిస్తూ దేవతలపైబడి వారిని నొవ్వజేయగా వారు నిల్వలేక కకావికలై పారిపోయారు. రాక్షసులు ప్రయోగించిన దారుణాస్త్రాలకు వారి శరీరాలు నుగ్గునుగ్గు అయ్యాయి. ఇక తలలు దక్కవని భీతిచెంది రణభూమి విడిచి తలకోదారిబట్టారు. శాపం పెట్టినట్లు యుద్ధరంగంలో ఒక్కడూ కనబడలేదు. దానవుల గర్వాతిశయం అస్త్రపటిమ, మాత్సర్యం, బలం, శౌర్యం చూచి దేవతలు సిగ్గుచెందారు. భయ క్రాంతులయ్యారు. దుఃఖభారంతో నిశ్చేష్టులై రణ విముఖులయ్యారు. శత్రువుల బాణాఘాతాలచే శిథిలాంగులై సంతాపంతో వేటగాండ్రను చూచి విలవిలలాడెడి చమరీ మృగాల్లాగా వారు నలువైపులా తిరుగుతూ దిక్కుతెలియక తుదకు అందఱు కూడబలుకుకొని బ్రహ్మదేవుని దర్శించి ఆయన పాదాలకు మ్రొక్కారు.

సకలలోక హితప్రదాతయైన ధాత ఇంద్రాది దేవతాబృందాన్ని చూచి మందహాసంచేశాడు. కృపారస భరితాలైన వాక్యాలతో వారిని ఊరడించి అభయ మిచ్చి యిలా అన్నాడు.—

మీరు మహాపాపకర్మకు ఒడిగట్టారు. మిమ్మల్ని ఏమనాలి? పుట్టినప్పటి నుండి మీకు బుద్ధులు చెప్పి లోకపాలనానికి మీకు పట్టంకట్టిన కృపానిధి, బ్రహ్మనిష్ఠుడు గీష్పతి. మీరుకొవ్వెక్కి అతన్ని పోగొట్టుకున్నారు. మీ శక్తి సన్నగిల్లింది. మీగుట్టు బట్టబయలైంది. బ్రహ్మిష్ఠుడైన ఆచార్యుని తిరస్కరించి మీరు గురుద్రోహానికి పాల్పడ్డారు. ఆ ద్రోహం ఇపుడు మీకు శత్రునిమిత్తంగా అనుభవానికివచ్చింది. సహజంగా మీరు బలవంతులు. రాక్షసులు దుర్బలులు. అయినా వారు మిమ్మల్ని జయించడానికి కారణమేమిటో తెలుసా? వారు గురుభక్తి పరాయణులు. వారు

అసురాచార్యుడైన శుక్రుని ఆరాధించి ఆతని మంత్రప్రభావంచేత వీర్యవంతుల య్యారు. వారు నా నిలయాన్ని ఆక్రమించినా ఆక్రమించ గలరు. ఇక స్వర్గాన్ని ఆక్రమించడం వారికి తృణప్రాయం. మదోద్రేకంతో విజృంభించిన వారికి ఇప్పుడు అడ్డులేదు. అభేద్యమైన మంత్రబలంగల శుక్రునకు వారు శిష్యులు కావడంచేత బ్రాహ్మణులను, హరిహరులను, గోవులను ఆరాధించి, వారి అనుగ్రహానికి పాత్రు లైన రాజులకుతప్ప మిగిలినవారికి అరిష్టం తప్పదు.

ఇప్పుడు మీకో ఉపాయం చెపుతాను వినండి. త్వష్టయను మనువునకు విశ్వరూపుడను కొడుకున్నాడు. ఆ విశ్వరూపుడు అసాధారణ శక్తిసంపన్నుడు. మహాతపస్వి. అతన్ని మీరు ఆరాధిస్తే మీకు అభీష్టార్థ సిద్ధికలుగుతుంది. మీ దుర్దశ తొలగి పోతుంది— అని చతుర్ముఖుడు చెప్పేసరికి దిక్పాలకు లాతని వీడ్కొని విశ్వరూపుని దగ్గఱకు వెళ్లి యిలా అన్నారు—

నాయనా! నీకు శుభం కలుగుగాక. మేము కార్యార్థులమై నీ తపోవనానికి వచ్చాం. మేము నీతండ్రుల కోవకు చెందిన వారం— కనుక మాకోర్కె తీర్చి యశ స్సును పొందు. సుతులకు పితృసేవకంటె పుణ్యప్రదమైన పని యింకొకటిలేదు. కొడుకులు బ్రహ్మచారులైనా గుణోన్నతులైతే గురుతుల్యులు కాగలరు. కాన వారిని సేవించి అర్థించడంలో దోషంలేదు. ఆచార్యుడు పరమాత్మ స్వరూపం. తండ్రి బ్రహ్మ స్వరూపం. అన్న ఇంద్రుని స్వరూపం. తల్లి భూదేవి రూపం. చెల్లెలు కరుణరూపం. సంకల్పం ధర్మ స్వరూపం. తాను యాచకరూపం. అభ్యా గతుడు అగ్ని స్వరూపం. సర్వజీవులూ నారాయణ స్వరూపం. కనుక తండ్రీ! ఆపదలో ఉన్న మమ్మల్ని నీవు చల్లగాచూచి మా భయం పోగొట్టు. నీ తపో మహిమచే మమ్మల్ని రక్షించు.

ఇప్పుడు నిన్ను ఆచార్యునిగా వరించి వచ్చాం. నీ తేజో విశేషంచేత శత్రు వులను సంహరిస్తాం. స్వప్రయోజనంకోసం తనకంటె చిన్నవానికి పాదాభివందనం చెయ్యడం నిందితంకాదని వేదవాక్యం ఉంది. కనుక నీకు నమస్కారం చేస్తున్న దేవతలమైన మమ్మల్ని ఆదరించి మాకు ఆచార్యత్వం వహించు— అని అర్థించగా మహర్షియైన విశ్వరూపుడు మందహాసంచేసి ఇలా అన్నాడు —

ఓ విబుధులారా! మీరు నన్ను ఆచార్యత్వం వహించుమని కోరారు. కాని ఆచార్యత్వాన్ని ధర్మగుణశీలురు నిందిస్తారు. అది బ్రహ్మతేజాన్ని నశింపజేస్తుంది. ఈ విషయం నాకు తెలుసు. అయినా దివిజులైన మీరు మధురోక్తులతో నన్ను అర్థించడం వలన నేనుకాదనలేను. వాస్తవానికి గురుత్వం వహించి ధనసముపార్జ వం చెయ్యడం ఉచితంగాదు. గురుశిష్యులలో మంత్రవిదులై ధర్మనిరతులైన శిష్య

కోఛియే గురువులకు పెన్నిధి. అంతేకాని పౌరోహిత్యం వహించి ధనార్జనం చెయ్యడం అనుచితం. అంతకంటె శిలోంఛనవృత్తి[1]లో పొట్టబోసుకుంటూ చేతనైనట్లు సాధుసత్కారం చెయ్యడం వాంఛనీయం. దానివలన ఎంతో మనస్సంతృప్తి ఉంటుంది. అయినా మీ శాసనాన్ని శిరసావహించి వంచనకు పాల్పడకుండా ప్రాణాన్నీ అర్థాన్నీ పణంగాపెట్టి మీ కోర్కె తీరుస్తాను— అని విశ్వరూపుడు ప్రతిజ్ఞాపూర్వకంగా వారిని ఊఱడించి వారికె గురుత్వం వహించాడు.

శుక్రుని మంత్రమహిమచే స్వర్గాన్ని ఆక్రమించడంవలన ద్విగుణీకృతమైన దానవసంపదను విశ్వరూపుడు విష్ణుమాయచే తెచ్చి తిరిగి ఇంద్రునకిచ్చాడు. ఆ విద్యా రహస్యాన్ని ఇంద్రునకు బోధించాడు. అపుడు ఇంద్రుడు దానవులతో యుద్ధంచేసి వారినందఱిని ఓడించాడు—" అని శుకుడనేసరికి పరీక్షిన్నరేంద్రుడు శ్రీకృష్ణుని మనస్సులో ధ్యానించి— "మునీంద్రా! విశ్వరూపుడుపదేశించిన ఏ విద్యా ప్రభావంచేత సురేంద్రుడు యుద్ధరంగంలో రాక్షసశ్రేణిని వధించి అపహృతమైన తన సంపదను తిరిగిపొంది సమస్త లోకాలను పరిపాలించగలిగాడో ఆ విద్యా విశేషాన్ని నేను సాకల్యంగా వినాలని కుతూహల పడుతున్నాను. నీవు సామాన్యుడవుకావు. ఆ సురేంద్రాదులందఱు నీపాదాలను సేవిస్తూఉంటారు. కరుణించి నాకు ఆ విద్యా రహస్యంచెపితే ఆనందిస్తాను—" అనగా శుకర్షి యీ రీతిగా చెప్పడం మొదలు పెట్టాడు.

## శ్రీమన్నారాయణ కవచ ప్రారంభం

"నరేంద్రా. విను. మునినాథుడైన విశ్వరూపుడు ఇంద్రునకు తెలిపిన విష్ణుమాయ స్వరూపమైన మంత్రాన్ని నారాయణకవచ మంటారు. దాని స్వరూపం ఊహింపనలవికానిది. దానిఫలం అపారం. అది సకల విజయసాధకం. మంత్రగోప్యం. ఆ విష్ణుకవచాన్ని విశ్వరూపుడు ఇంద్రునకు చెప్పినరీతిలో సాంగంగానీకు చెపుతాను. ఏకాగ్రచిత్తుడవై విను. కాళ్లుచేతులూ కడిగికొని ఉత్తరముఖంగా ఉత్తమాసనం మీదకూర్చుండి అంగన్యాస[2] కరన్యాసపూర్వకంగా నారాయణ కవచాన్ని గ్రహించాలి.

అంగన్యాస కరన్యాసాలు ఎలా చెయ్యాలో చెపుతాను విను. "ఓం నమో నారాయణాయ"— ఇది అష్టాక్షరీ మంత్రం. ప్రణవ (ఓం) పూర్వకమైన ఈ

1 కోతకోసిన తర్వాత పొలములో రాలిపడిన ధాన్యపు కంకులను ఏఱుకొని జీవించుట.

2 న్యాసం - అనగా మంత్రం చదివేటప్పుడు శరీరము యొక్క వివిధావయవములందు మంత్ర బీజాక్షరాలను ఉంచుట.

అష్టాక్షరీమంత్రాన్ని అష్టాంగములయందు విన్యాసం చెయ్యాలి. పాదాలు, జానువులు (మోకాళ్ల),ఊరువులు (తొడలు),ఉదరం, హృదయం, వక్షస్థలం (రొమ్ము), ముఖం, శిరస్సు– ఇవి అష్టాంగాలు. అష్టాక్షరీ మంత్రంలోని ఎనిమిది అక్షరాలను ఓంకారంతో కలిపి ఈ ఎనిమిది అంగాల్లోను (దిగువ నుండి మీదికిగాని మీదినుండి దిగువకుగాని) న్యాసం చెయ్యాలి. దీనిని అంగన్యాసం అంటారు.

అలాగే 'ఓం నమోభగవతే వాసుదేవాయ' అను ద్వాదశాక్షర మంత్రాన్ని ప్రణవం (ఓం)తో కలిపి క్రమంగా బొటనవ్రేళ్ల కణుపులయందును; తర్జని (జుట్టనవ్రేలు) మొదలైన నాలుగేసి వ్రేళ్ళయందును న్యాసం చెయ్యాలి. దీనిని కరన్యాసం అంటారు.

అనంతరం "విష్ణవేనమః" అను షడక్షర మంత్రాన్నీ ఓంకార యుక్తంగా చేసి హృదయమందు 'ఓం'కారాన్ని, మూర్ధమందు 'వి' కారాన్ని, భ్రూమధ్యమందు 'ష' కారాన్ని, శిఖయందు 'ణ' కారాన్ని, నేత్రములందు 'వే' కారాన్ని, సమస్త సంధులయందు 'న' కారాన్ని, న్యాసం చెయ్యాలి. మిగిలిన 'మః' అను అక్షరాన్ని అస్త్రాన్ని ఉద్దేశించి ఉపన్యసించాలి. అప్పుడు పరిపూర్ణమైన మంత్రమూర్తి అవుతుంది. అనంతరం 'అస్త్రాయఫట్' అనుమంత్రంతో దిగ్బంధనంచేసి పరమేశ్వరుని మనస్సులో నిలుపుకొని విద్యామూర్తీ, తపోమూర్తీ, షట్ఛక్తి సంపన్నమూ అయిన నారాయణ కవచమంత్రాన్ని ఈ విధంగా పఠించాలి.

గరుడుని మూపుపై పాదపద్మములుంచి తన ఎనిమిది బాహువులతో శంఖం, చక్రం, కవచం, విల్లు, ఖడ్గం, బాణం, పాశం, గద ధరించిన షడ్గుణైశ్వర సంపన్నుడు పరమేశ్వరుడు నన్ను సర్వత్రా రక్షించుగాక! మొసళ్ల మొదలగు జలచరముల వలననూ, వరుణపాశము వలననూ నాకు నీటియందు ఏ విధమైన ప్రమాదమూ రాకుండా, తానొక్కడేయై ప్రకాశించెడి ఘనుడు, మహాకీర్తిశాలి మత్స్యమూర్తి నన్ను రక్షించుగాక! మాయానటుడూ, ఖలితేజాన్ని ప్రతిఘటించుటయందు ఉద్భటుడూ (వీరుడు) అయిన వటుడు త్రివిక్రముడు నన్ను ఆకాశస్థలమందు కాపాడుగాక!

దేవ విరోధులైన రాక్షససేనాపతులను నిశ్శేషంగా వధించెడివాడూ, భయంకరంగా నోరుతెరచి అట్టహాసంచేస్తూ పెనుగోరల నుండి వెల్వడెడి అగ్నిజ్వాలలచే దిక్సంధులను దహింపజేయువాడూ, అప్రమేయుడూ, అయిన నృసింహుడు అడవులయందు, ప్రమాదస్థలములయందు, రణరంగములందు, అగ్నికీలలందు, నాకు రక్షకుడగుగాక! అగ్నిసమానుడూ, క్రీడానిరతుడూ, పృథివీమనోహరుడూ, కృపావిధేయుడూ, ముల్లోకాలూ కంపింపగా సముద్ర గర్భంలో దిరిగి మునిగియున్న భూమిని కొమ్ముతో ఎత్తిన మద్ధోదతుడూ అగు, ఆదివరాహ

స్వామి నాకు బాటలయందు బాసటయై కాపాడుగాక! రాజవంశాలను నాశనంచేసి భృగుకులానికి వన్నెతెచ్చిన మహోన్నతుడు, గుణస్తోముడు, పరశురాముడు పర్వత శిఖరములందు నాకు చేదోడుగా నుండుగాక!

శ్రీరామచంద్రుడు తాటకను మర్దించాడు. తపసి యజ్ఞం కాచాడు. శివ ధనుషును విఱిచాడు. మహాబలాఢ్యులైన విరాధకబంధులనూ, ఖరదూషణాది రాక్షసులనూ సంహరించాడు. వానరాధిపుడైన సుగ్రీవుని రక్షించాడు. వాలిని వధించాడు. సముద్రానికి గర్వభంగం చేశాడు. సేతువు కట్టాడు. రావణుడూ, కుంభకర్ణుడూ మొదలైన వీరులను నేలకూల్చాడు. విభీషుని లంకకు ఏలికగా చేశాడు. సీతను కాపాడాడు. అయోధ్యానగరంలో తిరిగి రాజ్యభోగాలు అనుభవించాడు. అలాంటి ఘనకార్యాలెన్నో చేసిన అనఘుడు రామవిభుడు దూరదేశాలకు వెళ్లినపుడు నన్ను బ్రోచుగాక!

అఖిల ప్రమాదాలకు హేతుభూతాలైన అభిచారక్రియల (చేతబడులు) నుండి నారాయణుడును, గర్వంనుండి నరుడును, యోగభ్రంశం నుండి యోగనాథుడైన దత్తాత్రేయుడును, మన్మథవికారం నుండి సనత్కుమారుడును, కర్మబంధం నుండి సిద్ధగణముల కధిపతియైన కపిలుడును, దైవహేళనం నుండి శ్రీహయగ్రీవుడును, దేవపూజలయందు కలిగెడి లోపాలనుండి నారదుడును, సమస్త నరకాలనుండి కూర్మమూర్తియు, అపథ్యంనుండి భగవంతుడైన ధన్వంతరియు, రాగద్వేషాది ద్వంద్వాలనుండి జితాత్ముడైన ఋషభుడు, జనాపవాదం నుండి అగ్నిదేవుడు, జనన మరణాదులు కల్పించెడి కర్మలనుంచి బలభద్రుడు, మృత్యువునుండి యముడు, సర్పగణాల నుండి శేషుడు, అజ్ఞానంనుండి వేదవ్యాసుడు, పాషండులనుండి బుద్ధదేవుడు, కలిదోషం నుండి కల్క్యవతార మూర్తియు నన్ను రక్షించుగాక!

పూర్వాహ్ణం, మధ్యాహ్నం, అపరాహ్ణం, సాయంకాలం, ప్రదోషం, అర్ధరాత్రం, అపరరాత్రం, ప్రత్యూషం అను సంధ్యలు[1], ప్రభాతం— ఈ వేళల్లో గదాది వివిధాయుధాలు ధరించి కేశవుడు, నారాయణుడు, గోవిందుడు, విష్ణువు, మధుసూదనుడు, త్రివిక్రముడు, వామనుడు, హృషీకేశుడు, పద్మనాభుడు, శ్రీవత్సలాంఛనుడు, సర్వేశ్వరేశుడు, జనార్దనుడు, విశ్వేశ్వరుడు, కాలమూర్తి అను నామ రూపాలుగల భగవంతుడు నన్ను రక్షించుగాక!

ప్రళయకాలాగ్నిలాగా సుడులు తిరుగుతూ, తన అవక్ర పరాక్రమంచేత దనుజచక్రాన్ని[2] దగ్ధంచేసెడి సుదర్శనచక్రం, వాయుప్రేరితమైన అగ్ని ఎండు గడ్డిని దహించునట్లు భగవత్ప్రయుక్తమైన శత్రుసైన్యాలను దహింపజేయుగాక!

---

1 అహోరాత్రముల యందలి సంధిభాగాలు 2 రాక్షస సమూహం

లయకాలంలో సంభవించెడి మహోత్పాతాలతో గూడిన గర్జాధ్వనులతో భీతిగొలుపుతూ, దశదిశలయందూ విచ్చలవిడిగా తిరిగెడి మేఘమండలముల నుండి జాఱిన నిష్ఠురములైన కోట్లకొలది పిడుగుల తాకిడికి భుగ భుగమను శబ్దంతో జనించెడి అగ్నికణాలతో వెలుగొందుతూ శ్రీమన్నారాయణ కరవర్తియైన గదాయుధం నా వైరితండాలను ఖండనంలో చీల్చిచెండాడుగాక! కూశ్మాండాలను, వైనాయకులను[1], యక్షులను, రక్షస్సులను, భూతపిశాచాలను నుగ్గు నుగ్గుగాచేసి వినోదించుగాక!

నిఖిలషడ్త్యైక నిలయమైన శ్రీకృష్ణుని నోటినుండి వెల్వడు నిశ్వాస వాయువుచే పూరింపబడిన పాంచజన్యం[2] బ్రహ్మాండ ఖాండాలు బ్రద్దలయ్యేలాగా భయంకర ధ్వనిచేస్తూ భూతప్రేత పిశాచ విప్రగ్రహాలను పాఱద్రోలుగాక! నా శత్రువీరుల గుండెలనూ, వారి భార్యల గర్భస్థ శిశువులను అవియ జేయుగాక!

మిక్కిలి పదనైన అంచులతో రాక్షసవీరుల కంఠాలను ఖండించగా స్రవించెడి రక్తధారలతో కడిగివేయబడిన మాలిన్యంగల నందకం[3] భగవత్ప్రేరితమై నా వైరివ్యూహాలను కడికండలుగా[4] చెండిచెండాడుగాక!

మచ్చలేనిదీ, అడ్డులేనిదీ, దట్టమైనదీ, నూఱు చంద్రుల కాంతిగలదీ సర్వ సమర్థ లక్షణములుగలదీయగు చర్మాయుధం, దుర్మదులైన నా శత్రువీరుల చూపులను, దట్టమైన చీకట్లను హరించునట్లు హరించుగాక!

సమస్త పాపగ్రహాలనుండీ, సకల నర మృగ సర్పాదులనుండీ, ఏ విధమైన భయాలు కలుగకుండా భగవంతుని నామాలు, రూపాలు, వాహనాలు, దివ్యాస్త్రాలు నన్ను రక్షించుగాక !

బృహద్రథంతరం మొదలగు సామవాక్కులచే సన్నుతింపబడు ఖగేంద్రుడు నన్ను సమస్తాపదలనుండి రక్షించుగాక!

శ్రీహరి నామాలు, రూపం, వాహనం, ఆయుధాలు, పారిషదులు, నా బుద్ధిని, ఇంద్రియాలను, మనస్సును, ప్రాణాలను రక్షించుగాక!

భగవంతుడైన శేషుడు సర్వోపద్రవాలను నశింపజేయుగాక!

జగత్తంతా నారాయణ స్వరూపమే అను ధ్యానం కలవానికి అన్యరూపం గోచరించదు. వివిధావతారాలతో వేర్వేరు భూషణాలు, ఆయుధాలు, సంకేతాలు నిజమాయచే ధరించి వేర్వేరు నామాలతో వర్తించినా లక్ష్మీకాంతుడొక్కడే. అలాంటి పరాత్పరుడు వికల్ప విగ్రహములనుండి[5] నన్ను రక్షించుగాక !

---

1 పిశాచభేదాలు 2 కృష్ణుని శంఖం

3 శ్రీహరి ఖడ్గం, 4 ముక్కలుముక్కలుగా.

5 భ్రాంతివశంచేత కలిగెడి మార్పురూపాలు

భయంకరమైన అట్టహాసంతో గూడిన గుహవంటి నోరుకలిగి స్వతేజంచేత సమస్త తేజస్సులను హరించగల నృసింహమూర్తి సకల దిగ్భాగాలవలనను సమస్త బహిరంతరాలవలనను నన్ను రక్షించుగాక!-

అను నారాయణాత్మక కవచప్రభావం ఇంద్రుడు విశ్వరూపునివలన దెలిసికొని, దానిని ధారణచేసి, ఆ విద్యాధారణ మహిమవలన శత్రువులను జయించాడు. కనుక ఎవరైనా ఈ మంత్రాన్ని అనుదినం పఠిస్తే రణరంగంలో విజయం లభిస్తుంది. అన్ని సంకటాలు తొలగిపోతాయి. దుష్టగ్రహదోషాలు నశిస్తాయి. దుష్టకర్మలవలన కలిగెడి క్లేశాలు తొలగిపోతాయి. రోగాలేవీ దరిచేరవు. ఏ విధమైన వ్యాకులపాటూలేకుండా ప్రసన్నమైన మనస్సుతో సుఖంగా ఉంటాడు.

పూర్వం కౌశికుడను బ్రాహ్మణుడు ఈ విద్య నాశ్రయించి నిర్మల మనస్కుడై యొక యెడారిలో యోగధారణంచేత శరీరత్యాగం చేశాడు. చిత్రరథుడను గంధర్వుడొకడు తన భార్యలతో విమానారూఢుడై ఆకాశమార్గాన పోతూండగా దాని నీడ ఆ కౌశికుని అస్థిపంజరంపై పడేసరికి అది నేలపై కూలిపడ్డది. ఆ గంధర్వుడపుడెంతో తికమకపడ్డాడు. అక్కడనుండి కదలి విమానంతో ఎగిరిపోవాలని ప్రయత్నించాడు. కాని సాధ్యంకాలేదు. అపుడు వాలఖిల్యుడను ముని వానిని చూచి- ఓయీ! నారాయణ కవచాన్ని ధరించిన మహాపురుషుని పవిత్రమైన అస్థి సమూహం ఇది. ఇక్కడ నీ గంధర్వమాయలు పనికిరావు. విష్ణుభక్తులంటే సామాన్యులనుకున్నావా? ఆ మంత్రబలం నీ శరీరంలోని అవయవ సంధులను బంధించింది. ఆ బంధంతీరి నీవు ఇక్కడనుండి కదలి వెళ్లాలంటే ఒకే ఒక ఉపాయం ఉంది. చెపుతాను విను. ఈ పుణ్యాస్థికలను నీవు భక్తితో తీసికొనిపోయి తూర్పుదిక్కుగా ప్రవహించెడి సరస్వతీనదీజలాల్లో కలిపి స్నానం చేసి ఆచమనంచెయ్యి. అపుడు నీ అవయవబంధాలు విడిపోతాయి- అనేసరికి చిత్రరథుడు అలాగేచేసి విమానం అధిరోహించి నిజనిలయానికి వెళ్లిపోయాడు. అనుదినం ఈ ఇతిహాసాన్ని విన్నవారిని పఠించినవారిని సకల భూజాలం మ్రొక్కి పూజిస్తుంది.

ఇంద్రుడు విశ్వరూపుని వలన అఖిల సంపత్కరమైన యిలాంటి విద్య ధరించి ముల్లోకాల్లోను సాటిలేని ఐశ్వర్యాన్ని అనుభవిస్తూ మహామహిమాన్వితుడై యున్నాడు. నరేంద్రా! అనంతరం ఏం జరిగిందో తెల్పుతాను విను. విశ్వరూపునకు అరుదైన తలలు మూడున్నాయి. ఒకదానితో సురాపానం, ఒకదానితో సోమపానం చేస్తాడు. మూడోదానితో అన్నం భుజిస్తాడు. అతడు దేవతలతోపాటు ప్రత్యక్షంగా యజ్ఞభాగం గ్రహించి భుజిస్తూంటాడు. కాని తల్లిపైగల మమకారంచేత అతడు దేవతల కనుగప్పి యజ్ఞభాగాన్ని రాక్షసులకు

కూడా ఇవ్వడం మొదలుపెట్టాడు. అది గ్రహించి యింద్రుడు తనకు విరుద్ధంగా దుష్కర్మమునకు ఒడిగట్టిన విశ్వరూపునిపై ఆగ్రహించి అతని తలలు నరికి వేశాడు.

మునీంద్రుడైన విశ్వరూపుడు మహాతేజస్వియనికాని మహాత్ములలో అగ్రేసరుడనికాని లెక్కింపక, తానింతకుముందు చేసిన అకృత్యాలను తలపోయక దుస్సహమైన కోపంతో ఇంద్రుడు ఆతని తలలు ఖండించేసరికి వాటిల్లో సోమపానంచేసే తల కముజుపిట్ట అయింది. సురాపానం చేసేది ఊరుపిచ్చిక అయింది. అన్నంతినే తల తీతువుపిట్ట అయింది. బ్రహ్మహత్య యిలా త్రివిధపక్షి స్వరూపంతోవచ్చి ఇంద్రుని చుట్టుముట్టి తమ్ము పరిగ్రహింపుమని నిర్బంధించాయి.

అపుడు ఇంద్రుడు భయకంపితుడయ్యాడు. త్రిలోకనాయకుడైనా ఆ బ్రహ్మహత్యాపాతకాన్ని తప్పించుకోలేక దోసిలొగ్గి దాన్ని స్వీకరించాడు. ఒక సంవత్సరకాలం ఆ పాతకాన్ని అనుభవించి యనంతరం దాన్ని పోగొట్టుకోవాలనే ఊహతో, భూమిని, జలాన్ని, వృక్షాలను, స్త్రీలను, తన ఆ పాపాన్ని నాలుగు భాగాలుగా పంచుకొని గ్రహించమని అర్థించాడు. అందుకు ప్రతిఫలంగా భూమి తనయందెవరైనా గొయ్యిపెడితే ఆ గొయ్యి దానంతట అది పూడిపోయేలా వరం కోరింది. జలం తనయందు కడగబడినదేదైనా మలినరహితమై పవిత్రమయ్యేలాగా వరం అడిగింది. చెట్లు ఎవరైనా తమను ఛేదిస్తే తిరిగి చిగిర్చే వరం అర్థించాయి. స్త్రీలు తమకు ఎల్లప్పుడూ కామసుఖాలు కలిగేవరం ఇమ్మనివేడారు. ఇంద్రుడలాగేనని వారికి కోరిన వరాలిచ్చాడు. అపుడు భూమి, జలం, వృక్షాలు, స్త్రీలు ఇంద్రుని పాపాన్ని పంచుకున్నారు. ఆ పాపఫలితంగానే భూమియందు చవుడూ, నీటియందు బుడగలూ, నురుగూ, చెట్లయందు బంకా, స్త్రీలయందు రజోవికారమూ (ముట్టు) ఏర్పడ్డాయి.

## వృత్రాసుర వృత్తాంతం

తన కొడుకైన విశ్వరూపుని ఇంద్రుడు అలా వధించేసరికి త్వష్ట దుఃఖంతోను, రోషంతోను దహించుకుపోయాడు. ఇంద్రునిపై మారణక్రతుహోమం చేశాడు. ఆ హోమంనుండి లయాంతకభీకారాకారంతో కనులనుండి కణకణమను నిప్పులు కురియగా ముల్లోకాలూ క్షోభించేలా మహోగ్రుడైన యొకడుద్భవించాడు. అతడు యుగాంత సమయంలో ముల్లోకాలను లయం చేసెడి యముని మూర్తికి రెట్టింపున్నాడు. లావులోను, ఎత్తులోను రోజుకొక బాణపాత ప్రమాణంలో పెరుగుతున్నాడు. అగ్నిదగ్ధపర్వతం లాగాఉన్న అతని శరీరం సంధ్యారాగ కాంతిని విరజమ్ముతోంది. అతని మీసాలు, తలవెంట్రుకలు, అగ్నితప్తాలైన

రాగితీగల్లాగా కనులకు మిఱుమిట్లు గొలుపుతున్నాయి. మాధ్యందిన మార్తాండ (సూర్య) మండలంలాగా మిక్కిలి తీక్ష్ణమైన అతని నేత్రాంచలాలు దశదిశలను కంపింపజేస్తున్నాయి. వజ్రాయుధంలాంటి వాడియైన కోరలతో పెద్ద గుహవలె ఉన్న అతని నోరు భయంకరంగా ఉంది.

అతని మహాకాయం భూమ్యాకాశాల నడిమి ప్రదేశం అంతా నిండి పోయింది. అతని సిగనుండి పైకెగసెడి అగ్నిజ్వాలలకు త్రొట్రుపడి గ్రహ పంక్తులు జాఱిపడుతున్నాయి. భయంకరంగా నలువైపులా కాంతులను చిమ్మెడి తీర్చిన ముమ్మొనలుగల శూలం చేదాల్చి పారవశ్యంతో పొంగిపోతూ అతడు తిరుగుతూంటే భూమి చలించిపోతోంది.

అతడొక్కొక్కప్పుడు నోరు బాగాతెఱచి ఆకాశాన్ని అప్పళిస్తాడు. నాలుక చాచి గ్రహతారకలశక్తి దిగజాఱిపోయేలాగా నాకి విడుస్తాడు. అల వోకగా అట్టహాసంచేస్తూ లోకాలన్నింటినీ మ్రింగాలని చూస్తాడు. దిగ్గజాల దంతాలు చెక్కలయ్యేట్లు మహోగ్రాలైన తన కోరలను ఆడిస్తాడు. త్వష్టయొక్క తపఃప్రభావంచేత పుట్టిచెంది భయంకరమైన ఆకారంతో దేవవైరియైన ఆ రక్కసిచే ముల్లోకాలు వృతములయ్యాయి. (చుట్టుకొనబడ్డాయి) కనుక అతనికి వృత్రాసురుడు అనిపేరు వచ్చింది.

వృత్రుడలా మహోగ్రంగా స్వైరవిహారం చెయ్యడంచూచి దేవతలు క్రుద్ధులయ్యారు. వారు అతన్ని చుట్టుముట్టి అతనిపై మహాస్త్రాలు ప్రయోగించారు. కాని అతడు సామాన్యుడా? ఆ క్రూరాస్త్రాలన్నింటిని చుట్టి పట్టుకొని యిట్టే మ్రింగివేసి పెడబొబ్బలు పెట్టాడు. అలా దివ్యాస్త్రాలన్నింటినీ మ్రింగిన ఆ రక్షోనాయకునివంక చూడడానికికూడా ధైర్యంలేక భయభీతులై ఇంద్రాదులు తమకికదిక్కెవ్వరా? అని నలుదిక్కులకు పరుగులువెట్టారు. తుదకు వారందఱు మరల గుమిగూడి పుండరీకాక్షునకు మొఱపెట్టుకుందామని ఇలా చింతించారు–

వీడు దుర్ధర్షుడు. అత్యంతశక్తివంతాలైన మన ఆయుధాలను అలవోకగా మ్రింగివేశాడు. వీనికి సాటిరాగల వీరుడెవ్వడూలేడు. మనం బ్రతికేదారి యెక్కడాలేదు. మహాపద తటస్థించినది. శ్రీహరి ఒక్కడు తప్పితే మనల్ని ఈకష్టంనుండి గట్టెక్కించే వాడెవ్వడూలేడు. కనుక శ్రీధరుని దర్శించి ప్రార్థిద్దాం. అతని దర్శనం లభించేవరకు అతన్ని, అతని భక్తులైన పార్శ్వచరులను కీర్తిద్దాం. ఆ మహానుభావుడే వీడు చెడిపోయేదారి తెలియజేస్తాడు. అపుడు మన సురనిలయానికి ఏమీ భయం ఉండదు- అని తలపోసి వైకుంఠానికి బయలుదేరారు. వృత్రాసురుని భీకరాకారం చూచిన వారి కళ్లలో ఇంకా భీతి తొంగి చూస్తూనే ఉంది. అయినా అలాగే కళవళ పడుతూ సొక్కుచూ సోలుచూ పోయి పోయి పాలసముద్రం చేరారు. ఆ సముద్ర రామణీయకం వర్ణనాతీతం.

ఉత్తుంగ తరంగాలపై తెల్లని నురుగు ముద్దలు శ్రీమన్నారాయణుని కీర్తి
లత తొడిగిన పుష్పగుచ్ఛాలన్నట్లున్నాయి. నిరంతరం గోవిందచరణారవిందా
లను సేవించడంవలన లభించిన మహాపుణ్యఫలాలా అన్నట్లు దక్షిణావర్తశంఖాలు
సుడిగుండాల్లో తిరుగుతూ ఆ క్షీర సముద్రశోభకు వన్నె కూరుస్తున్నాయి. అతినిష్ఠు
రములైన పాఠీనాలు, పృథురోమాలు, రాజీవాలు, శకులాలు, తిమలు మొదలైన
చేపలూ, కర్కశములైన తిమింగలాలూ, తాబేళ్లూ, మొసళ్లూ మొదలగు జల
జంతులయొక్క దారుణ వక్రగతులచే ఒకదాని కొకటి నొరసికొనెడి తరంగాల
నుండి లేచిన నక్షత్రాల్లాంటి నీటి తుంపరలచే ఆకాశం కిక్కిరిసి పోయింది.

మిక్కిలి యెత్తైన కొండకొనలపైకి ప్రవహించెడి పాలవెల్లిచే పరిమార్జి
తములై శ్రీహరి శుద్ధాంతస్త్రీల విహరణార్థం అచ్చట నిర్మింపబడిన తెల్లని మేడలు
ధగధగ మెరుస్తున్నాయి. తనభార్యల ప్రేమానందాలకు ద్రవించిన శ్రీహరి అంత
రంగంనుండి స్రవించెడి కరుణారస సమ్మిశ్రితాలైన భావాంకురాల్లాగా పవడపు
తీవల మొలకలు నేత్రపర్వం చేస్తున్నాయి. ప్రసిద్ధ సిద్ధరసాంబుధరాల (మేఘాల)
పరస్పర సంఘర్షణం వలన జనించిన నిర్ఘోషకు భూనభోంతరాళం దద్దరిల్లిపోతోంది.
పాలవెల్లి సముద్ర మేఘలాప్రదేశమందు ధరింపబడిన కొత్తదుకూలంలాగా
ముచ్చట గొలుపుతూఉంది. హరిహరాది దేవతా సమూహానికి అమృత ప్రదానం
చేసిన మహానిధానమది. ఆ క్షీరాబ్ధి తీరమందు వైకుంఠవాసులకు కామిత ఫలాల
నొసగెడి మందార, పారిజాత, సంతాన, కల్పక, హరిచందన తరువులతో గూడిన
వనోపవనాలు కను విందు చేస్తూంటాయి.

ఆ క్షీరాబ్ధి కుబేరుని భాండాగారంలాగా పద్మం, మహాపద్మం, శంఖం,
మకరం, కచ్ఛపం, ముకుందం, కుందం, నీలం, వరల[1]వంటి వస్తుజాలంతో,
మనోహరంగా ఉంది. సుదర్శనచక్రాన్ని ధరించిన శ్రీహరి కరకమలంలాగా
సుడులతో దర్శనీయంగా ఉంది. చంద్రకళా ధరుడైన శివుని పాదస్పర్శచే పవిత్ర
మైన కైలాసంలాగా అమృతకిరణుడైన చంద్రునకు స్థానభూతమైనది. ఆది
ఇంద్రవైభవంలాగా కల్పవృక్ష, కామధేను, చింతామణులకు ఆకరమైనది.
సుగ్రీవ సైన్యంలాగా అసంఖ్యాకహరి[2] సంచారం కలది.

శ్రీమన్నారాయణుని ఉదరంలాగా నిఖిలభువన[3] భారాన్ని ధరింప సమర్థ
మైనది. శివుని జటాజూటంలాగా గంగానదికి ఆశ్రయభూతమైనది. బ్రహ్మలోకం
లాగా పరమహంసలచే[4] సేవింపబడునది. పాతాళ లోకంలాగా అనంతభోగి[5]

---

1 ఇవి కుబేరుని నవనిధుల పేర్లు (ఈ వర్ణనలయందు అర్థద్వయాన్ని గుర్తిం
చాలి 2 హరి = కోతి, కప్ప 3 భువనం = లోకం, నీరు
4 పరమహంసలు = ఉత్తమపదం చెందిన మహాయోగులు, ఉత్తమజాతి
హంసలు 5 భోగి = సర్పం, సుకవాసి.

భోగయోగ్యమైనది. నందనవనంలాగా ఐరావతానికి, రంభాద్యప్సరలకు మూల స్థానమైనది. మెఱపు తీవల మొత్తంలాగా ఆకాశాన్ని ఒరుస్తూ ఉంటుంది. శ్రీహరి నామకీర్తనంలాగా నిర్మల స్వభావంకిలది. అలామనోజ్ఞంగా ఉన్న క్షీరసముద్రాన్ని దేవగణం సమీపించి ఆ దాపునగల శ్వేతద్వీపంలో సకలదిక్పాలకులచేత పరివేష్టితుడై యున్న శ్రీమన్నారాయణుని దర్శించి యిలా సన్నుతించారు.

ప్రభూ! పంచభూతాలతో నిర్మింపబడిన ఈ ముల్లోకాలకు నీవు అధిపతివి. అందఱితో గూడి బ్రహ్మ, మేమూ నిన్ను ఆరాధిస్తాము. నీవు సర్వేశ్వరుడవు. వేదవినుతుడవు. సర్వాత్మకుడవు. పూర్ణకాముడవు. అహంకారదూరుడవు. సముడవు. శాంతుడవు. కృపాస్పదుడవు. నీకంటె అన్యులెవ్వరూ మమ్ము రక్షించేవారులేరు. నీవొక్కడవే మాకుదిక్కు. అలాంటి నిన్ను విడిచి మూర్ఖుడెవడైనా ఇతరులను శరణు వేడడం కుక్కతోకను బట్టుకొని మహార్ణవాన్ని ఈదాలని యత్నించడంలాగా నిష్ఫలం

ప్రళయజలధిలో మునిగిపోతూన్న భూమిని ఓడగాచేసి కొమ్మునకు అంటగట్టి సముద్ధరించడం మూలంగా మన్వాదులను రక్షించిన మత్స్యమూర్తివగు నీకు మమ్మల్ని రక్షించడం లెక్కలోనిదికాదు. తండ్రీ! మా లోకపాలురభాగ్య దేవతవు నీవు. నీ విప్పుడు వృత్రాసుని దురంతాల నుండి మమ్మల్ని రక్షించు. ప్రళయ వాయువుచే సంక్షుభితములైన ఉత్తుంగతరంగాలతో నిండిన జలధిని శయ్యగా చేసుకొని బ్రహ్మ యంతటి వాని నాభికమలమందు నిలిపి రక్షించిన నేర్పరివి నీవు. నీవు ఏకాకివి. నీ ప్రతిభ ఇంతా ఇంతా అని చెప్పడానికి సాధ్యం కాదు. నీవుకాక మమ్మల్ని ఆదరించే వారెవ్వరు? దేవదేవుడవు సకలలోక శరణ్యుడవు అయిన నిన్ను శరణుజొచ్చిన మేము వృత్రాసురుని ఆపదలనుండి బయటపడి సకలశుభాలను పొందగలమని విశ్వసిస్తున్నాము— అని స్తుతించిన దేవతలకు శ్రీహరి సాక్షాత్కరించాడు.

చేతులందు శంఖం, చక్రం, గద మొదలైన ఆయుధాలు మెరిసిపోతున్నాయి. మెడలో శ్రీవత్సం కౌస్తుభం ప్రకాశిస్తున్నాయి. శిరస్సున మాణిక్యమయమైన కిరీటం వెలుగులు చిమ్ముతోంది. నానావిధ దివ్యాభరణ కాంతులు నలుగడల వ్యాపిస్తున్నాయి. వక్షస్థలమందు లక్ష్మి ఆసీనయై యుంది. అతని విశాలనేత్రాలు తెల్లదామర రేకులను నిరసిస్తూన్నాయి. తనవంటి సేవకులెందఱో వెంటనున్నారు. పచ్చని వలువధరించి అమృతం జాలువారెడి చిఱునవ్వుతో అలా ప్రత్యక్షమైన వైకుంఠుని దేవతలు తత్తరపాటుతో కన్నులకలవు తీరునట్లుగాచూచి పరవశించిపోయారు.

తానూ, తనసేవకులు ఒకే రూపంలో ఉన్నా శ్రీవత్సం, కౌస్తుభం తనను వేఱుగా గుర్తింప జేస్తున్నాయి. వికసించిన తామరపువ్వులవంటి కన్నుల తుదల

నుండి కరుణరసం జాలువారుతోంది. వక్షస్థలాన్ని అధివశించిన లక్ష్మి అఖిల లోకాలకు స్థానభూతమైన భాగ్యాన్ని తెలియజేస్తోంది. బ్రహ్మకు పుట్టినిల్లైన నాభి కమలం త్రిమూర్తులకూ ఆదియైన తేజాన్ని వ్యక్తంచేస్తోంది. ఊహింపనలవికాని పుణ్యాన్ని అతని పాదములనుండి జనించిన గంగ తెలుపుతోంది. అప్రమేయుడూ, అభవుడూ, అవ్యక్తుడూ, అవ్యయుడూ, ఆదిపురుషుడూ అయిన నారాయణుడు సాక్షాత్కరించే సరికి దేవతలు ఆహ్లాదంచెంది ఫాలతలాన కేలుదోయిని గీలుకొలిపి యిలా అన్నారు—

ఆదిపూరుషా! పొందనలవికాని స్వర్గాది ఫలాలను అందజేయ జాలిన సత్వ సంపన్నుడవైన నీకు మా నమస్కారాలు. యోగీంద్రులచే సన్నుతింప బడువాడవూ, శార్ఙ్గ మను వింటిని దాల్చిన వాడవూ, మకరకుండలధారివీ, రణరంగ మందు అరివీర భయంకరుడవూ అయిన నీకు మా కైమోడ్పులు. గజరాజును రక్షించినవాడవూ, రాక్షస సంహర్తవూ, పూర్ణేందు మండలంలాంటి ముఖం గల వాడవూ, తేజోనిధివీ, అయిన నీకు మా ప్రాంజలులు. అద్భుతమైన పుణ్యమూర్తివీ, వైకుంఠవాసివీ, ఆశ్రితరక్షణ తత్పరుడవూ, శేషశాయివీ అయిన నీకు మా ప్రణామాలు.

శ్రీహరీ! దేవతలు వృత్రాసురుని చేజిక్కారు. ఖేచరులు చిందరవందర లయ్యారు. సాధ్యులు స్రుక్కి కృశించారు. ఉరగులు యుద్ధరంగంలో సోలితూలి పోయారు. యక్షులు నశించారు. అతనిబారినుండి ఎలాగో తప్పించుకొని వచ్చిన మమ్మల్ని అయినా రక్షించు. నిరాధారులైన రాక్షసులకు వృత్రుడు ఆధారభూతు డయ్యాడు. మాకు ఆపదలకు కారణభూతుడయ్యాడు. అతడు భీకరాకారుడు. ఆద్యంతాలులేకుండా ముల్లోకాలూ వ్యాపించిన ఆ రక్కసిని అంతంచెయ్యి. దిక్కు లన్నింటికి దిక్కైన మాకు ఈనాడు ఎక్కడా కాలుమోపడానికైనా దిక్కులేదు. దిక్కులేనివారికి నీవేదిక్కు. మా దీనావస్థనుజూచి మమ్ము రక్షించు. నిన్నాశ్రయిం చనివారికి ఇంకెక్కడా దిక్కులేదు. ఇహపరములయందు సుఖంగా ఉండాలను కునేవారికి నీదిక్కే దిక్కు. మా ఆయుధాలను మ్రింగి మా తేజస్సును హరించి ముల్లోకాలనుగూడ గ్రసించాలని యత్నిస్తున్న మహోగ్రాకారుడైన వృత్రుని వధించి మా భంగపాటును తొలగించు. పరమపురుషా! పరమేశా! దుఃఖహరణా! భక్తవరదా! భవవిదూరా! జలజనేత్రా! కృష్ణా! నిన్ను శరణువేడిన మాకు అభయ మిచ్చి మమ్మల్ని రక్షించు— అని సన్నుతించి యింకా ఇలా అన్నారు!

నారాయణా! వాసుదేవా! ఆదిపురుషా! మహానుభావా! పరమమంగళా! పరమకల్యాణా! కరుణాసముద్రులయిన పరమహంసలగు యోగులు ఆచరించెడి సమాధిభేదాలవలన పరిభావితమై పరిస్ఫుటమైన పరమహంస ధర్మంచేత

అజ్ఞానకవాటాన్ని తొలగించి ఆత్మదృష్టితో చూచెడి వారికే నీవు లభిస్తావు. నీవు ఆత్మారాముడవు. నిజసుఖానుభూతిలో మునిగితేలుతూ ఉంటావు. జీవాత్మకు ఉపాధిభూతాలైన ఈ దేహాలకు నీవు ఉత్పత్తి స్థితి లయకారుడవు. నీవు నిర్గుణుడవు. స్వతంత్రుడవు. అయినా గుణసాంగత్యంచేత పతితుడవైన నీవు పరతంత్రుడవై సుఖదుఃఖాలనుభవిస్తూ ఉంటావు. నీవు షడ్గుణైశ్వర్య *సంపన్నుడవు. నీ మాహాత్మ్యం దురవగాహం.

అర్వాచీనుల సంశయమూలకములైన ఊహామార్గాల్లో ఒకదానిని స్థాపించడానికి ప్రమాణాభాసాలను దెలిపెడి తర్కశాస్త్రంలో ప్రజ్ఞగురించి కలుషితములైన అంతఃకరణములతో దురాగ్రహులైన వారి వాదప్రతివాదాలకు నీవు విషయీభూతుడవుకావు. నీవు మాయామయుడవు. నిజమాయచే నీవు గోచరుడవుకావు. యుక్తిగోచరుడవై సమవిషయరూపాలతో ప్రవర్తిస్తావు. ఒకడు త్రాటినిజూచి సర్పమను భ్రాంతి చెందుతాడు. మఱియొకడు దానిని త్రాడుగానే భావిస్తాడు. దానికోసం వారుచేసే వాదాలకు త్రాడు హేతువై ఉంటుంది. అలాగే నీవున్నూ నిన్నుగూర్చి వాదోపవాదాలు చేసెడి సమబుద్ధులకూ విషమబుద్ధులకూ వారివారి ఊహలకు అనుగుణంగానే వర్తిస్తూ ఉదాసీనుడవై ఉంటావు. కాని దుర్వాదాలను నీవు నిషేధించవు. కావున వారివారి వాదాలకు వారి సమ విషబుద్ధులే కారణంగాని నీవుకావు.

దేవా! నీవు సర్వజగత్కారణ స్వరూపుడవు. సర్వభూతప్రత్యగాత్మవు. నీ మహామహిమ హిమయనెడి అమృతసముద్రంలోని బిందువులను నిరంతరం ఆస్వాదించి సంతుష్టచిత్తులై నిత్యానందంలో ఓలలాడుతూ విషయసుఖాలను విస్మరించిన భాగవతులుకూడా నీ పాదాంబుజసేవాధర్మాన్ని విడిచిపెట్టరు.

త్రివిక్రమా! త్రిణనయనా! త్రిలోకమనోహరానుభావా! దనుజులుకూడా నీ విభూతిభేదాలే. అలాంటప్పుడు వారిని వధించడంకూడా అనుచితమే. అయినా దౌష్ట్యానికి పాల్పడినవారికి ఇది అభ్యుదయ కాలంకాదని భావించి వారిని నీవు జయింపగోరితే పూర్వంనీవు నిజమాయాబలంచేత సుర, నర, మృగ, జలచరాది రూపాలుధరించి ఆయా అవతారాల్లో అనుగుణమైన రీతిని వారిని శిక్షించినట్లు ఇపుడు ఈ వృత్రాసురుని వధించు. భక్తవత్సలా! నీ ముఖకమలంనుండి వెల్వడెడి మధుర వచనామృత ధారలచేత మా హృదయతాపాన్ని పోగొట్టు. నీవు సమస్త జీవకోటి హృదయాల్లో ప్రత్యక్ఛరీరుడవై ఉంటావు. వెలుపల ప్రకృతి శరీరకుడవై దేశకాల పాత్రలననుసరించి సుఖదుఃఖాల ననుభవిస్తూ సమస్త జీవుల

---

*ఐశ్వర్యం, వీర్యం, యశం, శ్రీ, జ్ఞానం, వైరాగ్యం- ఇవి షడ్గుణైశ్వర్యాలు.

చిత్తవృత్తికి సాక్షీభూతుడవై ఉంటావు. సాక్షాత్పరబ్రహ్మస్వరూపుడవైన నీకు మేం ఏమని విన్నవిస్తాం, జగదాశ్రయమై, సకలపాపాలను, సంసారవ్యథలను పోగొట్టెడి నీ పాదాంబుజచ్ఛాయను ఆశ్రయిస్తాం. నీవుకాక మాకు ఇంకా దిక్కెవ్వరు? దేవదేవా! మా తేజాన్ని మా ఆయువును మా దివ్యాయుధాలను యుద్ధ రంగంలో ఆ దానవుడు మింగివేశాడు. ఇంక మాకు జయాశయెక్కడ? అని దేవతలు నిస్పృహతో పలికేసరికి పరమేశ్వరుడు అమృతప్రాయాలైన గంభీర వాక్కులతో ఇలా అన్నాడు.

దివిజులారా! నన్ను సాక్షాత్కరింప జేసుకోకలిగిన మీ జ్ఞానసంపత్తికి నేను ఆనందించాను. నా యెడ మీకుగల భక్తి ప్రపత్తి ఎన్నడూ వ్యర్థంకాదు. నా భక్తులకు నావలన పొందరాని అర్థమేదీలేదు. విశేషించి నాయందు ఏకాంత మతియైన తత్వజ్ఞుడు నన్ను అన్యమేదీ అర్థించడు. తత్వజ్ఞాని విషయ విముఖుడై సంసారాన్ని వాంఛింపడు. కనుక మీకు శుభం కలుగుగాక!

దధీచియను ఋషిపుంగవుడొకడున్నాడు. అతడు ఆత్మజ్ఞాని, మహాతేజస్వి. అతని శరీరం అత్యంత బలిష్ఠమైనది. అతన్ని యాచించి మీరు అతని శరీరాన్ని తీసుకోండి. అతడు పూర్వం అశ్విదేవతలకు బ్రహ్మస్వరూపమైన అశ్వశిరో నామక విద్యను ఉపదేశించగా వారు జీవన్ముక్తులయ్యారు. త్వష్ట కుమారుడైన విశ్వరూపునకు ఆత్మస్వరూపమైన అభేద్యకవచం ఇచ్చాడు. అతడు మహాదాత. అశ్విదేవతలను పురస్కరించుకొని మీరు ఆ మహర్షిని అర్థించండి. అతడు మీకు తప్పక తన శరీరాన్ని ఇస్తాడు. దాని శల్యాలతో విశ్వకర్మ శతధారలు గల దివ్యాయుధాన్ని సృష్టిస్తాడు. నా తేజో విశేషంచేత అది అత్యంత శక్తివంతమై వృత్రాసురుని తలను భేదించడానికి కారణమవుతుంది. అపుడు మీరు మీ తేజం, ఆయువు, ఆయుధాలు, సంపదలు, పొందగలుగుతారు. నా భక్తులైన వారికి ముల్లోకాల్లో అపజయమనేది ఉండదు. కనుక మీకు భద్రం కలుగుతుంది— అని ఆదేశించి భూతభావనుడైన భగవంతుడు అదృశ్యుడయ్యాడు.

అప్పుడు దేవతలు దధీచికడకువెళ్ళి అశ్విదేవతలను పురస్కరించుకొని యిలా అన్నారు— జీవుడు సుఖాకాంక్షతో శరీరాన్ని కల్పించు కుంటున్నాడు. అంచేత శరీరధారియైన వాడెవ్వడూ తనశరీరాన్ని విడిచి పెట్టడానికి అంగీకరించడు. అయినా మేము మా స్వీయ శరీరసుఖంకోసం నీ శరీరం ఇమ్మని అర్థించడానికి వచ్చాం. దేవతలమైన మాకు నీ శరీరాన్ని ఇచ్చి అనుగ్రహించు. వాస్తవంగా లోకంలో ఎవ్వరూ ఇలాంటి కోరికకోరరు. మహాపదలో ఉండి మేం నీ దేహాన్ని యాచిస్తున్నాం. ఇది దైవకృతం కాకపోతే యేమిటి? ఇంతటి దారుణకృత్యానికి ఒడిగట్టడమేమిటి? లోకంలో ఎవరైనా ఇలాంటి దుష్కరమైన దానాన్ని కోరతారా?

యాచన నికృష్ట కర్మమని తెలిసికూడా తగనివస్తువును యాచించే వాడెంతనేర్పరి యైనప్పటికీ నీచాతినీచుడుగా గణింపబడతాడు. అయినా మేం నీ శరీరాన్ని కాంక్షించి వచ్చాం. అడిగేవానికి దయాదాక్షిణ్యాలుంటయ్యా?—

అని దేవతలనేసరికి దధీచి మనస్సులో ఆనందం చెందాడు. నవ్వుకున్నాడు. సరసవాక్కులతో ఇలాఅన్నాడు. ప్రాణికి మృత్యుభీతి సహజం. ఎప్పుడూ కావాలని చావుతెచ్చుకోడు. కృపాబుద్ధితో మీరు ఆ మాత్రం మీ మనస్సులో ఆలోచింపలేరైరి. నాలుగు కాలాలపాటు బ్రతకాలనే కోరికగల వానికి శరీరం తీపికాదా? సాక్షాత్తు శ్రీహరివచ్చి అడిగినా స్వీయశరీరాన్ని ఇచ్చేదాతఉన్నాడా? లోకంలో ఎవరైనా ఏదైనా వస్తువు నర్థిస్తారుగాని శరీరాన్ని ఇవ్వమని యాచిస్తారా? ఎంతటి దుష్కరవస్తువునైనా ఇచ్చేదాత ఉండవచ్చు. కాని తన దేహాన్నే ఇచ్చేది దాతలుంటారా? ఒకవేళ త్యాగబుద్ధితో వెనుదీయకుండా ఏ మహాదాతయైనా ఆత్మ శరీరాన్ని ఇచ్చినా ఆ యాచకుడు దాన్ని చేజేతా చంపగలడా? పోనీచంపినా దానిలోని ఎముకలను ఏరి తీసుకొనిపోయెడి వాడుంటాడా? మీరు లోకపాలకులు. మీకు ఇలాంటి హింసాబుద్ధియెలాపుట్టింది? మీకు మీ ప్రాణాలమీద భ్రాంతియెలా ఉంటుందో ఇతరులకుకూడా అలాగే ఉంటుందని మీరు ఆలోచించవద్దా?— అని దధీచి అనేసరికి దేవతలిలా అన్నారు.

మునీంద్రా ! నీవు సకల భూతదయాపరుడవు. పుణ్యవర్తనుడవు. కీర్తి కాముడవు. అలఘుమతివి. నీవంటివారికి ఇయ్యరాని అర్థం ఉండదు. యాచకుని సంగతి చెప్పేదేముంది? ఆతడు తన ఆతురతకొలదీ అడగరాని వస్తువునైనా అడగకుండామానడు. అలాగా యాచించినపుడు ప్రాణాన్నైనా ఇచ్చేవాడు ఇస్తాడుకాని ఇవ్వకుండా దాచుకోడు.- అనిదేవతలు స్వార్థపరత్వంతో ఇతరుల కష్టాన్ని గ్రహించకుండా వినయవాక్కులతో వేడేసరికి దధీచి చిఱునవ్వుతో ఇలా సమాధానం చెప్పాడు.

లోకపాలకులారా! అఖిలలోక ధర్మం యెఱిగికూడా నేను మీకు ఎదురు పలికాను. క్షమించండి. ఈ శరీరం ఎప్పుడైనా విడువవలసినదే! అలాంటప్పుడు మీయంతటివారు వచ్చి అడిగినపుడు విడిచిపెట్టడం దుర్లభంకాదు. నశ్వరమైన ఈ శరీరం వలన పుణ్యం, కీర్తి లభిస్తున్నప్పుడు ఎవడు కాదంటాడు? అలా ఎవడైనా కాదంటే అతడు పాషాణంకంటె కఠినుడు కాగలడు. నా శరీరం ఎంతటి మితిలేని ధర్మోపార్జనమునకు నోచుకొన్నదో మీవంటి పుణ్యశ్లోకులువచ్చి దాన్ని అర్థించారు. లేకపోతే శోకానుభూతితో శోకం, హర్షానుభవంతో హర్షం పొందుతూ నష్టాలకూ దైన్యానికి ఆకరమైన ఈ శరీరం, తుదకు నక్కలపాలు కావలసినదేకదా! అలాంటి దుస్థితి కలగకుండా మేలైంది.- అని దధీచి నిశ్చి

తాత్ముడై తత్వదర్శనంచేత భవబంధనాలు త్రెంచివేసుకున్నాడు. బుద్ధి, ఇంద్రియాలు, మనస్సు- వీటితోగూడిన జీవుని పరబ్రహ్మస్వరూపమైన భగవంతునితో ఏకీభూతం చేశాడు. యోగజ్ఞానంతో దేహత్యాగం చేశాడు.

అపుడతని శల్యాలతో విశ్వకర్మ నిర్మించిన శతధారలు (నూఱంచులు) గల వజ్రాయుధాన్ని చేదాల్చి ఇంద్రుడు దైవతేజంతో నిజశక్తి ప్రవృద్ధంకాగా ఐరావతాన్ని అధిరోహించి మహోత్సాహంతో వృత్రాసురునిపై దండెత్తాడు. దేవగణం, గరుడులు, గంధర్వులు, ఖేచరులు, కిన్నరులు, కింపురుషులు, సిద్ధులు, సాధ్యులు, విద్యాధరులు, మహర్షులు అమితానందంతో అమరేంద్రుని సన్నుతిస్తూ కోలాహలంతో అతని వెంటవెళ్ళారు.

వృత్రుడు సామాన్యుడుకాడు. మనువంశంలో జన్మించిన పుణ్యాత్ముడు. లోకసంహారానికి కంకణం కట్టుకొన్న వీరాగ్రణి. ఎంతటివానినైనా నిగ్రహించి పరుషోక్తులతో నొంచగల నేర్పరి. తెరచిన ఆతని నోరు దేవతలను సర్పాలకు గుహాప్రదేశంలాంటిది. అతడు ఇంద్రుడు మహోత్సాహంతో రావడంచూచాడు. ప్రళయభీకరాకారం ధరించాడు. రాక్షసవీరులు నలువైపులా బలిసికొలవగా మదగజాలమధ్య చనెడి నడకొండలాగా, మహోద్ధతితో మహేంద్రుని ఎదుర్కొనడానికి బయలుదేరాడు. రుద్రుడు విజృంభించి యమునిపై పడినట్లు ఆతడు దిక్కులు కంపించేలాగా గర్జిస్తూ ఇంద్రునిపై పడ్డాడు.

ఇంద్రుని సైన్యంలో రుద్రగణాలు, మరుద్గణాలు, ఆదిత్యగణాలు, అశ్వి దేవతలు, పితృదేవతలు, విశ్వేదేవులు, అగ్ని, యముడు, నైరృతి, వరుణుడు, వాయువు, కుబేరుడు, ఈశానుడు మొదలైన వారున్నూ, సిద్ధులు, సాధ్యులు, కిన్నరులు, కింపురుషులు, గరుడులు, గంధర్వులు, ఖేచరులు మున్నగువారున్నూ ఉన్నారు. వృత్రాసురుని సేనావాహినిలో నముచి, శంబరుడు, అనర్వుడు, ద్విమూర్ధుడు, వృషభుడు, అంబరుడు, హయగ్రీవుడు, శంకుశిరుడు, విప్రచిత్తి, అయోముఖుడు, పులోముడు, వృషపర్వుడు, హేతి, ప్రహేతి, ఉత్కటుడు, ధూమ్రకేశుడు, విరూపాక్షుడు, కపిలుడు, విభావసుతు, ఇల్వలుడు, పల్వలుడు, దందశూకుడు, వృషధ్వజుడు, కాలనాభుడు, మహానాభుడు, భూతసంతాపనుడు, వృకుడు, సుమాలి, మాలి, మొదలైన అసంఖ్యాక దైత్యదానవ యక్షరాక్షసవీరులూ ఉన్నారు. ఉభయసేనలు తలపడి భయంకర యుద్ధం చేశారు.

గదలు, కత్తులు, ఈటెలు, బాణాలు ఇనుపగుదియలు, చిల్లకోలలు, గండ్ర గొడ్డళ్ళు, శూలాలు, చక్రాలు ధరించి దేవదానవ వీరులు మహోగ్రంగా గర్జిస్తూ ఒకరినొకరు ఎదుర్కొని పోరాడుతుండగా మంటలురేగి ఆకాశాన్ని క్రమ్మివేశాయి. రణరంగం ప్రళయభీకరంగాఉంది. సురశ్రేష్ఠులు ప్రయోగించిన బాణాలు కంటి

కగపడకుండా ఆకాశాన్ని క్రమ్మివేసే సరికి దివసాంతమైనట్లుతోచింది. అప్పుడు రాక్షసరాజు సైనికులు ఆ బాణాలన్నింటిని నుగ్గునుగ్గుగాచేసి దట్టమైన చీకట్లను కల్పించి కేకలుపెట్టారు. యుద్ధమదంచేత కనుగ్రమ్మిన సురాసుర వీరుల పాద ఘట్టనలచే రేగిన దుమ్ము రోదసినిండా వ్యాపించి కాఱుచీకట్లు క్రమ్మినట్లయింది. అప్పుడు వారికంటికి ఏమీకననబడకపోయినా పట్టుదల విడువకుండా మహారోషంతో పెనగులాడడం మొదలుపెట్టారు. ఉభయపక్ష సైనికుల శరీరాలు గాయాలతోనిండి పోయాయి. ఆ గాయాలనుండి రక్తం ధారలుగా ప్రవహిస్తూంటే వారిశరీరంనుంచి రోషాగ్ని జ్వాలలు పెల్లగిలి వెల్వడుతూన్నట్లుంది.

వింటినారి టంకారధ్వనులు భటుల సింహనాదాలను అతిశయిస్తున్నాయి. హయహేషాఘోషలు మదగజ ఘీంకారాలను క్రిందు పఱుస్తున్నాయి. శంఖ ధ్వనులు రథనేమి నిస్వనాలను మరుగుపరుస్తున్నాయి. దుందుభుల మ్రోతలు వీరుల అట్టహాసాలను అణచి వేస్తున్నాయి. శస్త్రాస్త్రాల పరస్పర సంఘట్టనం వలన జనించిన అగ్నికణాలు కిరీటాలయందలి మణికాంతులను ధిక్కరిస్తున్నాయి. ఇలా ఉభయ సైన్యాలు సంకుల సమరానికి తలపడినప్పుడు రణాంగణం ప్రళయ కాలసంరంభంలో ఉవ్వెత్తుగాలేచి పడెడి అలలనిర్ఘోషతో అత్యంత భయావహంగా ఉన్న మహాసముద్రంలాగా ఉంది. ఉభయసేనలు యుగాంతంలో చెలరేగిన పెనుగాలికి కంపించిన పిడుగులతోగూడి భీకరంగా ఉరుముతూన్న కాలమేఘాల్లాగా ఉన్నాయి.

పదాతులు (కాల్బంట్లు), రాహుత్తులు (అశ్వసేన), గజసేన, రథికులు మహారథికులు ప్రచండమైన వేగంతో ఒకరిపై నొకరు నిరంతరంగా బాణాలు ప్రయోగిస్తున్నారు. గదలతో చదుపుతున్నారు. కత్తులతో కవచాలను తుత్తుని యలు చేస్తున్నారు. శూలాలతో గుచ్చుతున్నారు. గొడ్డళ్ళతో నఱుకుతున్నారు. గుదియలతో మోదుతున్నారు. నానావిధాయుధాలు చేద్గాల్చి వెంటబడి తరుము తున్నారు.

గుఱ్ఱాలపైకుఱికి వాటితోకలు నరికివేస్తున్నారు. వివిధాంగాలను చీల్చి చెండాడుతున్నారు. ఏనుగులపైబడి వాటి శరీరాలను నుగ్గునుగ్గు చేస్తున్నారు. కుంభ స్థలాలను పగలగొడుతున్నారు. దంతాలను విరుస్తున్నారు. తొండాలను తుండె తుండాలుగా ఛేదిస్తున్నారు. అలాగే రథాలపై విజృంభించి విఱుగ గొడుతున్నారు. రథికులను, సారథులను మర్దిస్తున్నారు. రథాశ్వాలను చంపుతున్నారు. ఛత్రచామ రాలను తుఱుమాడుతున్నారు. కిరీటాలను బ్రద్దలుచేస్తున్నారు. కంటబడిన వీరు లను వధిస్తున్నారు. శత్రుయోధుల వింటి అల్లెత్రాళ్ళను త్రెంచివేస్తున్నారు. విండ్లను విరచివేస్తున్నారు. యుద్ధరంగం అంతా రక్తమాంసాలతోను, మేదస్సు తోను నిండి భయావహంగాఉంది.

ఉభయపక్షాల సైనికులు పరాక్రమంలోను, శస్త్రాస్త్రప్రయోగ పటిమలోను, ఒకరికొకరు వెనుదీయకుండా సమప్రతిభతో మహోగ్రంగా పోరాడుతున్నారు. యుద్ధరంగంఅంతా రక్తపుచేరులతో నిండిపోయింది. భూతాలు గుంపులు గుంపులుగావచ్చి సంభ్రమపాటుతో ఆ నదులందుతికి కోష్ఠరం లోతున తిరుగుతూ స్వైరవిహారంచేస్తున్నాయి. ఆ భూతాలను అనుసరించి శాకినులు (పిశాచాలు) మహోల్లాసంతో తనివిదీరా మాంసం తింటూ నాట్యం చేస్తున్నాయి. మదించిన డాకినులు [ఆడుదయ్యాలు] భటుల మృతదేహాలనుండి నృత్తరీతిలో సవిలాసంగా ప్రేగులు లాగి మెత్తని కొవ్వును తింటూ పరవశిస్తున్నాయి. రణరంగం భీభత్సంగా ఉంది.

అలా దేవదానవులు నర్మదానదీ తీరాన కృతయుగంలో తంపడి త్రేతాయుగ ప్రవేశకాల పర్యంతం దారుణంగా యుద్ధం సాగించారు. అయినా ఉభయపక్షాలూ సమాన బలసంపత్తిగల వారవడంచేత జయలక్ష్మి ఎవరినీ వరించలేదు. అపుడు రాక్షసులు తెగబడి పెద్దపెద్ద చెట్లను, రాతిబండలను, పర్వత శిఖరాలను పెకల్చితెచ్చి సురసైన్యంపై వర్షించేసరికి సురలు తమ నిశిత బాణాలతో వాటి నన్నింటిని పొడిపొడిచేశారు. అలా వారి భుజబలం అంతా భంగంకాగా దానవవీరులు నిస్పృహచెందారు. వారి మదోద్రేకం అణగిపోయింది. వారు దేవతలపై ప్రయోగించెడి అస్త్రాలన్నీ, సచ్చరిత్రులయెడ దుష్టుడు పలికెడి మాటల్లాగా వ్యర్థాలయ్యాయి.

అపుడు సురలు విజృంభించి భీషణాస్త్రాలు ప్రయోగింపగా వాటిధాటికి నిలువలేక పౌరుషం ఉడిగి, పంతం విడిచి, సిగ్గు దిగనాడి గంతుకుంటూ పారిపోతూంటే వారినిచూచి వైరివీరులు పరిహసిస్తూ కేకలువేశారు. ఖచరులారీతిగా జయధ్వానాలు చేస్తూంటే కొండల్లాంటి రక్కసులు ధైర్యం కోల్పోయి, రణభూమిలో ఎక్కడి ఆయుధాలు అక్కడే విడిచి ఒకరినొకరు త్రోసుకుంటూ పారిపోయారు. అలా రణరంగం విడిచి పారిపోతున్న రాక్షసవీరులను చూచి వృత్రాసురుడు పకపకనవ్వుతూ ఇలా అన్నాడు-

ఓయీ! మీరు శూరులు. మీరిలాంటి నీచవృత్తికి పాల్పడడం తగదు. కీర్తిని, వీరస్వర్గాన్ని కల్పించెడి చావు కావాలనుకున్నా దొరుకుతుందా? తల్లడపడి యుద్ధధర్మాన్ని మాని శస్త్రాస్త్రాలు విడిచి పారిపోవడం న్యాయమా? మహావీరుడూ, దుర్దమరణోన్మత్తుడూ అయిన వృత్రుని అండ ఎలాంటిదో మీరెఱుగరా? ప్రాణికి చావు ధ్రువం. అయితే రణరంగంలోను, యోగమార్గంలోను తటస్థించిన చావుమాత్రం వాంఛనీయం. అంతేకాని మఱోవిధమైన చావు చావా?- అని

వాసుదేవుని తేజోవిశేషంచేత విశిష్టశక్తిని గడించి దావాగ్ని శిఖల్లాగా వెలుగొందుతూ, వెఱచి వెన్నిచ్చి పాఱిపోయెడి అసురుల వెంటబడి తఱుము సుర వీరులను చూచి వృత్రుడు -స్వర్గానుభవమందు మీకు కోరికలేకపోతే నా ముందుకు వచ్చి నిలబడండి- అని హుంకరించాడు. అతని కంఠ హుంకారం కల్పాంత మందలి మేఘగర్జనంలాగా కఠోరంగా ఉంది. అతని చూపులు ప్రళయాగ్నిచే జ్వలింపజేయబడిన అగ్నిశిఖలను తిరస్కరిస్తూన్నాయి. యుగాంత సమయంలో లీలాలోలుడైన రుద్రుడులాగా అతడు భయంకరాకారం వహించి భుజాస్ఫాలనం చేశాడు. ఆ ధ్వని సకల ప్రాణికోటియొక్క దుర్భరభారాన్ని వహించడంచేత భగ్నమైన బ్రహ్మాండభాండ ధ్వనిలాగా మహోగ్రంగా ఉంది.

వృత్రాసురుడు అలా భుజములు చఱచి బొబ్బలు వెట్టేసరికి లోకాలన్నీ కలిసిపోయాయి. సూర్యచంద్రులు అస్తంగతులయ్యారు. పర్వతాలు కంపించాయి. ఆకాశం బ్రద్దలయింది. సముద్రాలు ఇంకిపోయాయి. గ్రహాలూ నక్షత్రాలు పట్టుతప్పాయి. దిక్కులు పగిలిపోయాయి భూమి క్రుంగిపోయింది. బ్రహ్మాండ భాండం అల్లాడింది. బ్రహ్మ తల్లడిలిపోయాడు. గగనచరులు కూలిపడ్డారు. దిక్పాలకులు సోలిపోయారు. సురసంఘం వాలిపోయింది. ఉరగులు చలించారు. మరుత్తులు తపించారు. ఆశ్వినులు దుఃఖమగ్నులయ్యారు. రుద్రులకు కాలు ఆడలేదు. కీలూడినట్లు సూర్యులు వ్రేలాడారు. దేవగణాలు భీతితో తమ చేతుల్లోని ధనువులను విడిచి మూర్ఛాక్రాంతులయ్యారు.

వృత్రుడు కావించిన కఠోరధ్వనికి, పిడుగుపాటుకు ప్రాణికోటి కూలి పడినట్లు దివిజరాజసైన్యాలు రణరంగంలో ఒడలు తెలియకుండా పడిపోయారు. అప్పుడాతడు తన పదాహతులకు భూమి గ్రక్కదలగా అటూనిటూ తిరుగుతూ, చేతితో నిశితశూలాన్ని త్రిప్పుతూ మదగజం కమలవనం జొచ్చి మట్టిమల్లాడు నట్లు ఆ సుర సైన్యాలను త్రొక్కి రూపుమాపడం మొదలుపెట్టాడు. అతనికది ఒక క్రీడగా ఉంది. మహేంద్రుడది చూశాడు. సహింపలేక భీషణమైన గదా దండం తీసికొని గిరగిర త్రిప్పుతూ వృత్రునిపై విసిరాడు అది ప్రళయసమయ మార్తాండుని పరివేషంలాగా గోచరిస్తూ ఆకాశాన మంటలను చిమ్ముతూ మహా వేగంతో తన పైకిరాగా రాక్షసేశ్వరుడు దాన్ని హేలగా ఎడమచేతితో పట్టుకొని దానితో ఐరావతం తలపై మోదాడు.

వృత్రాసురుడలా ఇంద్రాయుధంతోనే, ఇంద్రుని వాహనాన్ని కఠినంగా కొట్టేసరికి, అది వజ్రాహతికి శైలపర్వతం కూలినట్లు కూలిపడ్డది. దాని కుంభ స్థలం పగిలి రక్తం ధారలు కట్టింది. దాని మదం అణగిపోయింది. లేచి జిరజిర తిరిగి రణరంగం విడిచి పారిపోయింది.

సురగజం అలా భీతితో కంపించి పారిపోగా ఇంద్రుడు అంకుశంతో దాన్ని పట్టి నిలిపాడు. అమృతరసంతో ఆర్ద్రమైన తనచేతితో దాన్ని నిమిరాడు. అది కొంత సేదతేరింది. అపుడు వృత్రుడు కొలదిదూరంలో తన యెదుట నిలబడి ఉన్న సురేంద్రుని చూచి, తన తోబుట్టువైన విశ్వరూపుని ఆతడు (ఇంద్రుడు) నిష్కరుణంగా చంపిన వృత్తాంతం స్మృతివీధిలో మెలగగా, మోహ శోకాలతో వికటంగా నవ్వుతూ యుద్ధోద్రిక్తుడై ఇలా అన్నాడు-

సురేంద్రా. విశ్వరూపుడు నాకు అగ్రజుడు. నీకు గురువు. అతడు దీన జనరక్షకుడు. శుభదృష్టి కలవాడు. లోభవశుడవై పాపబుద్ధితో నీవు అతని వధించావు. నీ ఆ దుష్కృత్యాని లోకులు నవ్వారు. ఇపుడు నీవు నాచేజిక్కావు. నా భుజాపటిమకు లోనయ్యావు. నిన్ను సంహరించి ఈ శూలాగ్రానికి గ్రుచ్చి నేను నా భ్రాతృఋణం తీర్చుకుంటాను. ఎలాంటి దుష్టుడైనా తన బ్రతుకుకోసం నీలాగా గురువూ చుట్టమూ. పుణ్యాత్మకుడూ అయినవానిని పట్టి వధింపగ డా! నీవు పరమ్రాయుడవు. దయాసత్యాలను విడిచి, ధర్మంమాని, యశస్సును కాల దన్ని, పౌరుషానికి తిలోదకాలిచ్చి లోకనిందితుడైన వాని చావునకు ఆర్యు లెవ్వరూ చింతించరు. అతని శవాన్ని నక్కలూ, గ్రద్దలు, రాపులుగులు ముట్టి నైనా ముట్టవు.

నీ పాపం ఈనాటికి పండింది. నీవు నాచేజిక్కావు. నిన్ను వధించి నీ మృతకాయాన్ని ఈ నిశితశూలాగ్రానికి గ్రుచ్చి కుక్కలకు నక్కలకు నీ మాంసాన్ని ఎరగా చేస్తాను. ఈనాడు నీకిక్కడ దిక్కెవ్వరూలేరు. ఈ రణ యజ్ఞంలో నేను సోమయాజినై నిన్ను మేకగాజేసి నా వాడిశూలం యొక్క అగ్ని జ్వాలలో వ్రేల్చి పిశాచాలను తృప్తిపరుస్తాను. అలాకాక నీవే నీ వజ్రధారలతో నన్ను నిర్జిస్తే నేను పంచభూతాల్లో కలిసి మహాశూరులైన వారి పాదధూళిలో పాలు పంచుకొని ధన్యాత్ముడనవుతాను.

కనుక శక్రుడా! సందేహం దేనికి? వెంటనే వజ్రాయుధాన్ని ప్రయో గించు. అది వ్యర్థంకాదు శ్రీహరి తేజంచేతను, దధీచి వీర్యాతిశయం చేతను అది అమోఘమైనది. కనుక నీవా దివ్యాయుధాన్ని ప్రయోగించి నీ శత్రువుని వధించు. నీకు శ్రీహరి అనుగ్రహం పరిపూర్ణంగాఉంది. శ్రీహరి అనుగ్రహపాత్రుడైన వానికి జయశ్రీలు కరతలామలకాలు. శంకమాని [illegible] ప్రయోగించు. వరదుడూ, సర్వేశ్వరుడు అయిన శ్రీహరి పాదపద్మములందు నా మనస్సు పదిలం పరచుకొని నిశ్చలంగా నిశ్చింతగా [illegible]. నీ వజ్రధారలతో నా విషయ భోగాలు తెగిపోతాయి. అపుడు నేను శరీర త్యాగంచేసి భగవన్నిలయం చేరతాను. నేను నారాయణ దాసుడను. స్వర్గమర్త్య పాతాళలోకాల్లోని భోగాలతో నాకు



నిమిత్తంలేదు. ధర్మార్థకామాల ఆయాసలేని మహైశ్వర్యాన్ని భగవంతుడను గ్రగహిస్తాడు. భగవదనుగ్రహం సాటిలేనిది. అది అన్యులకు గోచరంకాదు. భగవంతుని పాదాలను ఆశ్రయించిన దాసులకు నేను దాసుడను— అని వృత్రుడు ఆ పరమేశ్వరు నుద్దేశించి యిలా అన్నాడు—

దేవా! భక్త పాలనములైన నీ గుణాలను నేను ఆత్మతో స్మరించాలని కాంక్షిస్తాను. వాక్కులతో నిన్ను నుతించాలని వాంఛిస్తాను. ఈ శరీరాన్ని నీ సేవలో వినియోగించాలని ఉవ్విళ్లూరుతాను. అంతేకాని దుర్లభమైన ధ్రువపదం గాని, బ్రహ్మలోకంగాని, ఇంద్రభోగంగాని నే నెన్నడూ కోరను. ఆకలిగొన్న లేగదూడలు, ఈకలురాని పక్షులు తల్లికోసం తహతహ లాడతాయి. విదేశగతుడైన భర్త కామాకుల మానసయైన జవరాలి కోసం తత్తఅపడతాడు. అలాగే కృష్ణా! నా మనస్సు నిన్ను చేరడానికే ఉబలాట పడుతుంది. తత్వజ్ఞానహీన్యులూ సంసారవిమోహులూ అయినవారితో గాక పుణ్యశ్లోకులైన వారితో నాకుసఖ్యాన్ని కల్పించు— అనీ వృత్రుడు సర్వాత్మకుడైన హరిపై మనసు నిలిపాడు. అతని శరీరంపొంగి పులకించింది. చావునూ జయాన్ని సమభావంతో చూస్తూ ఆనందించాడు. కాలాగ్నిలాగా జ్వలిస్తూ మహోద్రేకంతో భూమి చలింపగా దిక్కులదరగా రణోన్ముఖుడయ్యాడు.

మదోద్ధతుడై ప్రళయజలంలో హరిపై కైటభుడు కవిసినట్లు వృత్రుడు అహంకరించి సురనాథుని ఎదుర్కొని హలం విసిరాడు. అది ప్రళయాగ్నిలాగా మంటలు చిమ్ముతూ కోటి సూర్యులకాంతితో గగన మార్గానంగా మహేంద్రుడు వజ్రాయుధంతో నేర్పుగా దాన్ని త్రుంచివేశాడు. అపుడు దేవగణాలకు కలిగిన ఆనందానికి అవధులులేవు. ఇంద్రుడలా శూలాన్ని త్రుంచి వెంటనే వృత్రుని భుజం ఖండించాడు. వృత్రుడు క్రోధోద్ధతుడై ఒంటిచేతితోనే మహోగ్రమైనగుదియ నొకటి గ్రహించి ప్రళయసూర్యుని భీషణ పటివేషపోషకంగా త్రిప్పుతూ కుప్పించి ఐరావతం కుంభస్థలాన్ని ధ్వంసంచేశాడు. ఇంద్రుని చెక్కిలి పై భాగాన్ని నొప్పించాడు. ఆ పరిఘాహతికి ఏనుగు గిలగిలలాడి ఘీంకారంచేసింది. ఇంద్రుడు డస్సి వజ్రాయుధాన్ని నేలపై విడిచాడు. అసురుని పరాక్రమానికి లోకాలు గజిబిజితో బెగ్గడిల్లి పోయాయి.

గరుత్మంతుడు పట్టుకొన్న త్రాచులాగా వృత్రాసురునికి విక్రమానికి లోనై తిరుగుడు పడిన సురనాథుని దైన్యస్థితికి లోకాలన్నీ పురపురమని శోకించాయి. అపుడింద్రుడు ఐరావతం దుస్థితిని, తనదైన్యాన్ని, వజ్రాయుధం జారి పడడాన్ని, యుద్ధధర్మంలో నిష్ణాతుడైన శత్రువునుచూచి సిగ్గుతో తలవంచుకున్నాడు. యుద్ధరంగంలో శత్రువు చూస్తూండగా జారిక్రింద పడిన వజ్రా

యుద్ధాన్ని తిరిగి గ్రహించకుండా నివ్వెఱపాటుతో అలాగే నిలబడిపోయాడు. అపుడు వృత్రుడాతనితో ఇలా అన్నాడు—

ఓయీ! ఎందుకూ భీతి? యుద్ధంలో ఆయుధం లేనివానిని, శరణుచొచ్చిన వానిని వీరులు వధింపరు. వజ్రాయుధం తిరిగిచేపట్టు. అంచాకా నేను నీజోలికిరాను. ఇది విషాదానికి సమయంకాదు. వజ్రాయుధం తీసుకొని శత్రువును నిర్జించు. తత్వబుద్ధితో ఆలోచించిచూడు. దేహాధీనులైన వారికి మరణంగాని జయంకాని దైవేచ్ఛననుసరించి ప్రాప్తిస్తుంది. సర్వేశ్వరునికాదని ఎవరూ ఏమీ చెయ్యలేరు. అజ్ఞానవశంచేత జీవుడు స్వప్రతిభతో ఏదో సాధించాననుకుంటాడు. కాని లోక పాలకులుకూడా స్వతంత్రించి ఏమీచెయ్యలేరు. పరమ పురుషునకు వశంగతులై వలలో పడిన పక్షుల్లాగా చరిస్తారు. యంత్రగతమైన మృగంగాని దారు (కొయ్య) నిర్మితమైన నావగాని పురుషాధీనమై యుండునట్లు సమస్త భూతజాలం ఈశ్వరాధీనమై ఉంటుంది. కాని తెలియక జీవుడు తనను స్వతంత్రునిగా భావిస్తాడు.

పంచభూతాలచేత జీవోత్పత్తి కలుగుతుంది. ఆ జీవుల నుండి జీవులు జనిస్తాయి. ఆ జీవులే జీవులను తింటాయి. పురుషునకు ఆయువుగాని కీర్తిగాని ఐశ్వర్యంగాని ఎంతకాలం విధివిహితమై ఉంటుందో అంతకాలమే ఉంటాయి. ప్రాప్తం తీరినపిదప అవి ఉండవు. కనుక గుణాగుణాలు, కీర్త్యపకీర్తులు, జయాపజయాలు, సుఖదుఃఖాలు, చావు బతుకులు— సమములై కలుగుతూ ఉంటాయి. అజ్ఞానియై గుణబద్ధుడైన వానికి గుణమయములైన ఇంద్రియాదులే ఆత్మయనే భావన కలుగుతుంది. కనుక వాడు ఆ గుణాలచేత బద్ధుడౌతాడు. ఆ గుణాలకు సాక్షిమాత్రమైన శరీరం వేఱని తెలిసికొనినవాడు ఆ గుణాలచేత బద్ధుడుకాడు. అంచేత గుణాలు-గుణి, భోక్త-భోగ్యం, జయం-అపజయం, హన్త (చంపేవాడు)-హన్యం (చంపబడేది),— ఈ సమస్తం సృష్టి స్థితి లయ కారకుడైన ఆ పరమేశ్వరుడేకాని అన్యంకాదు. నా స్థితినేచూడు. ఒకచేయి, ఆయుధం పోయినా నేను నీ ప్రాణాన్ని హరించడానికి సమర్థుడనై ఉన్నాను. ఇంకోవిషయం చెపుతానువిను. ఈ యుద్ధం ఒక జూదం. ఇందులో రథ గజ తురగాదులు సారెలు. బాణాలు పాచికలు. ప్రాణాలు ఒడ్డనాలు (పందెములు). అలాంటప్పుడు జయమెవనికో అపజయమెవనికో ఎలా తెలుస్తుంది?

అని వృత్రుడనేసరికి ఇంద్రుడు ఆశ్చర్య చకితుడయ్యాడు. అతని యెడ తనకున్న కుత్సిత భావం పోయింది. అతన్ని దైవంగా భావించాడు. అతనికి కను విప్పుకలిగింది. క్రిందపడిన వజ్రాన్ని వెంటనే తీసుకున్నాడు. దేవతలు మహానందం చెందారు. కొండబిలంలాంటి రాహువు నోటినుండి వెల్వడి తన సహస్ర కిరణాలతో వెలిగెడి సూర్యుడులాగా ఇంద్రుడపుడు ఎంతో తేజోవంతుడుగా గోచ

రించాడు. అతని చేతిలోని వజ్రాయుధపు కాంతులు దిగంతాలకు వ్యాపించాయి. అతడు మందహాసం చేస్తూ వృత్రాసురునితో ఇలా అన్నాడు—

దానవేంద్రా! నీవు వేదాంత శాస్త్రపారీణుడవు. నీ మనస్సు తత్వజ్ఞాన కళాకలితం. ఆదిపూరుషుడైన శ్రీహరికి నీవు పరమ భక్తుడవు. లోకాలన్నింటను తాను నిండియుండి తనలో లోకాలన్నింటినీ నింపుకొని ప్రాణికోటికి భ్రాంతినికల్పిస్తూ అన్నియెడలనూ ఏవో ఆకర్షణాలను కల్పించెడి విష్ణుమాయను నీవు అనన్య చిత్తంతో గ్రహించావు. అయితే నీకు ఈ రాక్షసాకృతి ఏమిటి? ఈ భీకరాకారాన్ని విడిచి సుశ్లోకుడైన పురాణ పురుషుని మనోహరాకృతిని ధరించు. మహాత్మా! నీ వెంతటి నియమ నిష్ఠలుపాటించావో? ఎలాంటి మహాతపం ఆచరించావో? రజో గుణాభి రతుడవైన నీకు, శమదమాది గుణప్రపూర్ణుడై సత్పురుషుల మనో భావానుభూతి కలిగి పరమహంస స్వరూపుడైన రాక్షసాంతకుని యెడ అపార భక్తి ప్రపత్తి కలిగింది. నారాయణ స్వరూపమనెడి అమృత జలధిలో తేలియా డెడి భక్తుడు పందికుళ్లగించిన గుంటలోని నీటిని ఆశిస్తాడా?— అని ఇంద్రుడనగా వృత్రుడు ఏమీ సమాధానం చెప్పలేదు.

అతని మనస్సు రజోద్రేకంతో తుకతుకలాడిపోతోంది. ఇంద్రుని యుద్ధా నికి పురిగొల్పుతూ ఎడమచేతితో పరిఘను (ఇనుపగుదియ) తీసికొని గిరగిర త్రిప్పడం మొదలుపెట్టాడు. కుప్పించిపైకెగిరాడు. బ్రహ్మాండభాండం బ్రద్దలయ్యే లాగా గర్జించాడు. సమున్నతమైన మదగజం వృషభంపై గవిసినట్లు పిడుగు పాటుగా ఇంద్రునిపైపడి అతని వక్షస్థలాన్ని మోదాడు. ఇంద్రుడపుడు తన వజ్రపుటంచులతో ఆ పరిఘను త్రుంచి వెంటనే ఆదిశేషుని పడగలాగా మనోహ రంగా ఉన్న అతని వామ బాహువును కూడా ఖండించాడు. ఆ రీతిగా రెండు బాహువులూ తెగి రక్తధారలు స్రవిస్తూండగా వృత్రుడు వజ్రాహతికి ఱెక్కలుతెగి దివినుండి జారిపడుతున్న కులపర్వతంలాగా కనబడ్డాడు.

క్రోధోద్ధతుడైన అతని చూపులు ప్రళయకాలాగ్ని జ్వాలల్లాగా భయం కరంగా ఉన్నాయి. అతడు దుర్నిరీక్షుడుగా ఉన్నాను క్రింది దౌడతో భూ మండ లాన్ని మీది దౌడతో ఆకాశాన్నీ హత్తించి వికృతంగా నోరుతెరిచాడు. సముద్ర మథన సమయంలో మంధరనగానికి చుట్టిన సర్పరాజు వాసుకి విషభరితమైన నాల్కలాంటి భయంకరమైన నాల్కతో ఆకాశాన్ని నాకడం మొదలు పెట్టాడు. యమదండంలాంటి కోరలతో ముల్లోకాలను మ్రింగేవాడులాగా గోచరించాడు. శరీరాన్ని పెంచి పర్వతాలను కాలితో మీటుతూ నడకొండలాగా భూనభోభాగాలను ఆక్రమించాడు.

ప్రళయ కాలంనాటి మృత్యువులాగా నోటినుండి నిప్పుకణాలు రాలుస్తు న్నాడు. హఠాత్తుగా ఐరావతాన్నీ, ఆయుధాన్నీ, ఇంద్రునీ నాలుకతో చుట్టిపట్టి

ప్రమింగివేశాడు. దేవతలు కంపించి పోయారు. లోకాలన్నీ తల్లడిల్లిపోయాయి. చీకట్లు క్రమ్మాయి. నక్షత్రాలు రాలిపడ్డాయి. సూర్యుడు, చంద్రుడు, అగ్ని కాంతిని కోల్పోయారు. దిక్కులు సంక్షోభం చెందాయి.

అయినా మహేంద్రుడు శ్రీ విష్ణువును మనస్సులో ధ్యానిస్తూ నిశాచరుని గర్భంలో సురక్షితంగా ఉన్నాడు. ఏ మాత్రమూ కందలేదు. భయంతో క్రుంగ లేదు. చలించలేదు. ప్రాణం కోల్పోలేదు. పైగా నారాయణ కవచ స్వరూపుడైన భగవంతుని కృపచేతను, యోగబలంతోను విజృంభించి వజ్రాయుధంతో వృత్రుని ఉదరం ఛేదించి ఐరావత సహితంగా బయటపడ్డాడు. వెంటనే అతని శిరం ఛేదించ డానికి వజ్రాన్ని ప్రయోగించాడు. అది మహావేగంతో గిరగిర తిరుగుతూపోయి సూర్యాదిగ్రహ నక్షత్రాలకు దక్షిణోత్తరగతి రూపమైన సంవత్సర సంధిలో అహోరాత్రుల నడిమివేళ (సంధ్యాసమయం) వృత్రుని శిరస్సును ఛేదించేసరికి అది పర్వత శిఖరంలాగా కూలిపడ్డది. అపుడు దివ్యదుందుభులు మ్రోగాయి. గంధర్వులు, సురలు, సిద్ధులు, సాధ్యులు, మునులు, ఇంద్రతేజాన్నీ, వైభవాన్నీ ప్రకాశింపజేసే మంత్రాలు పఠిస్తూ పూలవాన కురిపించారు.

అపుడు ఆశ్చర్యకరంగా వృత్రునిశరీరం నుండి ఒక దివ్యతేజం వెల్వడి లోకాలన్నీ చూస్తుండ శ్రీ మహావిష్ణువునందు లీనమైంది. ఇలా లోకభీకరుడైన వృత్రుడు కూలేసరికి అఖిలలోకాలూ, భయముడిగి స్థిమితపడ్డాయి. అపుడు దేవ ర్షులు, పితృగణాలు, దానవులతోగూడి ఇంద్రునకు చెప్పకుండా తమ తమస్థానా లకు తిరిగివెళ్లారు–" అని శుకుడు చెప్పేసరికి పరీక్షిన్నరేంద్రుడు విస్మితుడై– "మునీంద్రా! దేవతలు ఇంద్రునితో చెప్పకుండా ఎందుకు వెళ్లినట్లు? అలా చేయ డంవల్ల వారికి కలిగిన సుఖంగాని ప్రయోజనం గాని ఏమిటి? ఇంతకూ ఇంద్రుడు చేసిన అపచారమేమిటి? అతనికి వచ్చిన చేటు ఎట్టిది?— వివరంగా చెప్పు? వినాలని కుతూహలంగా ఉంది–" అన్నాడు. అపుడు శుకుడు ఇలా చెప్పడం మొదలు పెట్టాడు—

"వృత్రాసురుని పరాక్రమం చూచి చకితులైన దేవతలు, ఋషులు అతన్ని వధించుమని ఇంద్రుని వేడగా అతడు (ఇంద్రుడు) మళ్లో బ్రహ్మ హత్యాపాత కానికి వెఱచి- పూర్వం విశ్వరూపుని చంపిన పాపం స్త్రీలయందు, భూమియందు, నీటియందు, చెట్లయందు విభజించి ఎలాగో పోగొట్టుకున్నాను. ఇపుడు తిరిగి ఆ విశ్వరూపుని అనుజుడైన వృత్రునిజంపి ఆ పాతకాన్ని ఎలా పోగొట్టుకో గలను. ఈపని నా వలన కాదు- అన్నాడు.

అపుడు మహర్షులిలా అన్నారు— సురేంద్రా! నీవు విచారించకు. నీ చేత అశ్వమేధ యాగం చేయిస్తాం. యజ్ఞపురుషుడైన శ్రీ మన్నారాయణుడు సంతు

ష్టుడై ఈ హత్యా పాతకాన్ని నివారిస్తాడు. బ్రాహ్మణులను, గోవులను, తల్లి దండ్రులను, సాధువులను హత్య చేసినవారు కూడా ఆ దేవదేవుని కీర్తిస్తేచాలు. ఆతడు సహజంగా కరుణించి వారికి పాపవిముక్తి కల్పిస్తాడు. అలాంటప్పుడు నీవు శ్రద్ధతో అశ్వమేథ యజ్ఞంచేసి ఆ దేవ దేవుని సేవిస్తే దుష్టుడైన వృత్రుని వధించిన పాపం నిన్ను ఏంచేస్తుంది?— అనేసరికి ఇంద్రుడలాగేనని రాక్షసే శ్వరుడైన వృత్రుని వధించాడు. వెంటనే బ్రహ్మహత్యా పాతకం అతన్ని చుట్టు ముట్టింది.

చండాల స్త్రీ రూపం ధరించి అది అతని వెంటబడ్డది. ముసలి తనంతో దాని శరీరావయవాలు కదలుతూన్నాయి. క్షయ రోగంతోను, కుష్ఠ రోగంతోను వికృతంగాఉంది. నెత్తురు కక్కుతోంది. దాని తల నెరసిపోయింది. దాని దుర్గంధానికి ప్రేవులు అదరిపోతున్నాయి. ఇంద్రుడెక్కడకు వెళ్లితే అక్కడకు అతన్ని తఱుముతూ— ఆగు. ఆగు. నన్ను భోగింపకుండా నీవు ఎలావెళ్లగలవు?— అని అదలిస్తోంది. మహేంద్రుడు వెనుతిరిగి ఆ చండాలినిని చూచాడు. భయ పడ్డాడు. సిగ్గుతో పారిపోవడం మొదలు పెట్టాడు.

బ్రహ్మహత్య అలా వికృతరూపంతో వెంటబడగా ఇంద్రుడు భూమ్యా కాశాలు అంతటా తిరిగాడు. దశదిశలకు పరుగులు పెట్టాడు. కాని అతనికి ఎక్కడా నిలువ నీడ దొరకలేదు. నిట్టూర్చి ఈశాన్య దిక్కుగా పోయి ఆ దిక్కునగల మానసరోవరంలో ప్రవేశించాడు. ఒక కమల నాళంలో దూరి రూప హీనుడై భోగదూరుడై దానిలోని తంతువులతో కలిసి బ్రహ్మహత్యనుండి విముక్తి ఎప్పుడు కలుగుతుందా? అని చింతిస్తూ అక్కడ వేయిసంవత్సరా లున్నాడు. ఈశాన్య దిక్కు పరమేశ్వర దిగ్భాగం కావడంచేత ఆ చండాలి అక్క డకుపోలేక నిలబడిపోయింది.

అంతకాలమూ నహుషుడు తన విద్యాబలంతోను, తపోబలంతోను, యోగ బలంతోను స్వర్గాధిపత్యం వహించాడు. కాని ఐశ్వర్యమదంతో కనుగ్రమ్మి యింద్రుడు తిరిగి వచ్చేదాకా ఇంద్రపత్ని శచీదేవిని తనకు పత్నిగా ఉండమని అడిగాడు. ఆమె బృహస్పతి ప్రేరేపణతో బ్రహ్మర్షులు వాహకులుగా శిబిక నెక్కి వస్తే అలాగే చేస్తానన్నది. అతడుమూర్ఖుడు అలాగేనని బ్రహ్మర్షులు పల్లకీపట్టగా సగర్వంగా దానిలో కూర్చుండి బయలుదేరాడు. కాని మార్గమధ్యంలో అగస్త్య మహర్షి ఆగ్రహించి శపించే సరికి అతడు సర్పయోనిలో భూమి మీద జన్మించాడు.

అనంతరం మహేంద్రుడు బ్రహ్మర్షులచే ఆహూతుడై తిరిగి స్వర్గ రాజ్యాధిపత్యం వహించాడు. అంతకాలం అతడు మానస సరస్సులో నారాయణ్ణి

చరణారవింద ధ్యానమగ్నుడై ఉండడంచేతను, ఆ దిశానాథుడైన శంకరుని అను గ్రహ విశేషంచేతను బ్రహ్మహత్యాదోషం క్రమంగా తఱిగి అతన్ని పీడించ లేదు. ఇంద్రుడలా నిజసంపదలను పొంది బ్రహ్మర్షులను పూజించి అశ్వమేథ యాగం చెయ్యడానికి దీక్షపట్టాడు. బ్రహ్మవాదులైన మరీచి మొదలగు మునులు హయమేథాన్ని యథావిధిగా చేయించారు. సర్వదేవతామయుడైన నారాయణుడు సంతుష్టుడయ్యాడు. సూర్యుని వేడిమికి మంచు విడిసినట్లు వృత్రవధ జనిత దోషం తొలగిపోయింది. దివిజులు, యక్షులు, సిద్ధులు, గంధర్వులు, మహర్షులు సన్నుతించగా ఇంద్రుడు త్రిలోకసంపదలతో తులదూగుతూ జగదీశ్వరుని మనస్సులో ధ్యానిస్తూ నిశ్చింతగా ఉన్నాడు.

రాజేంద్రా! చూచావా శ్రీమన్నారాయణుడు ఎంతటి అప్రమేయ ప్రతిభా సంపన్నుడో! అతడు 'జనన మరణ చక్రరూపకమైన సంసార సముద్రాన్ని శోషింపజెయ్యడానికి అగస్త్యునివంటివాడు. పాపాటవులను దహింపచెయ్యడానికి అగ్నివంటివాడు. పాపాలనే కాఱుచీకట్లను పారద్రోలడానికి చంద్రునివంటి వాడు. ఆ శ్రీహరి నామసంకీర్తనం. మోక్షసామ్రాజ్య భోగభాగ్యాలను సుల భంగా చేకూరుస్తుంది.

ఈ ఇతిహాసం సమస్త దుఃఖాలను హరిస్తూంది. అఖిలార్థాలను సమకూర్చి ఆహ్లాదింపచేస్తూంది. భక్త్యావేశాన్ని కల్పిస్తూంది. భక్తజన సంకీర్తనంతో నిండి నది. ఇది దేవతల హర్షానికీ విజయానికీ హేతుభూతమైనది. వృత్రునిచే మింగబడిన ఇంద్రుని విముక్తిక్రమాన్ని తెలుపుతుంది. బ్రహ్మహత్యాదిక పాపాలను తరింపజేస్తూంది. ఇది సజ్జనా కాంక్షితమైన కమనీయకథ. దీన్ని అనుదినం భక్తితో విన్నా, చదివినా, వ్రాసినా ఆయువు, ఆరోగ్యం, విజయం, భోగభాగ్యాలూ లభిస్తాయి. కర్మబంధం తెగిపోతుంది. సద్గతి హస్తామలక మౌతుంది——" అనిన శుకుని చూచి పరీక్షిన్నరేంద్రుడిలా అన్నాడు—

"మునీంద్రా! నీవు చెప్పిన వృత్రాసుర వృత్తాంతం విన్నాక ఆశ్చర్యంతో నా మనస్సు కళవళపడుతోంది. వానిలో రజస్తమోగుణాలేకాని సత్వగుణం లేశ మాత్రంకూడా లేదు. అలాంటివానికి శ్రీహరి చరణభక్తి ఎలా కలిగిందీ? సత్వ గుణ స్వభావులూ, సమబుద్ధులూ, నిర్మలాత్మకులూ, తపోనిధులూ, ధర్మ పరులూ అయిన మహానుభావులకుకూడా కైవల్య కారణమైన శ్రీహరిభక్తి అంత సులభంగా కలుగదే! లోకకంటకుడైన వృత్రునకు ఎలా కలిగిందో ఆశ్చర్యం కాదూ! ఈ భూతలంమీదగల రేణువులకంటె జీవకోటిసంఖ్య అధికం. ఆ జీవుల్లో ధర్మబుద్ధితో వర్తించెడివారు మానవులు. వారు అల్పసంఖ్యాకులు. వారిలో అర్థకామాలనే కాని మోక్షాన్ని కోరేవారు అరిది. అదృష్టవశాత్తు ముముక్షువులు

కొందఱున్నా వారిలో రాగాదులనుండి ముక్తులైనవారు కొద్దిమంది మాత్రమే ఉంటారు. అలా ముక్తులైన వారిలోకూడా శాంతిపరుడూ, జ్ఞాననిరతుడూ, నిశ్చలభక్తితత్పరుడూ నూటికి కోటికి ఒకడుంటాడు.

అలాంటప్పుడు రజస్తమోగుణాభిహతుడై, లోకాలకు సంతాపం కలిగించడమే లక్ష్యంగాగల దుష్టుడు వృత్రాసురుడు జ్ఞానరతుడెలా అయ్యాడూ? పౌరుషం చేత అతడు మహేంద్రుని ఎలా మెప్పించాడూ? నాకు వివరంగా చెప్పు. వినాలని నామనస్సు ఉవ్విళ్లూరుతోంది–" అని పరీక్షిన్నరేంద్రుడు అడిగేసరికి శుకమహర్షి నిమీలితాక్షుడై శ్రీహరిని స్మరించి యిలా చెప్పడం మొదలుపెట్టాడు.

## చిత్రకేతూ పాఖ్యానం

"రాజేంద్రా! విను! ఎన్నడో నాకు వ్యాసమహర్షీ, నారదుడూ, దేవలుడూ చెప్పిన ఇతిహాసం ఒకటిఉంది. వారివలన నేను విన్నరీతిలో నీకు ఆ ఇతిహాసాన్ని చెపుతాను. శ్రద్ధాళుడవై వినూ. పూర్వం చిత్రకేతువను సార్వభౌముడొకడున్నాడు. అతడు శూరసేనదేశాధీశ్వరుడు. గుణవంతుడు. కీర్తికాముడు. ప్రజాహితంకరుడు. ఐశ్వర్యంలో మహేంద్రసమానుడు. అతనికి భూమి సకల కామాలను పిండి యిస్తూంది. అతనికి ఒక కోటిమంది భార్యలున్నారు. నిండుపరువంలో ఆ నెలతలందఱు మన్మథుని సమ్మోహన మంత్రాధిదేవతల్లాగా, ఆతని విజయసాధనాలైన ఖడ్గలతల్లాగా, వాడిబాణాల్లాగా, తురంగుల్లాగా, బందకత్తెల్లాగా అందాలు చిందిస్తూ ఆ నరేంద్రుని ఆనందాబ్ధిలో ఓలలాడిస్తూ ఉంటారు. అయినా వంశాంకురమైన సంతతి ఒకడుకూడ లేకపోవడంచేత శోకంతో అతడు వేసవి మడువులాగా శుష్కించిపోతున్నాడు. ఆతని ప్రతాపంకాని, కీర్తిగాని, రాజ్యవైభవంకాని, మహేంద్రభోగంకాని, మదనాస్త్రాల్లాంటి మదవతులైన మగువలుకాని, సంతానం లేని ఆతని దుఃఖాన్ని మాన్పలేకుండా ఉన్నాయి.

ఇలా ఉండగా ఒకనాడు అతని మందిరానికి అంగిరసుడను మహర్షి వచ్చాడు. రాజేంద్రుడు సభక్తికంగా ఆ మహర్షికి అతిథిసత్కారాలు చేశాడు. మహర్షి సంప్రీతుడై ఆతని కుశలం అడిగి 'రాజేంద్రా! రాజ్యం నీ అధీనంలోనే ఉంచికదా! శత్రుభీతి యేమీలేదుకదా! భూమి, నీరు, తేజస్సు, వాయువు, ఆకాశం, మహత్తూ, అహంకారం అను ఏడుతత్వాలతో రక్షితుడైన జీవుడులాగా నీవు అమాత్యులు, సుహృత్తులు, జనపదాలు, దుర్గం, దండం, కోశం, బలం అను సప్తప్రకృతులచేత రక్షింపబడి మంత్రివర్గంపై భారం ఉంచి రాజభోగాలను భవిస్తున్నావుకదా! నీ భార్యలు, పౌరులు, సచివులు, భృత్యులు, జానపదులు, సామంతభూపాలురు వశవర్తులై నీ మాటదాటకుండా ఉంటారుకదా! ఇంతటి

వైభవం కలిగి సార్వభౌముడవైయుండి నీవేదో దీనంగా ఉన్నావు. ఎందుకూ?- అని ప్రశ్నించగా చిత్రకేతుడు బద్ధాంజలియై— మునిచంద్రా! తపోబలంచేత మీకు తెలియరానిది ఏముంటుందీ? అని తలవంచి మౌనంగా నిలబడ్డాడు.

భగవంతుడైన అంగిరసుడు దయాళువు. యోగదృష్టితో క్ష్మాధవుని మనోవేదనకు హేతువు గ్రహించాడు. వెంటనే అతనిచేత పుత్రకామేష్టి చేయించి యజ్ఞశేషాన్ని అతని అగ్రమహిషియైన కృతద్యుతికి ఇచ్చి- రాజేంద్రా! నీకు పుత్రుడు కలుగుతాడు. అతనివలన నీకు సుఖం దుఃఖంకూడా కలుగుతుంది- అని వెళ్ళిపోయాడు.

యజ్ఞావశేషం భుజించి కృతద్యుతి గర్భం ధరించింది. నవమాసాలు నిండాక కొడుకును కన్నది. రాజు, అమాత్యులు, పౌరులు, భృత్యులు, పరమానందం చెందారు. చిత్రకేతుడు వెంటనే స్నానంచేసి సకల భూషణభూషితుడై పుత్రునకు జాతకర్మ చేయించాడు. బ్రాహ్మణులకు బంగారం, వెండి, వస్త్రాలు, ఆభరణాలు, గ్రామాలు, ఏనుగులు, గుఱ్ఱాలు, గోవులు ఆజేసి అర్బుదాల ద్రవ్యం దానంగా ఇచ్చాడు. ఇతరులకు, ప్రాణికోటికి మేఘుడులాగా, కోరిన కోర్కెలను వర్షించి సంతుష్టాంతరంగుడై ఉన్నాడు.

పుత్రవ్యామోహంతో అతడు కృతద్యుతియందు బద్ధానురాగుడై ఉండడం చూచి తక్కిన భార్యలు సహించలేకపోయారు. సంతానం లేకపోగా వారు పతిప్రేమకు దూరం కావడం వారికి కోపకారణమైంది. కృతద్యుతి యెడల వారికి ఈర్ష్యాసూయలు జనించాయి. ఆమెపై రాజునకు అనురాగం ప్రవృద్ధం కావడానికి కారణం పుత్రవ్యామోహమేకదా! అని భావించి దయాశూన్యలై, ఆ కుమారునకు ఒకరాత్రివేళ విషం పెట్టారు. అతడు వెంటనే కన్నుమూశాడు. తెలతెల్లవారిన తర్వాత దాది పిల్లవానిని లేపడానికి వెళ్ళి అతని వికృతాకారం చూచి అదలిపోయి భయం, విస్మయం, శోకం ముప్పిరికొనగా కేకపెట్టి నేలపై బడ్డది.

అలా నిట్టనిలువునా నేలపై కుప్పకూలిన దాది రోదనధ్వని విని పట్టమహిషి గుండె అవిసిపోయింది. వెంటనే ఆ బిడ్డ ఉన్న మందిరానికి వెళ్ళింది. వర్ధిష్ణువూ, వంశకర్తా, తపస్వి వరప్రభావంచేత జనించినవాడూ అయిన బాలకుడు విగతజీవుడై పడిఉండడంచూచి ఆమె తల్లడిల్లిపోయింది.

కాటుకతో పంకిలమైన కన్నీరు ఏకధారగా స్రవిస్తూ కుంకుమాగరంజితాలైన ఆమె కుచకుంభాలను తడిపివేస్తోంది. కాంచన కంకణాలు దాల్చిన కరపల్లవాలతో వక్షస్థలాన్ని మోదుకుంటూ కోకిల కంఠంతో ఆమె శోకించడం మొదలు పెట్టింది. ఆ ఆర్తనాదం విని నరేంద్రుడు కంపించిపోయాడు. వెంటనే అచటికి వెళ్ళి పట్టరాని వ్యామోహంతో ఆ బాలుని మృతకాయంమీద వ్రాలి- తండ్రీ!

నీ మరణవార్త పిడుగుపాటుగా నన్నెందుకు దగ్ధం చెయ్యలేదు? అంతటి ఘోర వార్తకు ఈ మాత్రపు దుఃఖమా? ఇక నాగతి ఏమవుతుందో? నీ తల్లి కడుపు కోత ఎలా తీరుతుందో?- అని క్రిందా పైనా తెలియకుండా అమాత్య బంధు పరివారంతోగూడి కంటికి మంటికి ఏకధారగా కన్నీరు కారుస్తూ శోక సంతప్తుడై యున్న రాజుకడకు అంగిరసుడు నారదునితో కలసివచ్చాడు. మృతిచెందిన బాలుని పాదాల దగ్గిఱ మృతుడుగాగా పడిఉన్న ఆ నరేంద్రునిచూచి అంగిరస్మ మహర్షి ఇలా అన్నాడు—

రాజా! నీకు వీడెవడు? నీవు ఎవనికోసం శోకిస్తూన్నావు? పుత్రమిత్రాదులు పూర్వజన్మంలో ఎవరివారో ఎఱుగగలరా? నదీవేగంచే ఇసుక రేణువులు అక్కడక్కడా తిన్నెలుగా ఏర్పడి తిరిగీ చెదరిపోతాయి. అలాగే కాలగతిచేత జీవకోటికి పుటుకా, చావూ కలుగుతూ ఉంటాయి. విష్ణు మాయవలన జీవులు మమతతో జీవులను ఉద్పాదింపజేస్తాయి. దీనికి దుఃఖించడం దేనికి? తూలిసోలి పోవడం ఎందుకూ? భూతసృష్టి రహస్యాన్ని తెలిసికోవద్దూ? ప్రస్తుతం కంటి కగపడుతూన్న నీ శరీరంగాని నా శరీరంగాని ఇతర చరాచరజీవుల దేహాలుగాని శాశ్వతాలుకావు. ఇవి ఈ జన్మకు పూర్వంలేవు. మరణానంతరం ఉండవు. అలాంటప్పుడు ఈ దేహంకోసం దీనంగా పరితపించడం అవివేకం. జీవునకు దేహసంబంధం కలగడాన్ని పుటుకఅనీ, ఆ సంబంధం విడిపోవడాన్ని మరణమనీ అంటారు. ఇందులో అసహజమైనదేముందీ? కనుక చావుపుటుకలు నిక్కువంకాదు. అవి ఈశ్వరుని సంకల్పాధీనాలు.

ఈశ్వరుడు తన మాయా ప్రభావంచేత జీవులనుండి జీవాంతరాలను సృజిస్తాడు. వాటిని ఆ జీవాలతోనే పోషిస్తాడు. అలాగే సంహరిస్తాడు. ఇది అతనికి లీలావినోదం. దేహియైన పితృదేహంచేత దేహియైన పుత్రదేహం మాతృదేహం వలన ఉత్పన్నమవుతుంది. కనుక చావుపుటకలు ఇలా నిరంతరం జరుగుతూనే ఉంటాయి. వాటికి శోకించడంగాని ఆనందించడంగాని అవివేకం. ఆత్మజ్ఞానం లేకపోవడం వలన ఇలాంటి అనర్థాలు సంభవిస్తాయి. స్వప్నంలో జీవుడేదో భయంకరమైన దృశ్యంచూచి అది తనకు సంబంధించినదని భ్రాంతిపడతాడు. కాని మేల్కొన్న వెంటనే దానికీ తనకూ సంబంధం లేదని గ్రహిస్తాడు. ఈ దేహాత్మ భ్రమ అనాదిసిద్ధం. కనుక రాజా మోహం విడిచి వాసుదేవుని యందు మనస్సు నిల్పి నిర్మలాత్మకుడవుకమ్ము— అని అంగిరసుడు హితోపదేశం చేసే సరికి చిత్రకేతుడు లేచి వారికి ఇలా అన్నాడు—

మహాత్ములారా! మిమ్మల్ని నేను గుర్తించలేదు. యతివేషంతో ఇలా నిగూఢంగా ఇక్కడకు వచ్చారు. మీ రెవ్వరు? మా లాంటి జ్ఞానహీనులకు జ్ఞానోప

దేశం చెయ్యడానికి పుణ్యాత్ములెందరో సంచారం చేస్తూంటారు. సనత్కుమారుడు, నారదుడు, ఋభుడు, అంగిరుడు, దేవలుడు, అసితుడు, వ్యాసుడు, వశిష్ఠుడు, దూర్వాసుడు, మార్కండేయుడు, గౌతముడు, శుకుడు, పరశురాముడు, కపిలుడు, యాజ్ఞవల్క్యుడు, వరణి, ఆరుణి, చ్యవనుడు, రోమశుడు, ఆసురి, జాతుకర్ణి, దత్తాత్రేయుడు, మైత్రేయుడు, భరద్వాజుడు, బోధ్యుడు, పంచశిఖుడు, పరాశరాది మునులు అలాంటి మహానుభావులు. వారిలో మీ రెవ్వరు?

అలాకాక మీరు సురలా? చారణులా? గంధర్వులా? లేక సిద్ధులా? ఇంతటి మహాజ్ఞానం ఎవరికుంటుంది? అజ్ఞానవశంచేత పశుప్రాయంగా శోకపరీతుడనైన నాకు దివ్యజ్ఞానం కలిగించారు. అనుగ్రహించి ముందు మీ రెవ్వరో చెప్పండి— అని చిత్రకేతుడు అర్థించేసరికి అంగిరసుడిలా అన్నాడు—

రాజా! పుత్రకాంక్షివైన నీకు పుత్రుణ్ణి ప్రసాదించిన అంగిరసుడను నేను. ఇతడు బ్రహ్మపుత్రుడైన నారదమహర్షి. దుస్తరమైన పుత్రశోకంతో మునిగియున్న నీకు జ్ఞానోపదేశం చెయ్యడానికి వచ్చాం. అపుడు నీ దుఃఖం చూచి నీకు పుత్రుణ్ణిఇస్తే లోకంలో పుత్రవంతులనుభవించే సంతాపం నీవున్నూ అనుభవించక తప్పదు. సతులు, గృహాలు, సంపదలు, విషయసుఖాలు, రాజ్యవైభవంఅన్నీ చంచలములు. రాజ్యం, భూమి, జలం, ధనం, భృత్యులు, అమాత్యులు, సుహృత్తులు, శోకమోహభయాదులను కల్పించి వ్యథపెట్టేవారేకాని సుఖపెట్టరు. గంధర్వ మాయాకల్పితమైన నగరంలాగా స్వప్నగతమైన వృత్తాంతంలాగా సంపదలు వాస్తవికాలుకావు. దేహం ద్రవ్యజ్ఞాన క్రియాత్మకమై దేహికి నానావిధ క్లేశసంతాపాలను కలిగిస్తూంది. కనుక నిర్మలమైన మనస్సుతో ఆత్మగతి కౌలిసికో. ద్వైతభ్రాంతి విడిచిపెట్టు. ధ్రువపదంపొందు— అని అంగిరసుడన్నాక నారదుడు ఇలా చెప్పడం మొదలుపెట్టాడు.

రాజేంద్రా. నీకు ఉపనిషద్గోప్యమైన మంత్రం ఉపదేశిస్తాను. నీవు ఏడు రాత్రులు ఆ మంత్రాన్ని పఠిస్తే నీకు భగవత్సాక్షాత్కారం లభిస్తుంది. దేవతలంతా ఎవని పాదమూలం ఆశ్రయించి సకలార్థ సిద్ధి పొందుతారో ఆ శ్రీమన్నారాయణుని సేవించి మోహంవిడిచి ఉత్తమ పదంపొందు. నీకు నీ ఈ కుమారునితో ఏం ప్రయోజనం ఉందోచూడు— అని నారదుడు ఆ బాలుని కళేబరంచూచి, జీవాత్మనుద్దేశించి— ఓయీ! నీకు శుభం కలుగుగాక! నీవు దుర్మరణంతో శరీర త్యాగంచేశావు కాని ఆయువుచెల్లికాదు. కనుక శోకమగ్నులయిన నీ తల్లిదండ్రులను, బంధువులనుచూచి ఈ కళేబరంతో తిరిగి ప్రవేశించి ఆయుశ్శేషం అనుభవించు. నీ తండ్రి రాజ్యాధిపత్యాన్ని వహించు- అనే సరికి ఆ బాలుడిలా అన్నాడు.

తాపసేంద్రా! నేను కర్మవశంచేత నానా యోనుల్లో జన్మిస్తూ ఉంటాను. ఆ యా జన్మల్లో నా తల్లిదండ్రులను పురస్కరించుకొని బాంధవులెందరో ఉంటారు. అనేక జన్మల్లో అనేకులతో సంబంధంకల నాకు ఈ చిత్రకేతు కృత ద్యుతులు ఏ జన్మంలో తల్లి దండ్రులయ్యారోచెప్పు. ఒక్కొక జన్మలో జీవికి పరస్పర సంబంధంచేత బంధువులు, జ్ఞాతులు, దారసుదుతాలు, శత్రువులు, ఆత్మీయులు, మధ్యస్థులు ఏర్పడతారు. మరిజన్మలో వారుండరు. అలాంటప్పుడు ప్రాణికి ఒకవావి నిత్యమని ఎట్లాచెప్పడం? అంగడి యందలి రత్నకాంచనాలు ఎన్నోచేతులు మారుతాయి. అలాగే జీవుడు కూడా నిలకడ లేకుండా తిరుగుతూ ఉంటాడు. జీవునకు వాస్తవంగా దేహాత్మాభిమానం ఉండదు. కాని కర్మవశంచేత దేహగతుడయ్యాక ఆ దేహాన్ని విడిచిపెట్టకుండా ఉన్నంతవరకు పిత్రాదులను తన వారినిగా భావిస్తాడు. కాని ఆ శరీరాన్ని త్యజించాక వారిని ఆత్మీయులుగా భావించడు.

శ్రీమన్నారాయణుడొక్కడే నిత్యుడు. అనంతుడు. జనన మరణశూన్యుడు. సర్వాశ్రయుడు. సర్వంలో తానుంటాడు. సర్వం తనలో ఉంటుంది. అతడు సూక్ష్మమై స్థూలమై స్వయంజ్యోతియై వెలుగొందుతూ ఉంటాడు. సమస్తం చూస్తుంటాడు. సమస్తాన్నీ తన యందు లీనం చేసుకుంటాడు. ఆత్మమాయాగుణం చేత ఆత్మమయంగా విశ్వాన్ని సృజిస్తాడు. సర్వజీవనుడు. విశ్వాత్మకుడు. అతనికి గుణదోషాలుండవు.

కనుక జీవునకు పతులెవ్వరు ? సతులెవ్వరు ? సుతులెవ్వరు ? మాతాపితలెవ్వరు ? బాంధవులెవ్వరు ? మిత్రులెవ్వరు? శత్రులెవ్వరు ? సర్వాంతర్యామియైన పరమేశ్వరుని రూపుడనైన నాకూ వీరికీ ఎక్కడి సంబంధం? నా కోసం వారు దుఃఖించడం అవివేకం- అని పలికి ఆ జీవుడు నిర్గమించేసరికి చిత్రకేతుప్రు, బాంధవజనం విస్మయావిష్టులై శోకం, మోహం విడిచిపెట్టారు. ఆ బాలునకు యమునానదిలో ఉత్తర క్రియలు నిర్వర్తించారు.

అనంతరం చిత్రకేతుడు గాఢమైన పంకం (బురద) నుండి బయటపడ్డ ఏనుగులాగా సంసారమనెడి అంధకూపం నుండి బయటపడి యమునానదిలో స్నానంచేసి మౌనంగా నారదునకు నమస్కరించాడు. నారదర్షి ప్రసన్నుడై విధి చోదితంగా అతనికి భగవన్మంత్రం ఇలా ఉపదేశించాడు -

* "పరమాత్మా! వాసుదేవం, ప్రద్యుమ్నం, అనిరుద్ధం, సంకర్షణం— అను నీ నాలుగు వ్యూహాలతో వర్తించెడి నీకు నా నమస్కారం. నీవు విజ్ఞాన

---

* నారదుడు చిత్రకేతునకు ఉపదేశించిన ఈ మంత్రోపనిషద్విద్య ఏ కారణం చేతనో పోతన భాగవతంలో అనువదింపబడలేదు.

స్వరూపుడవు. నిరతిశయమైన స్వాత్మానంద స్వరూపుడవు. రాగ ద్వేషాది రహితుడవు. ఇంద్రియాలకు, ఇంద్రియాధిష్ఠాన దేవతలకు నీవు నియంతవు. నీ శక్తులు అనంతాలు. విస్మయజనకాలు, రూపగుణాలచే నీవు సర్వాధికుడవు. నీకు నా కైమోడ్పు. వేదాలకు కూడా నీ రూపం అగోచరం. అలాంటప్పుడు అపరిచ్ఛిన్నమైన నీ రూపాన్ని తెలిసికొనడానికి ఎవనికి సాధ్యమౌతుంది?

నీవు జ్ఞానైకాకారుడు. నిర్గుణుడవు. నిరధికుడవు. చేతనా చేతనాలకు విలక్షణుడవు. అలాంటి నీవు నిరంతరం మమ్మల్ని రక్షింతువుగాక. మట్టినుండి ఘటాదులు కల్పింపబడినట్లు నీ సూక్ష్మశరీరం నుంచి నీ స్థూలశరీరమైన ఈ జగత్తంతా రచింపబడ్డది. నీ వలన సృష్టింపబడిన ఈ విశ్వం నీలోనే ఉంటుంది. నీలోనే లీనమౌతుంది. ఈ విధంగా లోకాన్ని సృజించి, పెంచి, హరింపగల సమర్థుడవైన నీకు నా ప్రణామం.

జగత్తునకు లోపలా వెలుపలా అంతటా వ్యాపించి ఉన్నా మనస్సుగాని బుద్ధిగాని ఇంద్రియాలుగాని నిన్ను తెలిసికోలేవు. అగ్నిసంబంధంవలన లోహాలకు దాహకశక్తి కలిగి సమస్తాన్ని దహించివేస్తాయి. కాని ఆ దాహకశక్తి లేనప్పుడవి దేనినీ దహింపజేయలేవు. అలాగా దేహం, ఇంద్రియాదులు నీ అనుగ్రహంచేత జ్ఞానక్రియాశక్తులు కలిగినపుడు కర్మప్రవృత్తాలౌతాయి. లేనప్పుడు ఏ పనీ చెయ్యలేవు. కాని జీవుడు మాత్రం సహజంగా జ్ఞానశక్తి కలవాడు గనుక నిన్ను సాక్షాత్కరింప చేసికోగలడు. నీవు మహాపురుషుడవు. మహానుభావుడవు. షడ్గుణైశ్వర్య సంపన్నుడవు. నీ భక్తకోటి నిరంతరం నీ పాదకమలాలను ఉపలాలిస్తు ఉంటారు. అలాంటి పరంధాముడవైన నీకు నా ప్రాంజలి."

చిత్రకేతుడు నిరాహారుడై, సమాధినిష్ఠుడై నారదోపదిష్టమైన ఈ మంత్రోపనిషద్విద్యను ఏడు రాత్రులు ఆరాధించాడు. ఏడవరాత్రి గడిచాక నారాయణాను గ్రహంచేత అతనికి అప్రతిహతమైన విద్యాధరాధిపత్యం లభించింది. ఆ విద్యాప్రభావంచేత కామగమనశక్తి కూడా ప్రాప్తింపడంచేత, అతడు రత్నమయమైన దివ్య విమానం అధిరోహించి స్వేచ్ఛగా తిరుగుతూండగా ఒకనాడు శ్రీమన్నారాయణునకు పాదపీఠమైన ఆదిశేషుని దర్శనభాగ్యం లభించింది.

ఆపన్నగేంద్రుని శరీరము తెల్లతామరలాగా చందనంలాగా స్వచ్ఛంగా ఉంది. అతని వేయి శిరస్సులపై మణిమయకిరీటాల కాంతులు మిరుమిట్లుగొల్పుతున్నాయి. అతడు కంకణకేయూరాలు ధరించాడు. అతడు కట్టుకొన్న నీలాంబరంపై బంగారు మొలనూలు కాంతులు చిమ్ముతోంది. మెడలో యజ్ఞోపవీతం తళతళలాడుతోంది. ముఖం తామరపువ్వులా ప్రసన్నంగా ఉంది. నేత్రాలు విశాలంగా ఉన్నాయి. సిద్ధగణాలు అతణ్ణి పరివేష్టించి భక్తితో సేవిస్తూన్నారు ఆ అనంతుని

దర్శనమాత్రంచేతనే చిత్రకేతుని కల్మషాలన్నీ తొలగిపోయాయి. మనస్సు నిర్మలమైంది. ఒడలు పులకరించింది. ఆనందబాష్పాలు రాలుస్తూ అతడా దేవునకు అంజలి ఘటించాడు.

పట్టరాని సంతోషంతో అతని నోటివెంట మాటరాలేదు. కొంతసేపటికి మనస్సు కుదుటబడ్డది. అన్యాయత్తాలు కాకుండా యింద్రియాలను నిగ్రహించాడు. మనోవాక్కులను కుదురుపరచుకొని లోకగురువూ, సాత్వతశాస్త్రోక్తమైన ఆకృతికలవాడూ అయిన అనంతుని యీలా సన్నుతిచెయ్యడం మొదలుపెట్టాడు.

దేవా! నీవు అజేయుడవు. అయినా నిష్కాములైన భక్తులకు నీవు సులభుడవు. సృష్టి స్థితి లయాలూ, మోక్షం, నీ విభూతులేకాని వేఱుకావు. సృష్టికర్తయైన బ్రహ్మ, లయకారకుడైన శివుడూ నీ యంశాంశాలేకాని వారికి స్వయం శక్తిలేదు. నీ గుణసముద్రంయొక్క పారం తెలియక మేమే సృష్టిసంహార కర్తలమని, ఘనులమని, అహంకరిస్తారు. పరమాణువు మొదలు పరమపదం వఱకూ సమస్తమూ నీవే. నీవు వేదవేద్యుడవు. నీవు దేశకాల వస్తువులచే పరిచ్ఛిన్నుడవు కావు. నీవు సర్వకాలాల్లో, సకల వస్తువుల్లో, సకలలోకాల్లో ఉంటావు. ఆదిమధ్యాంతరహితుడవు. శాశ్వతుడవు.

భూమి, జలం, అగ్ని, వాయువు, ఆకాశం, అహంకారం, మహత్త్వం- ఈ యేడూ పరిమాణంలో ఒకదానికంటె నొకటి పదిరెట్లు అధికం. ఈ యేడింటిచే ఆవృతమైనది అండకోశం. కోటి సంఖ్యాకములైన అలాంటి అండాలు నీ యందు అణుసమాలై ఉంటాయి. పశుప్రాయులై మానవులు ఒక్కొక్కచోట పరతత్వమైన నిన్ను విడిచి ఐశ్వర్యకాంక్షతో ఇతర దైవతాలను ఆరాధిస్తారు. ఆ యితర దైవతాలే శాశ్వతం కాదే! ఇక వారిచ్చే సంపదలు శాశ్వతాలా? రాజులిచ్చే సంపదలు ఆ రాజకులం నశించగానే అంతమౌతాయి. విషయవాసనలకు చిక్కిన వారైనా నిన్ను సేవిస్తే వేచిన విత్తనాల్లాగా దేహాంతరోత్పత్తి పొందరు.

గుణరహితుడవూ, జ్ఞానవిజ్ఞాన స్వరూపుడవూ అయిన నిన్ను అజ్ఞులు గుణసంయుతునిగా భావిస్తారు. అయితే నిన్ను ఏభ్భావంతో సేవించినా మోక్షం ప్రాప్తిస్తూంది. నీచే నిర్ణీతమైన భాగవతధర్మాన్ని అనుసరించి సనత్కుమారాదులు సర్వోత్కృష్టుడవైన నిన్ను సేవిస్తారు. భాగవతధర్మం జ్ఞానదాయకం. ఇతర ధర్మాలు కామ్యాలు. వాటియందు విషమబుద్ధిచే అహంకార మమకారాలు పెరిగి అధర్మనిరతుడై తుదకు నాశం చెందుతాడు.

స్థావరజంగమాత్మకమైన సమస్తభూతకోటియందూ సమమైన భాగవత ధర్మాన్ని అనుసరించే వానికి నీ సందర్శనం వలన పాపక్షయం కావడంలో విచిత్రమేముందీ? ఇపుడు నీ చరణాంబుజ దర్శనంచేత నా మనఃకాలుష్యం

హరింపజేసింది. పూర్వం నారద మహర్షి అనుగ్రహించి మూఢుడనైన నాకు నీ ధర్మాన్ని బోధించాడు. ఆ ధర్మం వరప్రదాతవైన నీమూలాన దృష్టమైంది. అల్పాల్పమైన మిణుగురుల కాంతి సూర్యకాంతిని ఏమాత్రమూ ఇనుమడింప జేయ లేదు. అలాగే జగదాత్మకుడవైన నీ మహత్యం అలతులమైన మావంటివారి సన్నుతుల వలన ప్రసిద్ధంకాదు. ఉత్పత్తి స్థితి లయకారుడవైన దేవా! నీకు నా నమస్కారం. బ్రహ్మాదులుకూడ భక్తియుక్తులై నిన్ను మనస్సులో ధ్యానిస్తారు. ఈ భూమండలం నీతలమీద ఆవగింజల్లా గోచరిస్తుంది. అటువంటి సహస్రశీర్షుడవైన నీకు నా ప్రణామం— అని సన్నుతించిన విద్యాధర భర్తయగు చిత్రకేతునకు అనంతుడిలా అన్నాడు-

నారదుడు, అంగిరసుడు నీకు చేసిన తత్వబోధవల్లనే నీవు నన్ను చూడ గలిగావు. నాయందు నీకు భక్తి విశ్వాసాలు కలిగాయి. నేను భూత భావనుడను. సమస్తభూతజాలం నాస్వరూపమే. కనుక భూతకోటికీ నాకూ అభేదం స్పష్టం. శబ్దాత్మకమైన బ్రహ్మం, శబ్దానికి వాచ్యమైన అర్థాత్మకమగు బ్రహ్మం ఈ రెండూ నాకు శాశ్వత తనువులు. అఖిలలోకాలూ నన్ను అనుసరించి ఉంటాయి. శరీరానికి ధారకుడు జీవుడు. ఆ జీవునకు పరమాత్మ స్వరూపుడనైన నేను ధారకుడను. అందుచేత ఉభయమూ నాయందు అనుగతమై ఉంటుంది. నేను ఆ ఉభయమందు లీనమై ఉంటాను.

నిద్రించేవాడు విశ్వమంతా తిరిగి ఏవేవో చూచినట్లు అనుభూతి చెందుతాడు. కాని మేల్కొంచిన తర్వాత తానెక్కడికీ పోలేదన్నీ ఒకచోటనే ఉన్నానని గ్రహిస్తాడు. అలాగే జీవుడు ఈశ్వరమాయను విడిచాక కాని పరమధర్మాన్ని తెలుసుకోలేడు. నిద్రావస్థలో దేహి (జీవుడు) ఏరూపంతో ఆత్మేంద్రియ సుఖాన్ని అనుభవిస్తాడో ఆ రూపాన్నే నన్నుగా గ్రహించు. జీవునకు అవస్థ కల్పించెడి వాడను నేనే.

దుర్లభమైన మానుషజన్మం ధరించి ఆత్మతత్త్వం తెలిసికోలేక పోవడం అవిచారమూలకం. అలాంటివాని జీవితం దుఃఖమయం. వానికి సుఖం లేశ మాత్రంకూడా ఉండదు. కనుక పురుషుడు దుఃఖహేతువులైన ప్రవృత్తిధర్మాల నుండి మరలి సుఖకారణాలైన నివృత్తి ధర్మాలను ఆచరిస్తే స్థిరమైన మోక్షసుఖం ప్రాప్తిస్తుంది. గార్హస్థ్యజీవితం అవలంబించి సంసారలంపటంలో పడినవానికి మోక్షం ఎలాకలుగుతుందీ? సకల దుఃఖాలకు మూలం కర్మజాలం. ఆ కర్మ బంధంతో చిక్కుకొని దేహి నన్ను స్మరించడు. జాగరణం, స్వప్నం, సుషుప్తి— అను ఈ మూడవస్థలను అతిక్రమించి నాల్గవదియైన ఆత్మస్వరూపాన్ని తెలిసికొని

వివేకబలంతో విషయసుఖాలయందు విరక్తిచెందిన విజ్ఞానాభిమానియైనవాడు నాకు భక్తుడవుతాడు. అతిసూక్ష్మమైన ఇలాంటి జ్ఞానాన్ని గడించినవాడు యోగనైపుణ బుద్ధి గలవాడై స్వార్థమైన ఆత్మచేత పరమాత్మను తెలిసికొంటాడు. నీవు ఈ క్రమంలో నాయందు భక్తిశ్రద్ధలతో విజ్ఞాన సంపన్నాలైన వాక్కులతో నన్ను స్తుతించి ముక్తుడవయ్యావు— అని శేషభగవానుడు విద్యాధరపతియైన చిత్రకేతునకు తెలిపి అంతర్హితుడయ్యాడు.

ఏదిక్కున సర్వాత్మకుడైన అనంతుడూ అంతర్ధానం చెందాడో ఆ దిక్కునకు విద్యాధరపతి నమస్కరించి నారాయణదత్తమైన విమానం అధిరోహించి గగనచరుడై యోగులు, మునులు, సిద్ధులు, చారణులు, గంధర్వులు సన్నుతిస్తూండగా కులపర్వత సానువులందును సంకల్పసిద్ధప్రదేశాల్లోను, మనోజ్ఞాలైన అన్యప్రదేశాల్లోనూ, అడ్డులేకుండా అనేకలక్షల దివ్యసంవత్సరాలు విహరించాడు. అహోరాత్రాలు అతడు తన మనస్సును కృష్ణాయత్తంచేసి నోరారా గోవింద నామ సంకీర్తనం చేస్తాడు. కిన్నరాంగనలతోను, యక్షకాంతలతోను శ్రీహరి లీలలను ఆడిస్తాడు. ఆ దేవదేవుని గీతాలను పాడిస్తాడు. అలా శ్రీహరి లీలావినోదాలను చూస్తూ వింటూ పరవశించిపోతాడు.

నిరంతరం ఆత్మలో వైష్ణవజ్ఞానాన్ని గూర్చి చింతిస్తాడు. భాగవతులను అర్చిస్తాడు. పుండరీకాక్షుని భూషిస్తాడు. హరికథలు భాషిస్తాడు. మురవైరి నామాన్ని, గుణసమూహాన్ని, ఘోషిస్తాడు. పరతత్వబోధను పోషిస్తాడు. శ్రీకృష్ణ సేవకులను సేవిస్తాడు. శ్రీహరిని పూజిస్తాడు. వైకుంఠవాసుని రూపగుణాలను, లీలావిలాసాలను అభివర్ణించెడి గీతప్రబంధాలను కృష్ణప్రీతిగా పాడి, పాడిస్తూ వినోదిస్తాడు.

## చిత్రకేతుని గౌరి శపించడం

చిత్రకేతువు ఆ రీతిగా శ్రీహరిని కీర్తిస్తూ, ధ్యానిస్తూ పరమానందంతో లోకాలన్నీ తిరుగుతూ తిరుగుతూ హిమగిరి ప్రాంతానికి వెళ్ళాడు. అక్కడ హర నివాస స్థానమైన కైలాసాన్ని చూచాడు అది అచట మంచులాగా అమృతం లాగా స్వచ్ఛంగా ఉంది.

ఆ వెండికొండమీద బ్రహ్మేంద్రాదిదేవతలు సేవిస్తూండగా పార్వతితో గూడి నిండుకొలువున్న మహేశ్వరునిచూచి విద్యాధరభర్త విస్మయావిష్టుడయ్యాడు. ఆ కొలువు అంతా కోలాహలంగా ఉంది. అనంతమైన భగవత్స్వరూపాన్ని గురించి చర్చించెడి ప్రసంగఘోషతోను, ఈశ్వరుని కృపావలోకనాలను కాంక్షిస్తూ బ్రహ్మేంద్రాదులు సనకసనందాదులు చేసెడి స్తోత్రరవంతోను, హర

సల్లాపాలను కీర్తిస్తూ ఆనందంలో ఓలలాడెడి ప్రమథగణాల ఆర్భాటంతోను, డమరుమృదంగాది ధమధమధ్వనులతో భృంగిచేసెడి నాట్యనిర్ఘోషంతోను, వింజామరలు వీచెడి మాతృకలు కంకణనిక్వణాంతోను, ఆ కొలువు మారోగ్మోగుతోంది.

బ్రహ్మాదిసురల సమక్షంలో తన అంకపీఠి నధివసించిన గౌరిని కౌగిటబట్టి అలాపేరోలగమున్న పరమేశ్వరుని చూచి చిత్రకేతుడు పకపకనవ్వి ఆ దేవి వింటూండగా ఇలా అన్నాడు- ఈశ్వరుడు లోకగురువు. ధర్మస్వరూపుడు. మహావిరాగి. అలాంటివాడు సాటిలేని తపోధనులగు యోగులు, బ్రహ్మాదులు తనను సేవిస్తూండగా నిండుకొలువుంది ప్రాకృతుడుగాగా భార్యను ఒడిలో కూర్చుండబెట్టుకొని అనురాగాతిశయంతో లాలిస్తాడా? ఎంతటి సిగ్గుచేటూ? ఎంతటి ప్రకృతి పురుషుడైనా తాను ఏకాంతంలో సతులతో వినోదించువచ్చుగాని భ్రాంతిపరుడై ఇలా నిండుసభల్లో వారితోగూడి చరించడం తగదు.

అని విద్యాధర భర్త చిత్రకేతుడు నిందించేసరికి సర్వేశ్వరుడు మాఱు పల్కక నవ్వి ఊరకున్నాడు. సభాస్తారులకూడా ఏమీ అనలేదు. పరీక్షిన్నరేంద్రా! మహేశ్వరుని మనోనిగ్రహం ధైర్యం ఎలాంటిదో చూచావా? తన పూర్వ కర్మవిశేషంచేత తాను జితేంద్రియుడననెడి అహంకారంతో జగద్గురువైన భర్గుని అలా ప్రల్లదాలాడిన చిత్రకేతుని చూచి భవాని సరోషంగా ఇలా అన్నది-

ఎవ్వడీతడు? ఒకవేళ మేము లజ్జలేని దుర్మతులమైనా మమ్మల్ని శాసించడానికి ఇతడు లోకపాలకుడైన ధర్మరాజా? వేదవిదులూ, యోగనిర్ణయ నిపుణులూ అయిన భృగువు, నారదుడు, కపిలుడు మొదలగు మహానుభావులుకూడా త్రిగుణాతీతుడైన మహేశ్వరుని ఎన్నడూ పరిహసించరే? వారికి ధర్మాధర్మాలు తెలియవా? ఇంద్రాదిదేవతలు ఎవని పాదపద్మాలపై తలవాల్చి మొక్కుతారో, ఎవనితత్వం బ్రహ్మాదియోగీంద్రుల మనస్సులను ఆనందజలధిలో ఓలలాడిస్తూందో, ఇదమిత్థమని యెవనిరూపాన్ని నిర్ణయించలేక శ్రుతులు వాదోపవాదాలు చేస్తాయో, ఎవని కారుణ్యవిశేషంచేత లోకాలన్నీ ధన్యత చెందుతాయో, అలాంటి సర్వేశుడూ, పాపహరుడూ, ధీరుడూ శాశ్వతైశ్వర్యుడూ ఆత్మభవుడూ అయిన ఈశ్వరుని నిందించిన పాపాత్ముడు దండనార్హుడుకాక ఎలా తప్పించుకోగలడు? శ్రీహరి పాదపద్మార్చనం సకలలోకాలకు ఆశ్రయం. సుఖాపాదకం. సకల శుభప్రదం. సాధుసేవ్యం. అలాంటి హరిచరణసంసేవనానికి దుష్టుడైన ఈతడు అర్హుడుకాడు -అని ఆ దేవి ఆతణ్ణి చురచురచూస్తూ- ఓరీ. నీ యీపాప కృత్యఫలితంగా పాపస్వరూపమైన రాక్షసయోనిలో జన్మించు- అని శపించి ఇక నుండి మహాత్ములను అవమానించకు- అని హెచ్చరించింది. పార్వతి శాపవాక్యం విని చిత్రకేతువు విమానం దిగివచ్చి ఆ దేవికి దండప్రణామంచేసి ముకుళిత హస్తుడై యిలా అన్నాడు—

జగజ్జననీ! నీ శాపవాక్యాలను శిరసా వహిస్తున్నాను. పురాకృత కర్మములచే సంప్రాప్తమైన సంసార చక్రంచేత అజ్ఞానమోహితులైన ప్రాణులకు సుఖదుఃఖాలు నైజములు. పరతంత్రులైన జీవులు సుఖదుఃఖాలకు కర్తలుకారు. సత్త్వాది గుణముల ప్రవాహరూపమైన ప్రకృతితో శాపానుగ్రహాలు. స్వర్గ నరకాలు. సుఖదుఃఖాలు సమాలు. వాటిలో తారతమ్యం ఏమీలేదు. భగవంతు డొక్కడే తన మాయచేత లోకాలను సృజిస్తాడు. వారివారికి బద్ధాను రాగాలను కలుగజేస్తాడు. కాని తాను మాత్రం వాటికి లోనుగాక నిర్లిప్తంగా ఉంటాడు. ఇలా పుడుతూన్న నరునకు పత్నియెవరు? బంధువులెవ్వరు? శత్రువు లెవ్వరు? మిత్రులెవ్వరు? తటస్థులెవ్వరు? వారి వారి కర్మవశం చేతనే పరమేశ్వరుడిలాంటి రాగాను బంధాలను కల్పిస్తాడు.

పరమేశ్వరుడు సర్వసముడు. అతడు సుఖదుఃఖాలకు అతీతుడు. అతనికి రాగం గాని రాగానుబంధమైన రోషంగాని లేదు. అతని మాయా గుణవిశేషంచేత జీవులకు సుఖదుఃఖాలు, బంధమోక్షాలు కలుగుతూ ఉంటాయి. కనుక దేవీ! నీకు నా నమస్కారం. నన్ను అనుగ్రహించు. నీ శాపభయం నాకులేదు. కాని జగన్మాత వైన నిన్ను దూషించినందుకు పరితపిస్తున్నాను— అని దండ ప్రణామాలుచేసి పార్వతీ పరమేశ్వరులను ప్రసన్నులనుగా చేసికొన్నాడు. అనంతరం తన విమానం ఎక్కి యథేచ్ఛగా వెళ్లిపోయాడు. అపుడు పరమేశ్వరుడు చతుర్ముఖుడు, దేవర్షులు, దైత్యులు, దానవులు, ప్రమథగణాలు వింటూండగా పార్వతికి ఇలా అన్నాడు—

దేవీ! నారాయణ భక్తుల నిస్పృహభావం ఎలాంటిదో నీకు ఇప్పుడు అవగతమైనదికదా! శ్రీహరి తుల్యులై నిస్పృహులైన భాగవతులకు స్వర్గం, మోక్షం, నరకం అన్నీ ఒకటే. వారికి ఆ భేదభావాలు ఉండవు. దేహసంబంధం వల్లను, శ్రీహరి మాయా గుణంచేతను జ్ఞానదూరులైన ప్రాణులకు ద్వంద్వాది సుఖదుఃఖాల విభేదం గోచరిస్తుంది. ఇలాంటి వ్యత్యాసం భగవంతుడైన వాసుదేవుని భక్తులకు ఉండదు. నేనూ, కుమార నారదులూ, బ్రహ్మేంద్రాది దేవ గణాలూ, యోగులూ, మునులూ— అందరం శ్రీహరిచే సృజింపబడినవారమే. అయినా ఆ శ్రీహరితత్త్వం మాకు తెలియదు. అతనికి ప్రియుడని, అప్రియుడని ఎవ్వడూ ఉండడు. దృశ్యమానమైన సమస్తమూ అతడే. అతడు భూతాంత రాత్మ. ఆది పురుషుడైన అతడొక్కడే భూతప్రియుడు. చిత్రకేతుడు శాంతుడు. సర్వసముడు, విష్ణుభక్తుడు. అతడేమిటి? నేనుకూడా శ్రీహరి ప్రియుడనే. కావున భగవద్భక్తుల భావానికి విస్మయం చెందనవసరంలేదు. వారు ధీవైభవోపేతులు శాంతచిత్తులు, పరతత్త్వవిదులు—

అని మహేశ్వరుడరేపటికి పార్వతి విస్మయంమాని శాంతించింది. వాస్త వంగా పరమ భాగవతోత్తముడైన చిత్రకేతుడు ఆ దేవికి ప్రతిశాపం ఇవ్వగల సమర్థుడే. అయినా ఆతడు శపించకుండా శాంతరూపంతో ఆమె శాపాన్ని తల దాల్చాడు. ఇలాంటి సాధు లక్షణాలు నారాయణ పరాయణులైన వారికి గాక ఇతరులకు కలుగుతాయా? శాపహతుడైన చిత్రకేతుడు త్వష్టచేస్తూన్న యజ్ఞంలో దక్షిణాగ్నియందు రాక్షసయోనిలో జన్మించి వృత్రాసురుడని విఖ్యాతుడై భగ వద్ జ్ఞానపరిణతుడయ్యాడు. రాజేంద్రా! వృత్రునకు రాక్షసాకారం కలిగిన యీ పూర్వగాథను, చిత్రకేతుని మహామహిమను, భక్తితో చదివినా, విన్నా సకల దుష్కర్మలు నశిస్తాయి. కోరిన కోర్కెలు సిద్ధిస్తాయి. సకల వైభవాలు ప్రాప్తిస్తాయి. నిర్మలాత్ములు, నిత్యసత్య జ్ఞాననిరతులు అవుతారు. బంధుమిత్ర పుత్ర పౌత్రాదులతోగూడి అధికఫలం అనుభవిస్తారు.

## సవితృ వంశక్రమం

రాజేంద్రా! త్వష్టయొక్క వంశగాథ విన్నావుకదా! ఇక సవితృ వంశ క్రమం చెపుతాను. విను. సవిత, పృశ్ని, సావిత్రి, వ్యాహృతి అనుభార్యలందు అగ్నిహోత్రాలను, పశుయాగాభిమాని దేవతను, సోముని, పంచ యజ్ఞాలను కన్నాడు భగునకు సిద్ధికయన్ను నామె యందు మహిమానుడు, ప్రభువు, విభువు అను కొడుకులూ, ఆశిష అనుకూతురూ పుట్టారు. ఆశిష సౌందర్యవతి. నియమ నిష్ఠాగరిష్ఠ. పుణ్యశీల, సుగుణశాలవాల. అఖిలలోకాలూ ఆమెను పూజిస్తాయి.

ధాతకు కుహూ, సినీవాలి, రాక, అనుమతి అను నల్వురు భార్యలున్నారు. అతనికి కుహూ వలన సాయం అనునాతడు, సినీవాలివలన దర్శాఖ్యుడు, రాకవలన ప్రాతరాఖ్యుడు, అనుమతివలన పూర్ణిమాఖ్యుడు పుట్టారు. విధాతకు క్రియయను సతియందు అగ్నిపురీషాదులు జన్మించారు. వరుణునకు చర్షణియను భార్యయందు పూర్వకాలంలో బ్రహ్మపుత్రుడైన భృగువు, వల్మీక సంభవుడైన వాల్మీకి తిరిగి జన్మించారు. ఈ యిద్దఱు వరుణుని అసాధారణ పుత్రులు. అలాగే మిత్రునకు రేవతియందు, ఊర్ధ్వరేతస్కులైన అరిష్ట పిప్పలులను అసాధారణ పుత్రులు జనించారు. మిత్రావరుణులకు ఊర్వశి సాన్నిధ్యంలో కామోద్రేకంచేత రేతస్ఖలనం అయింది. దాన్ని వారు కుంభంలో ప్రవేశింపచేయగా ఆ రేతస్సునుండి అగస్త్యుడు, వశిష్ఠుడు పుట్టారు. వీరిద్దఱు మిత్రా వరుణులకు సాధారణపుత్రులు.

ఇంద్రునకు పౌలోమియందు జయంతుడు, ఋషభుడు, విదుషుడు— అను ముగ్గురు కొడుకులు పుట్టారు. వామనుడైన ఉరుక్రమునకు కీర్తియను భార్య

యందు బృహచ్ఛ్లోకుడను వాడు జన్మించాడు. వానికి సౌభగాదులు ఉద్భవించారు.. రాజేంద్రా! మహానుభావుడైన కశ్యప ప్రజాపతికి అదితియందు శ్రీమన్నారాయణు డవతరించిన వృత్తాంతం తర్వాత చెపుతాను. ఇపుడు దితిసుతులైన దైతేయుల చరిత్ర చెపుతాను. విను.

దైతేయ వంశంలో ప్రహ్లాదుడు, బలిచక్రవర్తి పరమభాగవతులు. వారు దైత్యదానవులకు పూజనీయులై అమిత విఖ్యాతి గడించారు. మహాబలాఢ్యులైన హిరణ్యాక్ష హిరణ్యకశిపులు దితికొడుకులు. వారిలో హిరణ్యకశిపుడు జంభాసురుని పుత్రికయైన కయాధువును వరించి ఆమె వలన ప్రహ్లాదుడు, అనుహ్లాదుడు, సంహ్లాదుడు, హ్లాదుడు అనుకొడుకులను, సింహికయను నొక కూతురిని కన్నాడు. సింహిక విప్రచిత్తిని పెండ్లాడి రాహువును కన్నది. ఆ రాహువు అమృతపానం చేస్తూండగా హరి తన చక్రంతో ఆతని శిరస్సును ఖండించాడు. సంహ్లాదునకు గతి యను పత్నియందు పంచజ్జనుడను వాడు ఉదయించాడు. హ్లాదునకు దమని యను భార్యయందు వాతాపి, ఇల్వలుడు అను వారు జన్మించారు. అగస్త్యుడు వారిని భక్షించివేశాడు. అనుహ్లాదునకు సూర్మ్యయను భార్యయందు బాష్కలుడు, మహిషుడు కలిగారు.

ప్రహ్లాదునకు దేవియను పత్నియందు విరోచనుడుపుట్టాడు. ఆ విరోచనుని కొడుకు బలి. బలికి అశనయన సుదతియందు నూర్గురు కొడుకులు పుట్టారు. వారిలో బాణాసురుడు జ్యేష్ఠుడు, ఆ బలి ప్రభావం తర్వాత చెపుతాను. బాణుని చరిత్రవిను. అతడు పరమేశ్వరు నారాధించి ప్రమథగణాల్లో ముఖ్యుడయ్యాడు. దితికి మరుత్తులను నలుబది తొమ్మిది మంది కొడుకులున్నారు. వారికి సంతతిలేదు. వారు ఇంద్రునితోగూడి దేవత్వం పొందారు—" అనగా విని పరీక్షిన్నరేంద్రుడు శుక యోగీంద్రుని ఉద్దేశించి "మహర్షీ! ఏ కారణంచేత మరుత్తులు ఇంద్రునకు ఆప్తులై అతనితో సమంగా వర్తించారో! వినాలని కుతూహలంగా ఉంది—" అని అడగ్గా శుకుడు ఇలా చెప్పడం మొదలుపెట్టాడు.

"రాజేంద్రా! విను. ఇంద్రుడు దుర్వృత్తితో దితి గర్భంలో ప్రవేశించి గర్భస్థశిశువులను ఖండించడం మొదలుపెట్టేసరికి ఆమె కోపంతో శోకంతో తల్లడిల్లిపోయింది. ఆమెకు అంతులేని మనస్తాపం కలిగింది. "ఇతడు భ్రాతృహంతకుడు. మహాపాతకుడు. వీణ్ణి చంపకపోతే నాకు మనశ్శాంతి ఉండదు. కనుక వీనిని భస్మంచేయగల కుమారుని కనేదాకా నేను నిద్రించను" అని తన భర్త కశ్యపుని దగ్గఱకు వెళ్ళింది. భక్తితో మధురోక్తులతో, హావభావవిలాసాలతో, నతులతో, నుతులతో, రతులతో అనురాగం చిందించే కడగంటి చూపులతో, చిఱునవ్వులతో ఆ మహర్షి మనస్సు చూరగొన్నది. కశ్యపుడంతటి

జితేంద్రియుడుకూడా దితి శృంగారపరత చేష్టలకు చలించిపోయాడు. ఎంతటి వాడైనా ప్రియకాంతకు వశంగతుడు కాకుండా ఉంటాడా?

మనోహ్లాదానికి ఏ వెలువూలేక స్తంభించి నిలిచిన ప్రాణికోటిని జూచి విధాత జాలిచెంది వారికి మనఃప్రీతి కల్గించడానికి యువతీజనాన్ని సృజించాడు. అలాంటప్పుడు పురుషులు వారిముందు తలొగ్గకుండా ఉండగలరా? దితి అలా అనేకవిధాల ఉపలాలించేసరికి కశ్యప ప్రజాపతి సంప్రీతుడై ఆమెతో అన్నాడు. "తన్వీ! నీకు ప్రసన్నుడయ్యాను. నీకు కావలసిన వరం ఇస్తాను. అడుగు. భర్త ప్రసన్నుడైతే స్త్రీలకు మనోరథం సిద్ధించడంతో కొఱత యేముంటుంది? సతికి పతియే దైవం. సర్వభూతాంతర్యామియైన వాసుదేవుడే భర్త. వేర్వేరు నామరూపాలతో కల్పింపబడిన పురుషులూ దేవతలూ భర్తృరూపధరుడైన భగవంతుని సేవిస్తూంటారు. విశేషించి స్త్రీలు పతిభావనతో ఆ దేవుని యజిస్తారు.

కనుక పతివ్రతలైన పడతులు స్వీయశ్రేయస్సుకోసం అనన్య చిత్తంతో ఆత్మేశ్వరుడైన ఆ పరమేశ్వరుని భర్తృభావంతో సేవించడం అవసరం. ఈ భావంతోనే నేనుకూడా నీకు వరప్రదాతనయ్యాను. దుశ్చరిత్రలైన వనితలకు పొందరాని వరం నీకిస్తాను. అడుగు- అని కశ్యపుడనేసరికి దితి— దేవా! నీవు నాకు వరప్రదాతవే అయితే మహాబలాఢ్యుడూ, తేజస్వీ, అమరుడూ ఇంద్రహంతా అయిన కొడుకును అనుగ్రహించు— అని అర్థించింది దితి.

కశ్యపుడు ఆశ్చర్యచకితుడయ్యాడు. చలించిపోయాడు. "హా! ఈ కఠినాత్మురాలు ఉన్నట్టుండి నన్నెంతటి దుష్టమైన వరం కోరింది?— అని తల్లడిల్లి పోయాడు. కళ్లు అశ్రుకలితాలయ్యాయి. ఇలా వాపోయాడు— కర్మపాశంచేత బద్ధుడనై నేను కూడని పనిచేశాను. వికటమైన సతీస్వరూపంతో మాయ నన్ను లోగొన్నది. నేను వెఱ్ఱివాడనయ్యాను. ఎంతటి జితేంద్రియుడనైతే మాత్రం ఏం ప్రయోజనం? మనస్థైర్యం కోల్పోయి పాతకానికి ఒడిగట్టాను. చపలాత్ముడనని దైవం నన్ను నవ్వదే? ఎంతటి మహోద్రధిమకలవారికైనా సతుల చిత్తవృత్తిని తెలిసికొనడం సులభం కాదు.

మాటలు ఖండశర్కరకంటె తియ్యగా ఉంటాయి. ముఖం విరిసిన తామర పూవును తిరస్కరిస్తుంది. చేష్టలు చంద్రకళల్లాగా గిలిగింతలు పెడతాయి. జాణతనం నిలువెల్ల కరగించివేస్తుంది. మధుకోపలతో తమకం పుట్టిస్తూంది. అలా మురిపించి మరపించి కాలసర్పంలాగా పురుషుని కాటువేస్తూంది. నేనేకాదు అఖిల లోకాల్లో ఎవ్వరూ స్త్రీలమనోగతిని తెలిసికోలేరు. కావాలని పతులు సతులకెంత కూర్చినా వారు ఆత్మలాభం కోసం పతులను, సుతులను, హితులను స్వయంగా గాని, పరులచేతగాని మట్టుపెట్టగలరు, నేను ఈమెకు ఏమని సమాధానం చెప్పను?

నా వచనం అమోఘం. త్రిలోకపాలకుడైన యింద్రుడు వధార్హుడా? అయినా ఇప్పటికి తగినట్లు ఒకటి కల్పించి చెపుతాను— అని దితి నుద్దేశించి కశ్యపుడిలా అన్నాడు.

తన్వీ! నీవు కోరినట్లు నీకు దేవబాంధవుడూ ఇంద్రహంతా అయిన కొడుకు కలుగుతాడు. కాని నీవు ఒక సంవత్సరకాలం పుంసవనం అనెడి వ్రతాన్ని ఆచరించాలి. ఆ వ్రతనియమాలు చెపుతాను విను ఎవరినీ హింసించరాదు. బిగ్గరగా మాటలాడరాదు. కోపం పనికిరాదు. అనృతం పలుకరాదు. గోళ్ళు, వెంట్రుకలు త్రుంచరాదు. ఎముకలు, పుర్రెలు మొదలైన అమంగళ వస్తువులు తాకరాదు. నదీనదాల్లోను, తటాకాల్లోను, స్నానం చెయ్యాలిగాని నూతి నీటితోగాని, కుండలతో తెచ్చిన నీటితోగాని స్నానం చెయ్యరాదు. దుష్టులతో సంభాషించరాదు. కట్టివిడిచిన చీరా, ముడిచిన పూవులూ తిరిగీ ధరించరాదు. ఉచ్ఛిష్టాన్నం, కాళికి నివేదింపబడిన అన్నం, కుక్కలు, పిల్లులు, క్రిమికీటకాలు ముట్టుకొనిన అన్నం, మాంసాన్నం, గొర్రెలు తెచ్చిన అన్నం- అనెడి ఈ అయిదు విధాలైన అన్నం నిషిద్ధం. ఇవి తినరాదు. దోసిటితో నీళ్ల త్రాగరాదు. శుచిగా ఉండాలి.

సాయం సమయంలో జుట్టు విరియబోసికొని తిరగరాదు. మితభాషణం పాటించాలి. ఎప్పుడూ సాభూషణయై ఉండాలి. ఇల్లు విడిచి బయట తిరగరాదు. కాళ్లు కడుక్కోకుండాకాని తడికాళ్ళతోగాని శయనించరాదు. పడమర తలగడగా పరుండరాదు. సంజెవేళల్లో నిద్రించరాదు. నిత్యం ధౌతవస్త్రాలు ధరించాలి. పసుపు, కుంకుమ, చందనం మొదలైన మంగళద్రవ్యాలను విడిచిపెట్టరాదు. ప్రాతస్సమయంలో తూర్పువైపు తిరిగి గోబ్రాహ్మణులను, లక్ష్మీనారాయణులను ఆరాధించి నానావిధాలైన ఉపచారాలతో అర్చించాలి. అలాగే పుష్పాక్షతలతో ముత్తైదువులను పూజించాలి. పతిని సేవించాలి. ఈ వ్రతాన్ని ద్వాదశమాస పర్యంతం ఏమరిల్లకుండా ఆచరిస్తే నీవు కోరిన కొడుకు పుడతాడు— అని కశ్యపుడన్నాడు.

దితి గర్భం ధరించి వ్రతం ఆచరిస్తోంది. దితి మనోగతం ఇంద్రుడు తెలిసికొన్నాడు. ఆమె నెలాగైనా వంచించాలనుకున్నాడు. ఆమెకు రహస్యంగా ఉపచారాలు చెయ్యడం మొదలుపెట్టాడు. వ్రతానికి కావలసిన పుష్పాలు, పండ్లు, సమిధలు, దర్భలు, పత్రాంకురాలు త్రిలోకాలాల్లో తెచ్చియిస్తూ పెద్దపులి లేడికోసం పొంచిఉన్నట్లు ఆమె వ్రతభంగానికి ఎదురుచూస్తున్నాడు. ఆమె గర్భం ధరించిన తేజోవిశేషానికి అతడు అదలి కృశించిపోతున్నాడు. ఇలా ఉండగా ఒకనాడు—

దితి అనుదినం వ్రత విధులను పాటిస్తూ ఉండడంచేత బడలికచెంది సంధ్యా సమయంలో పాదప్రక్షాళనం చేసుకోకుండా అశుచియై కర్మవశంచేత నిద్రించింది,

ఇంద్రుడు ఆమె ఈ వ్రతభంగాన్ని గ్రహించాడు. ఇదే అదననుకున్నాడు. యోగమాయాబలంతో ఆమె గర్భంలో ప్రవేశించాడు. మహోగ్రుడై అమిత తేజంతో దేదీప్యమానంగాఉన్న గర్భస్థశిశువును తన వజ్రధారలతో ఏడు తునియలుగా ఖండించాడు. అయినా ఆశ్చర్యకరంగా ఒక్కొక్క తునక ఒక్కొక్క బాలుడైంది. అలా ఆ యేడు తునుకలు ఏడ్గురు బాలురై ఏడ్వడం మొదలుపెట్టారు. కాని నిష్కరుణుడైన ఇంద్రుడు "మారోదీః" (ఏడవకండి) అని వారిస్తూ తిరిగి ఒక్కొక్కని ఏడేసి ఖండాలు చేశాడు. అయినా వార్ని చెడలేదు. సూర్యసమ కాంతితో వెలుగొందుతూ ఇంద్రునకు కరుణ పుట్టేలాగా చేతులు జోడించి యిలా అన్నారు.

'సురేంద్రా! నీవు మమ్మల్ని హింసింపకు. మేము నీకు తోడబుట్టువులం. మరుద్గణాలం.* నీకు పార్షదులమై నిన్ను సేవిస్తాం. మమ్మల్ని రక్షించు-అని నారాయణానుగ్రహంచేత చెడని మరుత్తులు అర్థించగా ఇంద్రుడు కృపాళుడై వారిని హింసించడం మానివేశాడు. రాజేంద్రా! అశ్వత్థామ బాణాగ్ని నుండి నిన్ను శ్రీహరి రక్షించలేదూ? అలాగే వజ్రధారలచే తునియలైనా శ్రీహరి కరుణావిశేషంచేత వారు వేర్వేరుగా పాణిపాద్యాద్యవయవాలతో ఒక సంవత్సరం గడవనుండగా దితి గర్భంనుండి జన్మించారు. వారే మరుత్తులు. వారు నలుబది తొమ్మిదిమంది.

అనంతరం దితి నిద్రమేల్కొని అగ్నిసమ తేజంతో ప్రకాశిస్తూన్న శిశువులను చూచింది. అక్కడే ఉన్న ఇంద్రునుద్దేశించి యిలా అన్నది— నిన్ను వధించగల ఒక పుత్రుని గోరి నేను దుస్తరమైన వ్రతం ఆచరించాను. నేను సంకల్పించింది ఒక్కనినే. కాని సప్త సప్త సంఖ్యాకులను కాదు. దీనికి హేతువు తెలిస్తేచెప్పు. అనృతం ఆడవద్దు- అనేసరికి ఇంద్రుడిలా అన్నాడు- తల్లీ! నీ వ్రత వృత్తాంతం విన్నాను. నీ నియమభంగం కనుపెట్టి నీ గర్భంలో ప్రవేశించాను. పాపభీతి లేకుండా నీ గర్భాన్ని నా వజ్రధారలతో తునియలు చేశాను. అయినా ఆ తునుకలు చెడక ఆశ్చర్యకరంగా ఈ రీతిగా పూర్ణాకృతి దాల్చిన కుమారులయ్యారు. మహాపురుషారాధన నిష్ఫలం అవుతుందా? నిష్కామంగా భగవంతుని యజించినవారికి ఇహపరాల్లో సకలార్థాలూ సిద్ధిస్తాయి. ఆ మహాపురుషుని తేజాన్ని అణచి వెయ్యడం ఎవరికి సాధ్యమౌతుంది? దుర్మదంతో నీచుడనై నేను దుష్కర్మకు పాల్పడ్డాను. నా దుష్కర్మాన్ని తల్లివి నీవు కాక ఇంకెవ్వరు సహిస్తారు. నన్ను రక్షించు. వీరు నీ కెలాగో నేనూ అలాటివాడనే అని ఇంద్రుడు నిష్కపటంగా ప్రార్థించేసరికి దితి ద్వేషభావం విడిచి అలాగే అని

---

*"మారోదీః" అంటూ ఇంద్రుడు ఖండించడంవల్లన మరుత్తులని పేరు.

శాంతించింది. అనంతరం ఇంద్రుడు వారితోగూడి స్వర్గానికివెళ్లి సోమపాన, హవిర్భాగం వారికి కూడా పంచిపెట్టి వారితోగూడి సుఖంగా ఉన్నాడు.

రాజేంద్రా! ఇది మరుత్తుల జన్మగాథ. విన్నావుకదా! ఈ పవిత్రకథ పఠిస్తే ఎంతటి కర్మబంధమైనా తెగిపోతుంది. ఇంకా ఏం వినాలని ఉందో చెప్పు-" అని శుకుడడిగేసరికి పరీక్షిత్తు- "మునీంద్రా. పుంసవనవ్రత నియమాలు చెప్పావు గాని ఆ వ్రతం ఎలా ఆచరించాలో చెప్పలేదే! ఆ విధానం వివరంగాచెప్పు-" అని అర్థించాడు. అపుడు శుకమహర్షి యిలా చెప్పడం మొదలు పెట్టాడు.

## పుంసవన వ్రతవిధానం*

"రాజేంద్రా. విను. సర్వకామాలను సిద్ధింపజేసెడి ఈ పుంసవన వ్రతాన్ని స్త్రీలు మార్గశీర్ష శుక్లపక్షంలో నొక శుభతిథియందు భర్త అనుమతితో ప్రారంభించాలి. వ్రతారంభానికి ముందు మరుత్తుల జనన గాథ వినాలి. బ్రాహ్మణులను పూజించి వారి అనుమతి తీసికోవాలి. స్నానంచేసి ధౌతవస్త్రాలు ధరించి సకలాభరణ భూషితయై తూర్పుమొగమై లక్ష్మీనారాయణులను ఆవాహనంచేసి ఈ క్రింది నమస్కార మంత్రం పఠించాలి,

"అలం తే నిరపేక్షాయ, పూర్ణ కామ నమోస్తుతే
మహా విభూతి పతయే నమస్సం కల్పసిద్ధయే
యథాత్వం కృప యా భూత్యా తేజసా సహసౌజసా
జుష్ట ఈశగుణై స్సర్వై స్తతోఽసి భగవాన్ విభుః
విష్ణుపత్ని మహామాయే మహాపురుష లక్షణే
ప్రీ యే ధామ్ని మహాభాగే లోక మాతర్న మోఽస్తుతే।"

(పరమేశ్వరా! నీవు పూర్ణకాముడవు. నీకు ఇతరులు చేయవలసినదేదినీ లేదు. నీవు సకల విభూతులకు అధిపతివి. నీవు సంకల్పమాత్రం చేతనే సమస్త సిద్ధులను సమకూర్చగలవు. నీకు నా నమస్కారం. కృపాగుణంచేకాని, ఐశ్వర్యంచే కాని, తేజస్సుచేగాని, ఓజస్సుచేగాని, అన్యగుణాలచేగాని నీవు సర్వాధికుడవు. నీకు నా ప్రణామం. విష్ణుపత్నీ. లక్ష్మీ! నీవు మహామాయవు. మహాపురుష లక్షణాన్వితవు. సర్వసంపదలకు ఆధార భూతమైనదానవు. లోకమాతవు, నీకు నా నమస్కృతి.)

---

* ఈ ఘట్టం పోతన భాగవతంలోలేదు. జిజ్ఞాసువులైన పాఠకుల ఉపయోగార్థం వ్యాసభాగవతంనుండి గ్రహింపబడ్డది.

అలా మంత్రపూర్వకంగా నమస్కారం చేశాక ఈ క్రింది పూజామంత్రల పఠించి అర్చించాలి.

"ఓం నమో భగవతే మహాపురుషాయ మహానుభావాయ
మహా విభూతి పతయే సహ మహావిభూతిభిర్బలిముపహరాణి"

(భగవానుడా! మహాపురుషా! మహానుభావా! సమస్త విభూతులకు నీవు అధిపతివి. నీకు నా కైమోడ్పు. పార్షదగణాలతో గూడిన నీకు అర్ఘ్యపాద్యాది సకలోపచారాలను చేస్తాను).

ఈ మంత్రంతో అనుదినమూ నారాయణుని, ఆవాహనం, ఆసనం, అర్ఘ్యం, పాద్యం, ఆచమనం, స్నానం, యజ్ఞోపవీతం, వస్త్రాభరణాలు, పుష్పాలు, గంధం– ధూపం, దీపం, ఉపహారం మొదలైన సకలోపచారాలతో పూజించాలి. అనంతరం అగ్నిలో హవిస్సును పండ్రెండు పర్యాయాలు హోమం చెయ్యాలి. హోమం చేసేటప్పుడు

"ఓం నమో భగవతే మహాపురుషాయ మహావిభూతయే స్వాహా"

అనెడి హోమమంత్రాన్ని పఠించాలి. సకల సంపదలను కోరెడివారు, వర ప్రదాతలు. ఆశీఃప్రదాతలు అయిన లక్ష్మీనారాయణుల నుభయులనూ సమాహిత చిత్తులై పూజించాలి. దండప్రణామం ఆచరించాలి. అనుదినం పైన చెప్పిన పూజా మంత్రాన్ని పది పర్యాయాలు జపించి అనంతరం ఇలా స్తోత్రం చెయ్యాలి–

"యువాం హి విశ్వస్య విభూ జగతః కారణంపరమ్
ఇయం హి ప్రకృతి స్సూక్ష్మా మాయా శక్తిర్దురత్యయా॥
తస్యా అధీశ్వర స్సాక్షాత్త్వమేవ పురుషః పరః
త్వం సర్వయజ్ఞ ఇజ్యేయం క్రియేయం ఫలభుగ్భవాన్
గుణవ్యక్తిరియం దేవీ వ్యంజకః ఫలభుగ్భవాన్
త్వం హి సర్వశరీర్యాత్మా శ్రీ శ్శరీ రేంద్రియాశ్రయా
నామరూపే భగవతీ ప్రత్యయ స్త్వముపాశ్రయః।
యథా యువాం త్రిలోకస్య వరదౌ పరమేష్ఠినౌ
తథేమ ఉత్తమ శ్లోక సంతు సత్యామమాశిషః"

(మీ రిరువురును విశ్వేశ్వరులు, జగత్కారణులు. ఈ లక్ష్మి ప్రకృతి. సూక్ష్మమై తెలిసికొనడానికి సాధ్యం కాని మాయాశక్తికలది. భక్తిశూన్యులకు ఈమె దురతిక్రమయై ఉంటుంది. దేవా! నీవు అలాంటి ప్రకృతికి అధీశ్వరుడవు. పరమపూరుషుడవూ. నీవు యజ్ఞ స్వరూపుడవు. ఈ లక్ష్మి ఇష్టిస్వరూపిణి, ఈమె

యాగక్రియ. నీవు యాగఫలభోక్తవు. ఈ దేవి సర్వవస్తువుల యందుండు గుణ వ్యక్తి. నీవు ఆ గుణాలను వ్యంజింపజేయువాడవు. ఫలభోక్తవు. నీవు సమస్త జీవులూ శరీరంగా గలవాడవు. ఈమె సకలేంద్రియాలకు ఆధారమైనది. ఈ లక్ష్మి నామ రూపాలు. నీవా నామరూపాలను ప్రకాశింప జేయువాడవు. మీరు ముల్లోకాలకు వరప్రదాతలు, మహోత్కృష్టులు ఉత్తమశ్లోకుడా! నా కోర్కెలు సఫలము లగుగాక!)

అని శ్రీదేవిని, శ్రీనివాసుని స్తుతించి మిగిలిన పూజాద్రవ్యాలను అక్కడ నుండి తొలగించాలి. భగవానునకు తిరిగి ఆచమనం సమర్పించి భక్తి ప్రణవమైన చిత్తంతో, నానావిధ స్తోత్రాలు చెయ్యాలి.... యజ్ఞోచ్ఛిష్టాన్ని ఆఘ్రాణించి శ్రీహరిని మళ్లీయజించాలి. అనంతరం అనన్యభక్తితో పతిని పరదైవంగా భావించి ఆతనికి ప్రియమైన వస్తువులను ప్రేమశీలయై స్వయంగా అర్పించి సంప్రీతుణ్ణి చెయ్యాలి. పతికూడా ప్రేమశీలుడై భార్యచేసెడి క్రియాకలాపాలకు సంతుష్టుడై తోడ్పడాలి. ఇలా దంపతులిద్దఱు పరస్పర సౌహార్దంతో వ్రతాన్ని ఆచరిస్తే ఉభయులకు ఫలం సిద్ధిస్తుంది. భార్య ఒకవేళ అశక్తియై వ్రతం చెయ్యలేకపోతే భర్త ఆ వ్రతాన్ని నిర్విఘ్నంగా పరిసమాప్తం చెయ్యాలిగాని ఈ విష్ణువ్రతానికి మాత్రం భంగం రానీయరాదు.

ఇలా నియమవ్రతలై ప్రతిదినం బ్రాహ్మణులకు, పుత్రవతులైన ముత్తైదువులకు పుష్పమాలలు, మంచిగంధం, కానుకలు, ఆభూషణాలు అర్పించి అర్చించాలి. అనంతరం స్వధామమందే భగవంతునకు ఉద్వాసనం చెప్పి ఆతని సమక్షమందు నివేదింపబడిన హవిస్సును ఆత్మశుద్ధికోసమూ, సర్వవాంఛా సిద్ధి కోసమూ, భక్షించాలి. ఇలా పూజావిధానంలో ఒక సంవత్సరం గడపి కార్తిక మాసం తుదిరోజున వ్రతసమాప్తి చెయ్యాలి.

ఆ మఱునాడు ప్రాతఃకాలమందు స్నానంచేసి యథాపూర్వం శ్రీహరిని అర్చించాలి. నేతితోగూడిన పాయసాన్ని భర్తచేత పండ్రెండు పర్యాయాలు హోమం చేయించాలి. అనంతరం యోగ్యులైన పండ్రెండుగురు బ్రాహ్మణులను పిలిచి వారిని మృష్టాన్నసంతృప్తులనుగా చెయ్యాలి. తర్వాత వారికి నువ్వులతోను నీటితోను నించిన పాత్రలను అర్పించి వారికి నమస్కరించి వారిచ్చు దీవనలు స్వీకరించాలి. ఆ తర్వాత వారి యనుమతితో ఆచార్యుని ముందిడుకొని బంధు జనంతో గూడి మౌనంగా భుజించాలి.

ఈ విష్ణువ్రతాన్ని యథావిధిగా ఆచరిస్తే పురుషునకు సకలాభీష్టాలూ సిద్ధిస్తాయి. స్త్రీకి సౌభాగ్యం, సంపద, సంతానం, యశోవైభవం లభిస్తుంది. భర్త దీర్ఘాయుష్మంతుడౌతాడు. ఈ వ్రతాన్ని కన్య ఆచరిస్తే సకల సల్లక్షణాలుగల

భర్త లభిస్తాడు. సంతానహీనయైన స్త్రీకి సంతానం కలుగుతుంది. కురూప రూపవతి అవుతుంది. వ్యాధిగ్రస్తునకు ఆరోగ్యం ప్రాప్తిస్తుంది. ఇంద్రియపుష్టిలేనివారికి ఇంద్రియ పటుత్వం వస్తుంది. అభ్యుదయ కర్మములందు దీన్ని ఆచరిస్తే పితృదేవతలకు అపారమైన సంతృప్తి కలుగుతుంది. హోమావసానమందు శ్రీహరీ అగ్నికూడా ప్రసన్నులై సమస్త వాంఛితాలూ తీరుస్తారు–" అని శుకయోగి పరీక్షిన్నరేంద్రునకు మరుత్తులజన్మకథా, పుంసవనవ్రతవిధానమ్మూ, దాని నియమాలూ, దాని అనంతమైన ఫలమ్మూ చెప్పగా విని ఆ రాజేంద్రుడు మహానందం చెందాడు.



# మహా భాగవతం

## ( సప్తమ స్కంధం)

ప్రాయోపవిష్టుడైన పరీక్షిన్నరేంద్రుడు శుకయోగీంద్రు నుద్దేశించి— "మహాముని! ఆద్యుడూ అనంతుడూ అయిన శ్రీహరి సమస్త భూతకోటికీ సముడూ, సఖుడూ, ప్రియుడూ కదా! అలాంటప్పుడు రాగద్వేషాది ప్రాకృతగుణాలుగల వానిలాగా దైత్యులను వెదకి వెదకి చంపడమేమిటి? వారిని అలా చంపడంవల్ల అతనికి ప్రయోజనమేమైనా ఉందా? అతడు గుణరహితుడు. ముక్తిప్రదాత. అసురులవలన అతనికి భయమేముంటుంది? పగ ఎందుకుంటుంది? అతడు దైత్యులను వధించి దేవతలను రక్షించడం నాకు ఆశ్చర్యాన్ని కలిగిస్తోంది. నీ జ్ఞానశక్తిచే నాయీ సందేహం తీర్చు-" అని అడిగేసరికి శుకమహర్షి యిలా అన్నాడు.

"రాజేంద్రా. నీవడిగిన ప్రశ్న నిజంగా ప్రశంసింపదగ్గది. ఆలోచించిన కొలదీ శ్రీహరి చరిత్ర విచిత్రంగా ఉంటుంది. హరిభక్తుల గాథలు సకల సంపదలను ఇస్తాయి, శ్రీహరి చరణకమల ధ్యానాన్ని ప్రవృద్ధం చేస్తాయి. మునీంద్రులు కూడా ఆ దివ్యగాథలను పరవశించి కీర్తిస్తారు. నీవన్నట్లు విష్ణుచరిత్రలు విచిత్రమైనవి. అవి ముల్లోకాలను పవిత్రం చేస్తాయి. సంసారబంధాన్ని ఇట్టే విచ్ఛిన్నం చేస్తాయి. అవి సన్మిత్రుడు లాంటివి. మునులకుకూడా అవి ఎంతో మహాహ్లాదాన్ని కల్పిస్తాయి. నరేంద్రా! వ్యాసభగవానునకు ప్రాంజలించి నీకు ఆ దివ్యగాథలు చెపుతాను. విను. నీ సంశయం తీరుతుంది.

పరమేశ్వరుడు అవ్యక్తుడు. గుణరహితుడు. అతనికి పుట్టుకలేదు. అయినా అతడు నిజమాయాగుణాలకు లోబడి బాధ్యబాధకత్వాలను[1] వహిస్తాడు. సత్వరజస్తమాలు ప్రకృతిగుణాలు. కాని ఆత్మకు సంబంధించినవికావు ఆ గుణాలకు ఒక్కొక్కకాలంలో హాని వృద్ధులు కలుగుతూ ఉంటాయి. ఈశ్వరుడు సత్వవృద్ధిలో దేవఋషులను, రజోవృద్ధిలో అసురులను, తమోవృద్ధిలో యక్షరక్షోగణా

---

1 తాను బాధపడడం ఇతరులను బాధించడం

లను విభజించాడు. సూర్యుడొక్కడే. అయినా విభిన్న స్థానాల్లో కనబడతాడు. అలాగే, పరమాత్మ సర్వగతుడైనా ఒక్కడే. భిన్నుడు కాడు. తత్త్వవిదులైన పెద్దలు అంతర్మథనంచేసి ఆత్మస్థమైన ఆత్మను తెలుసుకుంటారు. పరమేశ్వరుడు లోకాన్ని సృజింపగోరి సత్వగుణాన్నీ, ఆ లోకంలో క్రీడింపదలచి రజోగుణాన్నీ, అందులో నిద్రింపనెంచి తమోగుణాన్నీ ప్రేరేపించి చరస్వభావంకల కాలాన్ని సృష్టిస్తాడు. ఆ కాలంలో సర్వదర్శనుడైన ఈశ్వరుడు సాత్వికమైన దేవగణానికి వృద్ధినీ, రజస్తమోగుణాన్వితులైన రాక్షసులకు క్షయాన్నీ కలగజేస్తాడు. వాస్తవంగా ఇందులో ఆయని కర్తృత్వంగాని అతనికి లభించే ప్రయోజనంగాని ఏమిన్నీ లేదు. కాలానుగుణంగా కర్మవిపాకాన్నిబట్టి సమస్తం జరుగుతూ ఉంటుంది.

రాజేంద్రా! ఈ విషయాన్నే కీర్తిధనుడైన ధర్మరాజునకు రాజసూయ యాగసమయంలో నారదుడు చెప్పాడు. అది నీకు నేను కర్ణపేయంగా చెపుతాను. విను. ధర్మజుడు రాజసూయం చేస్తుండగా అవివేకియైన శిశుపాలుడు శ్రీహరిని నిందించేసరికి శ్రీహరి ఆగ్రహించి నిశితమైన తన చక్రధారతో ఆతని తల ఛేదించాడు. అపుడాతడు తేజోరూపంతోవచ్చి శ్రీహరిలో లీనమయ్యాడు. ధర్మనందనుడది చూచి విస్మయావిష్టుడై నారదునితో అన్నాడు.

మునీంద్రా. ఏకాంతభక్తులకైనా, ఇంకా ఎలాంటివారికైనా వాసుదేవునిలో సాయుజ్యం చెందడం సాధ్యంకాదే! శ్రీహరికి పరమవిరోధియైన ఈ శిశుపాలుడు ఆ దేవదేవునిలో ఎలా లీనమయ్యాడూ? పూర్వం వేనచక్రవర్తి శ్రీహరిని నిందించగా విప్రులు శపించేసరికి ఆతడు తమోలీనుడుకాలేదూ? చేది దేశాధీపుడైన ఈ శిశుపాలుడు మాధవుని పేరు చెవినిబడితే సహించడు. ఇక ఆతనికి శ్రీహరి యెడల భక్తి ఏముంటుందీ? అలాంటివాడు ఏమహామహిమచేత శ్రీహరియందు తాదాత్మ్యం చెందాడు? - "నేను శ్రీహరిని జయిస్తాను. మింగేస్తాను. లతని ప్రాణాలు హరిస్తాను. ఆతడు నాకు పరమశత్రువు"– అని చైద్యుడు క్రుద్ధుడై అంటూ ఉంటాడు. ఆతని నోటికి ఏచేటూ కలుగదేం? ఆతని శరీరం ప్రేలి రాలిపోదే? అతనికి నరకం కూడా ప్రాప్తించదే? ఏవిధంగా ఆతడు జగన్నాథునిలో లీనమయ్యాడో ఆశ్చర్యంగా ఉంది.

అదీకాక దంతవక్త్రుడూ వీడూ నిరంతరం శ్రీహరిని నిందిస్తూ ఉంటారు. అలాంటప్పుడు వీనికి నిఖిలజన సమక్షంలో శ్రీహరి సాయుజ్యం కలగడానికి హేతువేమిటి? గాలికి చలించెడి దీపశిఖలాగా 'నా హృదయం చలిస్తోంది. నా సంశయం తీర్చు— అని ధర్మనందనుడనేసరికి నారదుడిలా అన్నాడు– ధర్మజా! దూషణ భూషణ తిరస్కారాలు శరీరానికికాని ఆత్మకులేవు. దండంకాని వాక్పారుష్యం (నింద) కాని శరీరాభిమానంచేత హింసగా తోస్తుంది. అలాగే భూతకోటికి నేను.,

నాది అనెడి భేదభావంకూడ శరీరమందే కలుగుతుంది. అభిమానం బంధహేతువు. నిరభిమానంగా హత్యచేసినా అది హత్యకాదు. కర్తృత్వబాధ్యతలేనపుడు హింస సిద్ధించదు. ఈశ్వరుడు సర్వభూతాత్మకుడు. అతనికి హితులనీ, అహితులనీ ఎలా ఉంటారూ?

అలుకచేగాని చెలిమిచేగాని కామంచేగాని బాంధవంచేగాని తుదకు భయంచేనైనాకానీ శ్రీహరిని స్మరిస్తేచాలు ఆతణ్ణి చేరుకోవచ్చు. అతనికి భేదభావం ఉండదు. వైరాను బంధంతో శ్రీహరిని చేరినంత సులభంగా భక్తియోగంలో చేరడం సాధ్యం కాదని నా ఊహ. తుమ్మెద కీటకాన్ని తెచ్చి నిరోధించి ఝుంకార ధ్వనిచేస్తూ ససంభ్రమంగా దానిచుట్టూ తిరుగుతూ ఉంటుంది. అపుడాకీటకం (పురుగు) భ్రాంతిచేతను భయంచేతను దానినే స్మరిస్తూ తన్మయత్వం చెంది ఆ భ్రమర రూపాన్ని పొందుతుంది అలాగే. కామోద్రేకంతో గోపికలూ, భయంతో కంసుడూ, వైరభావంలో శిశుపాలాదులూ, బంధుభావనతో యాదవులూ, ప్రేమతో మీరూ, భక్తితో మేమూ శ్రీహరి అనుగ్రహానికి పాత్రులమయ్యాం. కనుక ఏ దారినైనా శ్రీహరిని చేరవచ్చు.

## శ్రీహరి ద్వార పాలకులకు సనకాదుల శాపం

కామించికాని, ద్వేషించికాని, భయంచేగాని, స్నేహంచేగాని, సేవాధర్మంచేగాని చిత్తాన్ని హరిపరాయత్తంచేసి ముక్తిపదం చెందినవారు చాలామందిఉన్నారు. ఆ మార్గాల్లోదేనినీ త్రొక్కని వాడవడం చేతనే వేనుని బ్రతుకు వ్యర్థమైంది. శిశుపాల దంతవక్త్రులు మీ పినతల్లి కొడుకులు. పూర్వం వారు విష్ణుమందిరద్వార పాలకులు. బ్రాహ్మణ శాపంచేత వారు తమ పదవిని పోగొట్టుకొని భూమిపై జనన మందారు— అని విని ధర్మజుడు నారదమహర్షి నుద్దేశించి- మునీంద్రా! బ్రాహ్మణులకు కోపం ఎందుకు వచ్చింది? అసలా బ్రాహ్మణులెవ్వరూ? ద్వారపాలకులైనా ఎవరైనా వైకుంఠంలో నివసించే వారందఱూ జితేంద్రియులూ, నిశ్చలాత్ములూ, సంగదూరులూ, హరిభక్తులూ అని వింటామే! అలాంటి వారికేమిటి? ఈ పాడు బ్రతుకేమిటి? దీనికి హేతువేమిటో తెలిసి కోవాలని నాకు కుతూహలంగాఉంది— అనేసరికి నారదుడిలా చెప్పడం మొదలు పెట్టాడు.

ధర్మనందనా. విను బ్రహ్మమానస పుత్రులైన సనక సనందనాదులు దైవయోగంచేత త్రిలోక సంచారంచేస్తూ ఒకనాడు వైకుంఠానికి వచ్చారు. వారపుడు అయిదారేండ్ల వయసులో ఉన్న పసి బాలకుల్లాగా ఉన్నారు. ఒంటిపై బట్టల్లేవు. వారలాగే దిగంబరంగా ఎకాయెకిని శ్రీహరి మందిరంలోనికి ప్రవేశింప బోయేసరికి మొగసాలలో ఉన్న ఇర్వురు పురుషులు వారిని చూచారు. ఆ బాలకులు

మహాభక్తులనీ, నిరంతరం శ్రీహరిని స్మరిస్తూ పరవశిస్తూ ఉంటారనీ, మనోదంభం లేనివారనీ, వారికేం తెలుసు? వారిని లోనికి వెళ్లనీయకుండా ద్వారు వారించి తటిమి వేశారు. అపుడు ఆ సంయమీంద్రులు సహనం కోల్పోయి- ఓయీ! మీరు ఇక్కడ ఉండడానికి అర్హులుకారు. శ్రీహరి చరణస్థానం విడిచి రజస్తమోగుణో పేతులై రాక్షసులుగా జన్మించండి— అని శపించారు. వారే జయ విజయులు.

ఆ శాప వశం చేత వారు పదభ్రష్టులై కూలిపోతూ మొఱపెట్టగా ఆ మునీంద్రులు కృపాళువులై వారిని కరుణించి— మీరు భూమిపై మూడుజన్మలెత్తి వైర భావంతో తిరిగీ భగవత్సన్నిధానానికి రాగలరు- అని శాపవిముక్తి తెలిపి వెళ్లి పోయారు. శాపహతులైన ఆ శ్రీహరి పార్శ్వవర్తులిద్దఱూ హిరణ్యకశిపు హిరణ్యా క్షులుగా దితి కడుపున జన్మించారు. ఆ యిద్దఱిలో చిన్నవాడైన హిరణ్యాక్షుని శ్రీహరి వరాహరూపంతో సంహరించాడు. పెద్దవాడైన హిరణ్యకశిపుని నరసింహ మూర్తియై చీల్చి నేలకూల్చాడు. హిరణ్యకశిపుని కొడుకు ప్రహ్లాదుడు హరి భక్తుడు. తండ్రి ఆతని ఎన్నివిధాల హింసించినా అతడు చెక్కుచెదరలేదు. చిరజీవి అయ్యాడు. ఇది వారి మొదటి రాక్షస జన్మకథ.

రెండవజన్మలో వారు కైకసి యను రాక్షసి కడుపున రావణ కుంభకర్ణు లుగా జన్మించారు. శ్రీమహావిష్ణువు రఘుకులంలో శ్రీరామచంద్రుడుగా అవతరించి వారిని వధించాడు. ఆ మహాత్ముని పరాక్రమాతిశయాన్ని నీవు మున్ముందు మార్కండ మహర్షి వలన వింటావు.

ఇక మూడోజన్మలోవారు మీ పినతల్లి గర్భాన శిశుపాల దంతవక్త్రులుగా ఉద్భవించారు. పుట్టినది మొదలూ వారు శ్రీహరియెడ బద్ధవైరం వహించి అహో రాత్రాలు ఏదోవిధంగా ఆ దేవదేవుని స్మరిస్తూ ఉండడంచేత వారు పాపవిముక్తు లయ్యారు. ఈ జన్మతో శాపావధికూడా తీరించి. అంచేత వారు శ్రీహరి చక్రా యుధంచేత ఖండితశిరస్కులై భగవత్సాధర్మ్యం పొందారు— అని నారదుడు చెప్పగా ధర్మజుడు ఇలా అన్నాడు.

మునీంద్రా! బాలుడైన ప్రహ్లాదుడు శ్రీహరి పాదధ్యానశీలుడనీ, సుగుణాల వాలుడనీ, మేధాశాలియనీ అన్నావుకదా! అతణ్ణిచూచి ఆనందించక రాక్షసేశ్వ రుడు, అతణ్ణి హింసలపాలు చెయ్యడమేమిటి? హరిభక్తి అంతలంతలకు లభి స్తుందా? శ్రీహరి గాథలు సామాన్యమైనవా? అవి వ్యథను పోగొట్టుతాయి. సంసార సముద్రాన్ని మధించివేస్తాయి. దేవయక్షగణాలకవి జీవగఱ్ఱలు. అలాం టప్పుడు రాక్షసుడు పరమభక్తుడైన ప్రహ్లాదుని హింసించడం ఆశ్చర్యంకాదూ! నాకు ఆ భాగవతోత్తముని గాథ సాకల్యంగా వినాలని కుతూహలంగా ఉంది— అని అడిగేసరికి నారదుడు ఇలా అన్నాడు.

ధర్మజా! విను. తన సోదరుడైన హిరణ్యాక్షుడు శ్రీహరిచేత హతుడయ్యా డని విని హిరణ్యకశిపుని హృదయం శోకంతోను, రోషంతోను దహించుకొనిపోయింది దిక్కులు మార్మోగే లాగా గర్జించాడు. పొగలూ సెగలూ చిమ్ముతూ దావాగ్ని జ్వాలల్లాగా భయంకరంగా ఉన్న చూపులతో నలువైపులా ఒకసారి కలయ జూచాడు. మెఱపు తీగ మొలకల్లాగా ధగధగలాడుతూన్న దంతాలతో పెదవులు కొరికాడు. ఫాల భాగాన కనుబొమలు ముడిపడ్డాయి. మహా శక్తివంతమై కాంతులు చిమ్ముతూన్న శూలాన్ని చేత ధరించాడు. కోపంతో చలించిపోతూ సభా మండపంలో నిలబడి—త్రిమస్తకుడు, త్రిలోచనుడు, శకుని, శంబరుడు, శత బాహుడు, నముచి, హయగ్రీవుడు, పులోముడు, విప్రచిత్తి-మొదలైన దైత్య దానవులను*చూచి యిలా అన్నాడు—

ఓయీ! నాకు తమ్ముడూ, మీకు సఖుడూ అయిన హిరణ్యాక్షుడెటువంటి వాడో మీకు తెలుసు కదా! అతడు యుద్ధనీతి పారంగతుడు. అతని బాహుబలం అనన్యం. దేవతలను యక్షులను అతడెన్నోమారులు నిర్జించాడు. శ్రీహరి వరాహ రూపం ధరించి అతణ్ణి వధించాడు. దానవ స్త్రీల సౌభాగ్యాన్ని బూడిదపాలు చేశాడు. మీరీ వార్త విన్నారా? అతడెక్కడున్నా నేను అతణ్ని పట్టి పల్లార్చి పగ తీర్చుకుంటాను.

అతడు అడవుల్లో ఉంటాడు. మునిజన హృదయాల్లో సంచరిస్తాడు. అతని పుట్టువును ఎవ్వరూ ఎఱుగరు. అతని జాడకూడా ఎవరికీ తెలియదు. తనను దగ్గఱిస్తే తానూ దగ్గరికి వస్తాడు. వెంటబడితే చిక్కినట్లే కనబడతాడు కానీ చిక్కడు. ఏదో మాయోపాయంతో మనం అంతా లోబడినట్లు నటించకపోతే అతణ్ణి మనం ఒక పట్టనటు లోబరచుకొని పట్టుకోలేం. ఏమైనా నేను అతణ్ణి విడిచి పెట్టడం మాత్రం కల్ల.

భుజ బలంతో నాతో పోరాడలేక మున్నీటిలో (సముద్రంలో) మునిగి దాగినా సరే! పర్వతం లాగా నిశ్చలంగా నిలబడి పోరాడెడి నా విజృంభణం చూచి నమస్కరించి వెన్నిచ్చి పారిపోయినా సరే! నా ధాటికి ఓర్వలేక సుఖాన్ని కాంక్షించి భూమిలో చొచ్చినా సరే! అలాగాక క్రుద్ధుడై కొంత సేపు పౌరుషంతో మృగేంద్రంలాగా చెలరేగినా సరే! నాయీ శితశూలంచేత అతని శిరస్సు ఖండించి అతని రక్తంతో నా తమ్మునకు తర్పణం చేస్తాను. మీకందరికీ మేలు చేకూరుస్తాను.... చెట్టును మూలచ్ఛేదం చేస్తే కొమ్మలు వాటంతట అవే ఎండి పోతాయి. అలాగే రణరంగంలో శ్రీహరి నేలకూలితే, అతడే తమకు ప్రాణం

* దైత్యులు దితి సంతానం. దానవులు దనువు సంతతి.

కనుక దేవతలు ఇంద్రాదులు ఇట్టే కూలిపోతారు. కనుక దానవ వీరులారా! మీరంతా ఇప్పుడు గుంపులు గుంపులుగా భూసుర క్షేత్రాలతో నిండిన భూమికి వెళ్లండి. వేదాలు పల్లిస్తూ క్రతువులు ఆచరిస్తూ ఉండే మునులను వెదకి వెదకి వధించండి. విష్ణువంటే మరెవ్వడో కాడు. అతడే యజ్ఞం. అతడే వేదం. బ్రాహ్మణ కర్మలన్నింటికీ అతడే మూలం. దేవతలకు, పితృదేవతలకు, ఋషులకు, ధర్మానికి ఆధారం అతడే. ఎక్కడెక్కడైతే గోవులుంటాయో! బ్రాహ్మణులుంటారో. వేద పఠనం చెవిని పడుతుందో వర్ణాశ్రమాచారాలు పాటింపబడతాయో అక్కడక్కడకు వెళ్ళి ఆ ప్రదేశాలన్నింటినీ చెరిచి దగ్ధం చేసెరండి- అని హిరణ్యకశిపుడు ఆజ్ఞాపించే సరికి రాక్షస యోధులనేకులా ఆజ్ఞను శిరసావహించి భూలోకానికి వెళ్లారు.

కంటబడిన గ్రామాలు, నగరాలు, పల్లెలు, క్షేత్రాలు, ఉద్యానవనాలు, తపోవనాలు అన్నీ దగ్ధం చేశారు. కొలకులను కలచి వేశారు. ప్రాకారాలు, గోపురాలు, సేతువులు త్రవ్వి బోవులు పెట్టారు. చెట్లను నరికి ముక్కలు ముక్కలు చేశారు. మేదలు, చలివెంద్రలు, పర్ణశాలలు నాశనం చేశారు. గోవులను, బ్రాహ్మణులను, సాధువులను హింసించారు. వేద మార్గాలను చెరిచి వేశారు. దైత్యులిలా భూలోకాన్ని అల్లకల్లోలం చేసేసరికి దేవతలు తల్లడిల్లిపోయారు. నిజతేజం కోల్పోయి అమర లోకం విడిచిపెట్టి అడవుల్లోకి పారిపోయారు.

అంతేకాని రాక్షసేశ్వరుని యత్నం ఫలించలేదు. శ్రీహరి జాడ కనబడలేదు.

అపుడాతడెంతో దుఃఖించాడు. మృతుడైన తమ్మునకు ఉదకక్రియలు నిర్వర్తించాడు. శకుని, శంబరుడు, కాలనాభుడు, మదోత్కచుడు మొదలైన ఆతని బిడ్డలను ఊరడించాడు. వారి తల్లితో గూడ హిరణ్యాక్షుని భార్యలనందరినీ రప్పించి శోక సంతప్తయైన తమ తల్లి దితినుద్దేశించి యిలా అన్నాడు —

బాటసారులు చలివెందరలో కొంతసేపు సేద దీర్చుకొని ఎవరి దారిన వారు వెళ్ళిపోతారు. అలాగే సంసార చక్రంలో పడి తిరిగెడి జీవులు కర్మవశులై కలిసి వస్తారు ఏదో అనుబంధం కల్పించుకొని కొంతకాలం ఉండి తిరిగి విడిపోతారు. అంతే కాని సంయోగ వియోగాలు శాశ్వతమైనవి కావు. తల్లీ! నీ కొడుకు వీరుడు పోయెటి త్రోవను పోయాడు. ఆతనితో సాటి రాగల వీరులు అరిది. నీవు ఆతని కోసం విలపించడం తగదు.

ఈశ్వరుడు సర్వజ్ఞుడు, సర్వాత్మకుడు, అవ్యయుడు, అమలుడు, అనంతుడు, ఆద్యుడు. ఆతడు నిజ మాయా మహిమ వలన గుణాలను కల్పించి

గుణసంగతమైన శరీరం ధరిస్తాడు. కదలెడి నీటిలో ప్రతిబింబించెడి చెట్లుకూడ కదలుతూన్నట్లుంటాయి. కళ్లు తిరుగుతూంటే భూమి కూడా తిరుగుతూన్నట్లు గోచరస్తుంది. అంతే కాని వాస్తవంగా ఆ చెట్లుగాని, భూమిగాని కదలవు. అలాగే చలించెడి మనస్సుకు ఆత్మ కూడా చలించుతూన్నట్లు భ్రాంతి కలుగుతుంది. అంతేకాని ఆత్మమయుడైన ఈశ్వరునకు పైకల్యం లేదు. అమ్మా! ఏ లక్షణాలూ లేని ఈశ్వరుడు శరీర సంబంధంతో లక్షితుడై కర్మ సమన్వితమైన సంసారంలో సంయోగ వియోగాలు కల్పిస్తూ ఉంటాడు. పుట్టువు, చావు, శోకం, వివేకం, అవివేకం, చింత, స్మరణం—ఇవన్నీ కర్మములవలన కలిగిన సంసారానికి సంబంధించినవే. ఈ యర్థాన్ని బోధించడానికే ప్రేతబంధు యమ సంవాదం అను ఒక ఇతిహాసాన్ని పెద్దలు ఉదహరిస్తారు. నేను నీకు అది చెప్తాను విను.

## సుయజ్ఞోపాఖ్యానం.

పూర్వం ఉశీనర దేశంలో సుయజ్ఞుడనే రాజున్నాడు. అతడు శత్రువుల చేత యుద్ధంలో హతుడయ్యాడు. అతని మృత శరీరం రణ భూమిలో పడి ఉంది. రత్నఖచితమైన ఆతని కవచం తుత్తునియలైంది. మణి భూషణాలు రాలి చెల్లాచెదరుగా పడి ఉన్నాయి. వక్షస్థలం బాణా హతులచే తూట్లుపడ్డది. రక్తం ఏక ధారగా స్రవిస్తోంది. జుట్టుముడి చెదరి జారి పోయింది. దంతాలతో నొక్కబడిన క్రిపెదవి అతని రోషాన్ని చాటుతున్నది. రెప్పపాటు లేకుండా కళ్లు నిశ్చలంగా ఉన్నాయి. పద్మం లాంటి ముఖం దుమ్ముకొట్టుకొని ఉంది. పొడవు పాటి భుజ దండాలు తెగిపడి ఉన్నాయి. విగత జీవుడైన ఆ ఉశీనరదేశాధీశుని చుట్టూ మూగి బంధువులు రోదనం చేస్తున్నారు. ఆ దయనీయ దృశ్యం చూచి ఆతని భార్యలు అడలిపోయారు.

వారి జుట్టు ముడులు జారి ఊగులాడుతున్నాయి. హారాలు చెదరి చిక్కుపడుతున్నాయి. తామర పుష్పాల్లాగా మృదువుగా ఉన్న చేతులు చూచి 'హా నాథా!' అని వక్షస్థలాన్ని మోదుకుంటున్నారు. ఏనాటి మాటలో త్రవ్వి తలపునకు తెచ్చుకుంటూ విలపిస్తున్నారు. కుచ కుంకుమచే ఎఱ్ఱనై చెదరిన కన్నీరు కాల్వలు కడుతున్నాయి. శోకమూర్తులైన ఆ షోభణీని కాంతలు ఆతని పాదలపై వ్రాలి యిలా విలపించడం మొదలు పెట్టారు

రాజేంద్రా! ఉశీనర ప్రజలకు అర్థాన్నీ ఆనందాన్నీ అందించేందుకు ప్రభువుగా నిన్ను పూర్వం బ్రహ్మ సృజించి నిష్కరుణంగా ఇంతలోనే నిన్ను నిర్మూలించాడే! ఈ నీ కుమారులకూ, 'నీతోడిదే బ్రతుకని భావించిన మాకూ

ఇక దిక్కెవ్వరు? ప్రభూ ఇంత మంది సోదరులను, మిత్రులను, పుత్రులను విడిచి వెళ్లడం నీ వంటి వానికి తగునా? నాథా నీవులేని ఒక్కొక నిమిషం ఒక మహా వత్సరంగా తోస్తుంది. నీవు తిరిగి రాకుండా లోకాంతరగతుడవైతే మేం ఇక్కడ ఎలా చరించగలం? ఈ లోకవృత్తం మాకు అభిలషితం కాదు. మేమున్నూ అగ్ని జ్వాలల్లో చొచ్చి నీ పాద ద్వయిని కనులార చూస్తూ నీతోపాటు వస్తాం— అని ఆ రాజపత్నులు రాజు శవం చుట్టుముట్టి శోకిస్తుండగా సూర్యాస్తమయ సమయం అయింది. అపుడు వారి రోదన ధ్వనులు విని యముడు బ్రాహ్మణ బాలకుడై వచ్చి ఆ ప్రేత బంధువుల నుద్దేశించి యిలా అన్నాడు—

దేహి పుడుతూ చస్తూ ఉండడం అందఱు చూస్తూనే ఉన్నారు. చావులేని వారిలాగా మీరు ఈ చచ్చిన వాని కోసం విలపిస్తారెందుకూ? చోద్యంగా ఉన్నదే! ఎక్కడైనా దాగి చావునెవరైనా తప్పించుకోగలరా? ప్రాణికోటి యెక్కడ పుట్టిందో అక్కడికి వెళ్లడం నైజం. గర్భంలో ఉన్నప్పుడు మిమ్మల్ని ఎవడు పోషించాడు? ఆతడే మీరు తల్లి దండ్రులను విడిచి అడవుల పాలైన మిమ్మల్ని తోడేళ్ల పాలు కాకుండా కంటికి ఱెప్పలాగా కాపాడుతాడు. అనంతుడైన ఈశ్వ రుడు సృష్టి స్థితి లయాలు లీలా మాత్రం చేత చేస్తుంటాడు. ప్రాణికోటిని మనిచి పెనిచేది ఆతడే ధనం వీధి పాలైనా దైవ వశం చేత భద్రంగా ఉంటుంది. ఎక్కడో మూల దాచినా పోతుంది. అలాగే దుర్గమాటవిలో రక్షణ లేని దుర్బలుడు వృద్ధి చెందుతాడు. సమస్త రక్షణాలతో సౌధాంతరాలలో ఉన్నవాడు చనిపోతాడు.

జీవులు కాలకర్మ వశంగతులై పుడుతూ ఉంటారు. కాలం తీరి కర్మ ఫలం అంతం కాగానే అంతమవుతారు. కాని ఈశ్వరుడు గుణ సంగతుడు కాక పోవడం చేత అతనికి అలాంటి అవస్థ ఉండదు అతడాత్మమయుడు, శాశ్వతుడు. ఈ శరీరం పంచ భూతాలతో విరచితమైన భవనం . పూర్వకర్మ వశంచేత పురు షుడు దానిలో ప్రవేశించి కొంత కాలం ఉంటాడు. కాలం తీరే సరికి దాన్ని విడిచి వెళ్ళి పోతాడు చెడితే దేహం చెడుతుంది కాని పురుషుడు చెడడు. ఆతనికి ఎన్నడూ చేటులేదు. పురుషుడు వేఱు శరీరం వేఱు. అంతేకాని ఈ రెండింటికి ఏకత్వం ఎక్కడా లేదు. దారువు (కొయ్య)లో అగ్ని ఉంటుంది. కాని ఆ అగ్నికి దారు వికారాలేవీ అంటవు. అది దారువు కంటే భిన్నంగా ఉంటుంది. వాయువు దేహ గతమై ఉంటుంది. కాని దానికి దైహిక వికారాలేవీ సంక్రమించవు. అది దేహానికి భిన్నంగా ఉంటుంది. అలాగే జీవుడు గుణ పరిణామంచేత దేహేంద్రి యాలను ఆశ్రయించి వాటితో కలిసి ఉన్న దేహగతాలైన జరామరణాది వికా రాలు పొందకుండా వాటికి భిన్నంగా ఉంటాడు.

మీరు వెఱ్ఱివారు కాకపోతే ఈ రాజేంద్రుడు నిద్రిస్తున్నాడనుకున్నారా? మీ రోదనం విని మీతో మాట్లాడగలడని భావిస్తున్నారా? మీతో మాట్లాడే వాడూ మీ మొఱ వినేవాడు ఎన్నడో వెళ్ళి పోయాడు గాని ప్రాణభూతమైనా అది వినలేదు, భాషించ లేదు. వినేవాడు, భాషించేవాడు అన్యుడొకడున్నాడు దేహానికి దేహానికి కూడా వేఱైన వాడాతడు. అతడే ముఖ్యుడు. అతడు ప్రకృతి కంటె పరుడై స్వీయ ప్రాపంచంలో భిన్న భిన్న శరీరాలలో విలాసంగా కూడి విడిచి పోతూ ఉంటాడు. కనుక మీరు ఎంత శోకించినా ప్రయోజనం లేదు.

ఎందాకా ఆత్మ దేహగతమై ఉంటుందో అందాకా కర్మాను బంధం ఉంటుంది. ఆ పైని ఏమీ ఉండదు. మీరు మాయాధీనులై ఇలా దైన్యంతో విలపించడం వ్యర్థం. వీరు నాకు చెలులు, తల్లులు, తండ్రులు, కొడుకులు, సతులు, సేవకులు అన్నీ, ఈ యిళ్లు వాకిళ్లు నావి అన్నీ మాయా గుణంచే భ్రాంతులై వ్యర్థాను రాగం పెంచుకుంటారు. ఇదంతా కలలో చూచిన అర్థ సంచయం లాంటిది. ఇది శాశ్వతమా? కర్మాను బంధంతో ఈ సంగం ఏర్పడు తుంది. కర్మాంత కాలంలో అది విడిపోతుంది. మాయామయులైన ప్రపంచాన్ని ఎఱిగిన తాత్వికులు నిత్యా నిత్యాలను గూర్చి సుఖదుఃఖాలకు లోనుకారు. అజ్ఞులు కొందఱు సంయోగ వియోగాలకు సుఖదుఃఖాలు పొందుతారు.

పూర్వం ఒక దుర్గమారణ్యంలో పక్షుల పాలిటి కాలయముడైన బోయవాడొకడున్నాడు. ఆతడొకనాడు తెల తెల వారగా లేచి వేట తమకంతో వలలు ఉచ్చులు, జిగురుకండెలు చలిది మూట, చిక్కం, విల్లు లమ్ములు పట్టు కొని అడవికి వెళ్లాడు కంచెల చాటున పొంచిలిచి పిట్టలను ఉరిత్రాడుతో లాగి వాటి రెక్కలను పట్టి విరిచి చిక్కంలో పెడుతున్నాడు అతడలా కంటబడిన పక్షులనన్నింటిని వధిస్తూ అడవిలో భయంకరంగా విహరిస్తుండగా వానికి అడవి పిచ్చుకల జంట ఒకటి ఎదురుగా కనబడ్డది. వాడు వెంటనే ఆడు పిచ్చుకను ఉరి త్రాటితో లాగి చంపి చిక్కంలో వేశాడు మగ పిచ్చుక శోక భారంతో తన సహచరిని తలపోస్తూ ఇలా అన్నది.

అడవుల్లో లభించిన మేత తింటూ, ఎవరికీ ఏమి అపకారం చెయ్యకుండా ఇంత కాలమూ స్వేచ్ఛగా బ్రతికాం నిర్దయుడైన బ్రహ్మదేవుడు నేడు ఈ వేటగాని వలలో పడమని విధించాడా? పాపపు దైవానికి మన బ్రతుకు బరువైందా? అయ్యో. ఈ దురవస్థకు నేను ఏమనాలి? మన యిద్దరినీ వీడు ఒకేసారి మట్టు పెట్టినా బాగుండేది అలా కాక నన్నొకణ్ణే వదించాడు. విధి యొక్క వక్ర చేష్ట లిలాగే ఉంటాయి. పిల్లలకింకా ఱెక్కలు రాలేదు. వేపటి నుంచి ఆకలికేక గూటిలో కుంగి పోతూ ఉంటారు ఎగిరి బయటకు పోలేవు తల్లి ఏ వైపు నుండి

ఆహారం తెస్తుందని తదేక దృష్టితో కళ్లింత చేసుకొని నిక్కి నిక్కి చూస్తుంటాయి. వాటి దైన్యాన్ని నేనేలా భరించగలను?

అని చలితస్వనంతో కంఠం శోషించేలా శోకిస్తున్న ఆ మగపిచ్చుకను కూడ వ్యాధుడొక కోలతో నిష్కరుణంగా వధించాడు. పిచ్చుక ఘోషిస్తూ నేలకరిచింది. ఎంతటి వానికైనా మృత్యువును తప్పించుకొనడం సాధ్యమా? మీకు మృత్యువు ఎప్పుడు వచ్చేదీ మీకు తెలియదు. మృతుడై నేలపైబడిన రాజు దేహాన్ని చుట్టి ఎందుకూ ఇలా దీనంగా శోకించడం? పొండి, పొండి. మీరు నూతేండ్లు ఈ రీతిగా నెత్తీనోరూ బాదుకుంటూ ఏడ్చినా మృతి చెందిన మీ పతిని తిరిగి పొందడం అసంభవం. మరణించినవాడు తిరిగి లేచి వస్తాడా?—అని కపట బాలకుని వేషంతో వచ్చిన యముడు వారిని ఊరడించే సరికి వారికి కనువిప్పు కలిగింది. ప్రపంచం అశాశ్వతమని గ్రహించారు. శోకం మానిసుయజ్ఞుని మృత కాయానికి వీరోచిత కృత్యాలు నిర్వర్తించి వెళ్ళి పోయారు. యముడు కూడా వెను వెంటనే అదృశ్యుడయ్యాడు-అని పలికి హిరణ్యకశిపుడు తన తల్లిని తమ్ముని భార్యలనూ చూచి—తామెవ్వరు? పరులెవ్వరు? వాస్తవంగా ఆలోచిస్తే అందరు ఒకటే. కాని అది గ్రహించరు. ఆ జ్ఞానం లేక పోవడంచేత ప్రాణికోటికి మేమని పరులని భేద బుద్ధి తోస్తుంది-అనిన హిరణ్యకశిపుని హిత వచనాలు విని దితీ ఆమె కోడండ్రూ జ్ఞాన దృష్టితో శోకం విడిచి అంతిపురికి వెళ్లారు-అని చెప్పి నారదుడు ధర్మరాజునకు ఇంకా ఈ రీతిగా అన్నాడు.

ధర్మజా! విను. హిరణ్యకశిపునకు ఒక ప్రబలమైన కోర్కె జనించింది. జరా మరణాలు లేకుండా భుజ బలంతో శత్రు నాశనం చేసి ముల్లోకాలను ఏకాత పత్రంగా పాలించాలనుకున్నాడు. అంతటి శక్తి దారుణమైన తపశ్చర్యచే కాని సాధ్యం కాదు. అంచేత వెంటనే మందరనగ సానుతలం చేరాడు. తీవ్రమైన సూర్యరశ్మికి కాలిపేలిపోతున్న నేలపై నిలబడ్డాడు. బాహువులు పైకెత్తి ఆకాశాన్ని తేరిచూస్తూ నిప్పులు కురిసెడి వేడి కిరణాలతో లయ సమయ సూర్యుడు లాగా దుర్నిరీక్షుడై మహోగ్రంగా తపస్సు చెయ్యడం మొదలు పెట్టాడు.

ఆతని శిరస్సు నుండి తపోమయమైన అగ్ని పొగలూ సెగలూ గ్రక్కుతూ లేచి నలు దిక్కులూ క్రమ్మే సరికి భూమి సపర్వతంగా కంపించింది. సముద్రాలు కరగి పోయాయి. గ్రహాలు, నక్షత్రాలు చెదరి రాలి పడ్డాయి. దిగంతాలు బ్రద్దలై మంటలు చిమ్మాయి. భూతకోటి గుండెలు అదరి పోయాయి. ఈ రీతిగా ముల్లోకాలకు సంతాప హేతువైన రాక్షసేంద్రుని తపో విజృంభణాన్ని సహించ లేక దేవతలు స్వర్లోకం విడిచి బ్రహ్మలోకానికి వెళ్ళి బ్రహ్మకు ఇలా విన్నవించారు.

దేవ దేవా. దితి కొడుకు హిరణ్యకశిపుని తపోగ్నికి సంతప్తులమై తల్లడిల్లి పోయాం. ఇక అమరావతిలో క్షణకాలం కూడ ఉండడానికి భయపడుతున్నాం. ఇక మాకు గతి యేది? ఆ దానవుడింతటి దారుణ తపస్సు చెయ్యడానికి కారణం చెపుతాం విను. అతడు ముల్లోకాలను జయించాలని ఆకాంక్షిస్తున్నాడు. దేవతలను నాశనంచెయ్యాలని భావిస్తున్నాడు. వేదశాస్త్రాలనుమంటగలపాలని కోరుతున్నాడు. తన ఈ కోరికలు తీరేదాకా ఆతడు ఈ ఉగ్రతపం మానడు. దీనికి ప్రతీకారం నీవే ఆలోచించాలి.

నీవెలా తపోబలంచేత లోకాలను సృజించి సురేంద్రుల కంటె అధికమైన సిరినీ తేజాన్నీ గడించావో అలాగే తాను తపస్సమాధి మహిమతో ఈ విశ్వాన్ని నాశనంచేసి మరోవిశ్వాన్ని సృజించి బ్రహ్మపదం సాధించాలని వాంఛిస్తున్నాడు. అదీగాక కాలం నిత్యం ఆత్మ నిత్యం అలాంటప్పుడు తపోయోగంతో తాను కూడా నిత్యత్వాన్ని ఎందుకు సాధించ కూడదూ? అని ఆతని తలంపు. దేవా! నీ పదం ఉన్నతోన్నతమైనది. లోకాలకు ఐశ్వర్యం, విజయం, సౌఖ్యం, సంతోషం కల్పించేది. దానికి భంగం కలుగరాదు. కనుక నీవు దైత్యుని తపస్సును వారించి లోకాలను రక్షించు. అనుగ్రహించు

అని దేవతలు దీనంగా ప్రార్థించేసరికి స్వాయంభువుడైన చతుర్ముఖుడు మందర గిరికి వచ్చాడు. దక్షుడు, భృగువు మొదలైన ప్రజాపతులు, మహర్షులు కూడా వెంటనున్నారు. నిశ్చల తపోదీక్షలోనున్న రాక్షసేశ్వరుని చూచి కమలాసనుడు కలవరపడ్డాడు. ఆతని మెదడు మాంసం చర్మం, రక్తం చీమలు హరించి వేశాయి చుట్టూ పుట్టలు లేచాయి. గడ్డి పెరిగింది. వెదురు పొదలు అల్లుకున్నాయి. వాటి నడుమ నాతడు దట్టమైన మేఘ సమూహంలో ప్రవిష్టుడైన ఉష్ణకిరణుడులాగా ప్రకాశిస్తూన్నాడు. అలా మహోగ్రమైన తపోనిష్ఠతో ఉన్న రాక్షసేశ్వరుని చూచి బ్రహ్మ నవ్వుతూ అన్నాడు.

దానవేంద్రా! ఇంతకు ముందు ఈ విధంగా అత్యంత దారుణమైన తపస్సు చేసినవారెవ్వరూ లేరు. ఇక ముందు కూడా ఎవ్వరూ చేయలేరు. నీ తపస్సమాధికి నేను మెచ్చాను. నేను ప్రతిజ్ఞా పూర్వకంగా చెపుతున్నాను. నీ కోరికలేవో చెప్పు ఇస్తాను-లే.లే తపస్సు చాలించు. అడవి యీగలు గండు చీమలు నీ కాయాన్ను, రక్త మాంసాలను తినేశాయి, ఎముకలు మాత్రం మిగిలాయి. వెదుళ్లతోను, తృణ జాలంతోను గూడిన ఈ పుట్టలో అణుమాత్రం కూడా ఇంద్రియ పాటవం చెడకుండా ప్రాణాలు బిగబట్టి ఎలా ఉన్నావో? ఆశ్చర్యంగా ఉంది. అన్న పానీయాలు మాని ఈ రీతిగా నూఱు దివ్య సంవత్సరాలు శరీరంలో వాయువు లన్ని నిలిపి ఉంచడం సాధ్యమా? నాకు చాలా సంతోషంగా ఉంది. ఉగ్రతపంతో

నీవు నన్ను జయించావు. నా హృదయం కరుణా ప్రపూర్ణమైంది. నీ దగ్గరకు వచ్చాను. నీవు కోరిన కోర్కె లిస్తాను. అడుగు—అని పలికి బ్రహ్మదేవుడు రక్షోనాధుని జీర్ణ శరీరం మీద కమండలు జలాలు చల్లాడు. అమోఘమైన ఆ జలంతో శరీరం అంతా తడిసేసరికి హిరణ్యకశిపుడు మహోత్సాహంతో పులకించిపోయాడు. తపస్సు చాలించి వేణుచ్ఛన్నమైన పుట్టనుంచి వెలికి వచ్చాడు.

తపఃఫలితంగా అతనిలో జవసత్వాలు ఇనుమడించాయి. సౌందర్యం పెరిగింది. యౌవనం తొణికిసలాడుతోంది. శరీరం వజ్రతుల్యమైంది. అతని మైచాయ తప్తకాంచన వర్ణాన్ని తిరస్కరిస్తోంది. కన కనమని మండుతున్న ఎండుకట్టెల నుండి వెల్వడెడి జ్వలదగ్నిలాగా ఆఅసురుడు మహోజ్జ్వలంగా మెరిసిపోతున్నాడు. నలువైపులా కలయ జూచాడు. గగన తలాన హంసవాహనారూఢుడైన బ్రహ్మదేవుడు కనుపించాడు. అతని ఒడలు పులకించింది. కనులవెంట హర్షాశ్రువులు బొట బొటాకారాయి. చేతులు జోడించి వాగ్దేవీ హృదయాధినేతా మునిజన కామిత ప్రదాతా, అఖిల జగన్నిర్మాతా అయిన ఆ దేవ దేవుని ఏకాగ్రంగాచూస్తూ గద్గద స్వరంతో ఇలా అన్నాడు—

దేవా! నీవు సచ్చిదానందమయుడవు. ప్రళయసమయంలో అంధకారావృతమైన జగత్తును నిజతేజంతో ప్రకాశింపజేసెడి స్వయం జ్యోతివి నీవు. త్రిగుణాత్మకుడవై ముల్లోకాలను సృజించి, పెంచి, తుదకు సంహరించేది నీవే. నీవు ఆద్యుడవు, సర్వకారణుడవు మనస్సుతోను ప్రాణాలతోను, బుద్ధితోను, ఇంద్రియాలతోను కూడి కార్యరూపం ధరిస్తావు. నీకు నా ప్రణామాలు.

ప్రభూ. ఈ చరాచరాత్మక జగత్తు కంతటికీ సూత్రాత్మ రూపమైన ముఖ్యప్రాణానివి కనుక నీవు ప్రజాపతివి. మనస్సుకు, బుద్ధికి, చిత్తానికి, ఇంద్రియాలకు నీవు అధిపతివి. భూతకోటికి నీవు ఆధార భూతుడవు. వేదత్రయితోను, చతుర్హోత్రాలనెడి మంత్రాలతోను నీవు యజ్ఞాది కర్మలను ప్రవర్తింపజేస్తావు. నీకు నా కైమోడ్పులు.

సకల విద్యలు నీ తనువులు. సర్వార్థ సాధకులకు సాధనీయుడవు. ఆత్మనిష్ఠాగరిష్ఠులకు ధ్యానధ్యేయుడవు. ప్రాణికోటి ఆయుర్నాశం చేసెడి కాలమయుడవు నీవు. నీవు జ్ఞానవిజ్ఞాన మూర్తివి. ఆద్యంత రహితుడవు అంతరాత్మవు. త్రిమూర్తులకుమూలమైన పరమాత్మవు.జీవ లోకానికి జీవాత్మవు.సర్వం నీవే. నీవు కానిదేదీ లేదు. నీవు అవ్యక్తుడవు పురాణ పురుషుడవు. అనంతుడవు. కంటికగపడుచున్న ఈ సచరాచర జగత్తు అంతా నీ స్థూలశరీరం. ప్రాణేంద్రియ మనోబుద్ధి గుణాలను అంగీకరించి పరమేష్ఠిపదంలో ఉండి ఈ యీ స్థూలశరీరంతో

ఆయా విషయాలను అనుభవిస్తావు. నీకు నా నమస్కృతులు— అని దానవేంద్రు డింకా ఇలా అన్నాడు—

కరుణాకరా. నీలాగా అన్యులెవ్వరూ కోరిన వారి కోర్కెలు తీర్చలేరు నీవు నన్ను కరుణించి యిస్తానన్నావు కనుక కోరుతున్నాను విను. గాలిలోగాని నేల మీదగాని అగ్ని వలనగాని నీటియందుగాని ఆకాశమందుగాని దిక్కులందుగాని పగలు గాని రాత్రిగాని చీకటిలోగాని వెలుతురులోగాని నాకు మృతి కలుగకుండా వరం అనుగ్రహించు. మొసళ్లు మొదలైన జలజంతువుల వలనగాని సర్పాది సరీసృపాల వలనగాని చతుష్పాత్తులైన మృగాల వలనగాని దేవనరరాక్షసగణాలవలనగాని నాకు చావులేకుండా కటాక్షించు. రణభూమిలో ఏ శస్త్రాస్త్రంచేతను నాకుమృతిలేని జీవనం ఇప్పించు. యుద్ధంలో ఎదురులేని శౌర్యాన్ని లోకపాలకుల నతిక్రమించు మహి మాతిశయాన్నీ లోకత్రయ విజయాన్ని ప్రసాదించు అని హిరణ్యకశిపుడు కోరాడు.

ఆ వరాలు దుర్లభాలైనా అతని తపస్సునకు మెచ్చి విరించి (బ్రహ్మ) కరు ణించి యిచ్చి- నాయనా! కశ్యపాత్మజా. నీవు కోరిన ఈవరాలు దుర్లభాలు. ఇంతకు ముందెవ్వరూ ఎవ్వరినీ ఇలాంటివరాలు అర్థించి ఉండలేదు నీ యెడల ప్రసన్నుడనై నీవు కోరిన వరాలన్నీ ఇస్తున్నాను కాని ఒకమాట నీవు బుద్ధి వైభ వంతో నిపుణంగా ప్రవర్తించు నీ శ్రేయస్సుకు భంగం కలుగకుండా వ్యవ హరించు— అని చతుర్ముఖుడు హిరణ్యకశిపునకు అమోఘములైన వరాలిచ్చి అత నిచే పూజితుడై దేవగణం తనను సన్నుతిస్తుండగా నిజలోకానికి వెళ్ళాడు.

ఈ రీతిగా సురవిరోధియైన హిరణ్యకశిపుడు బ్రహ్మవలన అభీష్టవరాలు పొంది తన సోదరుని జంపినందుకు పగబట్టి ప్రతీకారేచ్ఛతో దుర్మదుడై శ్రీహరి యెడ వైరం పెంచుకున్నాడు. ఒకనాడు గంధర్వగణాలను బంధిస్తాడు. ఒకనాడు దివిజులను ధిక్కరించి తరుముతాడు. ఒకనాడు ఉరుముతూ ఉరగుల పైబడి వారిని పరిమారుస్తాడు. ఒకనాడు యక్షులను శిక్షిస్తాడు. ఒకనాడు విహగులను ఒడిసి పట్టుకుంటాడు ఒకనాడు గ్రహాలను కట్టివేస్తాడు. ఒకనాడు సిద్ధుల నోడించి చీకాకు పరుస్తాడు. ఒకనాడు మనుజుల మదం అణచివేస్తాడు. ఇలా అతడు దుస్సహమైన తేజంతో అనుదినం కిన్నరులను, ఖచరులను సాధ్యులను చారణు లను, విద్యాధరులను, ప్రేత భూత పిశాచాదులను సంహరిస్తాడు కంటబడిన వన్య మృగాలను కూడా నేలకూల్చనిదే నిద్రపోడు.

బురుజులతోగూడ కోటగోడలను నేలమట్టంచేసి రాక్షససేనలతో చుట్టు ముట్టి దిక్పాలకుల భవనాలను ఆక్రమించుకున్నాడు అతని ధాటికి అడ్డంలేదు. దిశలు, నిశలు, పవళ్లు ఆరాక్షసేశ్వరుని ఆజ్ఞావశలై దుర్దశలపాలై క్రుంగి కృశించి పోయాయి. ఇలా అతగాడు ముల్లోకాల్లోను గజగజలాడిస్తూ ఒకనాడు మహేంద్ర భవ

నం ఆక్రమించుకోవాలని కాంక్షించాడు. ఆ భవన వైభవం ఇంతా అంతా అని చెప్పడానికి వీలులేదు. దాన్ని దేవశిల్పి విశ్వకర్మ నిర్మించాడు.

దాని మెట్లు పవడాలతో కట్టబడ్డాయి కుట్టిమాలు (రాతికట్టడపు నేలలు) మరకత మణిమయాలు. స్తంభాలు వైడూర్య కలితాలు. గోడలు పున్నమి వెన్నెల లాగా తళతళ లాడుతూంటాయి. గడపలు, ముంజూరులు, కిటికీలు పద్మరాగ, వీరాలతో కాంచన కవాటాలతో మనోహరంగా ఉంటాయి. హంసతూలికా తల్పాలకు నలువైపుల ముత్తైపుసరులు వ్రేలాడుతూఉంటాయి. చిత్రవిచిత్రాలైన గోపురాలు కనువిందు చేస్తాయి. ఆ భవనం చుట్టూ ఎల్లవేళలా సువాసనలు గుబాళించే పువ్వులతోను పండ్లతోనుగూడిన నానావిధ తరులతా వితానాలతో తీర్చిన ఉద్యానాలూ, బంగారు తామరలతోను, చెంగలువలతోను నిండిన సరోవరాలు, రమణీయములైన రత్నప్రాసాదాలు ముచ్చట కొలుపుతూ ఉంటాయి. ఎల్వేళా సుగంధ శీతలమందమారుతాలు వీస్తుంటాయి. కోకిల కూజితాలతో చిలుకల రొదలతో ఎప్పుడూ కోలాహలంగా ఉంటుంది అంతెందుకూ త్రిలోకరాజ్యసంపద అంతా అక్కడే మూటకట్టినట్లుంటుంది.

రాక్షస రాజు ఒకనాడు నిరాఘాటంగా మహేంద్ర భవనంలో చొరబడి స్వర్గసింహాసనం అధిష్టించేసరికి హరి హర బ్రహ్మలుతప్ప మిగిలిన దేవతలు, యక్షులు, గంధర్వులు, కిన్నరులు, సిద్ధులు మొదలైన వారందరు భయావిష్టులై అతనికి కానుకలుపెట్టి సకలోపచారాలు చేశారు. ఏ దిక్పాలకునిపై ఈనాడు కినుక చెందుతాడో ఏ దేవుని బంధిస్తాడో ఏ విభాగంపై దాడిచేస్తాడో ఏ ప్రాణులను సంహరిస్తాడో అని ఇంద్రాది దేవతలు ప్రాణాలు అరచేతిలో పెట్టుకొని ఒడలు గగుర్పగా అతనివంక బిక్కు బిక్కుమని చూస్తూంటారు

అపుడు రాక్షసేంద్రుని కింకరులు- ఓ బృందారకులారా! సందడి చెయ్యకుండా ప్రభువులను సేవించండి. మునీంద్రులారా వచ్చి సార్వభౌములను దీవించండి ఫణీంద్రులారా. పడగలెత్తి నిక్కి నిక్కి చూడకండి. దిక్పాలకులారా! చేతులు జోడించి వినమ్రులై వెళ్లండి. గంధర్వులారా శ్రవణసుభగంగా పాడండి. అప్సరలారా నేత్రపర్వంగా నాట్యం చెయ్యండి. పెద్దగొడవ చెయ్యకండి. రాక్షసేశ్వరులు కప్పురపు తావిగల తీయని మైరేయం* త్రావి పారవశ్యంలో ఉన్నారు. వారి శాంతిని భంగించకండి— అని మాటిమాటికి హెచ్చరికలు చేస్తుంటే వారందరు కిమ్మనకుండా వారి ఆజ్ఞానుసారం ప్రవర్తిస్తారు

ధర్మనందనా ఇక నా దురవస్థచెపుతానువిను. రాక్షసేంద్రుడు మద్యపానం

---

* పొందు రసంలో చేసిన మద్యం

వలన మదంతో కళ్లజేవురించి తిరుగుడు పడుతూఉండగా లీలోద్యానాల్లో పూపొదరింట్లమాటున అంగనాజనంతో కేళీలోలుడై ఉన్నప్పుడు నేను (నారదుడు) తుంబురుడు అతనికి మనోల్లాసం కల్పించడానికి మృదుమధురంగా సంగీతం పాడేవాళ్లం. ఇంతలో ఎక్కడో ఎవరో యజ్ఞాలు చేస్తున్నారనే వార్త చెవినిబడగా అతడు తటాలున అక్కడకువెళ్ళి, హవిర్భాగాలం ప తానే గ్రహిస్తాడు. దేవతలకు కించిత్తుకూడా విడిచిపెట్టడు. ప్రకృతి గతమైన సమస్త భూతకోటి అతనికి కావలసిన భోగభాగ్యాలనిట్టే సమకూరుస్తాయి.

సకలద్వీప సమేతమైన భూమండలంలో దున్నకుండానే పంటలు పండుతున్నాయి. కల్పతరువు, కామధేనువులాగా గగనతలం అర్థికోర్కెలను వర్షిస్తోంది. నదీనదాలు, సప్తసముద్రాలు, తరంగ హస్తాలతో రత్నాలు తెచ్చి కానుక పెడుతున్నాయి. చెట్లు సకల ఋతుశోభతో అతన్ని సేవిస్తున్నాయి. పర్వత ద్రోణులు ఎల్లకాలం స్వచ్ఛజలపూర్ణాలై ఉంటున్నాయి. దానవరాజు అలాముల్లోకాలపై ఆధిపత్యం వహించి సకలలోకపాలకుల గుణాలన్నీ తానేగ్రహించియిష్టసుఖాలు అనుభవిస్తున్నాడు. అయినా జితేంద్రియుడు కాకపోవడంచేత అతనికి ఎంతకూ తృప్తిలేదు. బ్రహ్మవరంచేత గర్వోన్మత్తుడై అతడు శాస్త్రమార్గాన్ని అతిక్రమించి తనమాట శాసనంగా దీర్ఘకాలం రాజ్యపాలనం చేశాడు.

రాక్షసనాథుని దౌష్ట్యం భరించలేక మా కష్టాలు ఎప్పుడు గట్టెక్కుతాయి? దైత్యుని బాధలు ఎప్పుడు తొలగిపోతాయి? మాకు మా పూర్వవైభవం తిరిగి ఎప్పుడు ప్రాప్తిస్తుంది? మాకు రక్షకులెవ్వరూ?— అని దేవతలు, కిన్నరులు, సిద్ధులు, సాధ్యులు మునులూ వాపోతూ భవబంధ విమోచనుడూ, కమలలోచనుడూ అయిన శ్రీహరిని ఆశ్రయించడానికి నిశ్చయించుకొన్నారు. రహస్యంగా ఒకచోట గుమిగూడి— జగదీశ్వరుడైన రమాధవుడెక్కడున్నాడు? పరమ శాంతస్వభావులైన మునీంద్రులెక్కడకు వెళ్ళారు? వారి తిరిగీ రాకుండిరే? మేము అనన్యశరణ్యులం. జ్ఞానానందమయుడైన హృషీకేశుడొక్కడే మాకుదిక్కు— అని ఆహారనిద్రలుమాని అనన్యదృష్టితో సమాహితబుద్ధితో ముకుళితహస్తులై శ్రీహరిని అర్థించేసరికి ఆ దేవదేవుడు మేఘగంభీరస్వరంతో వారికి అభయ ప్రదానంచేస్తూ అదృశ్యంగానే ఉండి యిలా అన్నాడు—

సురేంద్రులారా. భయపడకండి. మీకు శుభం కలుగుతుంది. జయం లాభం ప్రాప్తిస్తాయి. రాక్షసుల దురాలాపాలు, దుశ్చేష్టలు నేనెఱిగున్నాను. తగిన కాలం వచ్చినపుడు నే నాతన్ని తుద ముట్టిస్తాను. మీరు మీ త్రోవను వెళ్ళండి. అత

---

* కొండలలోని పల్లపునేలలు

దెప్పుడు వేదశాస్త్రాలను, ధర్మాన్ని కాలదన్ని సాధువులను, దేవ గణాలను, గోవులను, బ్రాహ్మణులను హింసిస్తూ నాతో వైరం పెంచుకుంటాడో అపుడే ఆతడుని ఘాతుడు కాగలడని భావించండి.

ప్రహ్లాదుడాతని కన్న కొడుకు. అతడు మహా భక్తుడు. శమదమాది గుణ సంపన్నుడు. సర్వసమభావన గలవాడు. అతడేనాడా భాగవతోత్తముని రోషంతో నానా బాధల పాలు చేస్తాడో ఆనాడు నేనాతని పట్టి వధిస్తాను. బ్రహ్మ యిచ్చిన వరాలు కారణంగా అతడు మదోన్మత్తుడై మిమ్మల్ని బాధ పెడుతున్నాడు. నాకు తెలుసు. కాని ఆతన్ని తుద ముట్టించడానికి తగిన అదను ఇంకా రాలేదు. అంచేత సహించాను ముమ్ముందు వాని వధిస్తాను. మీకు సందేహం వద్దు. నేటికి వెళ్ళండి— అని రాక్షసాంతకుడైన శ్రీహరి నిర్దేశింపగా దేవతలు ఆ దేవ దేవునకు నమస్కరించి ఎన్నటికైనా రాక్షసుడు అంతం కావడం తథ్యమని భావించి తమ తమ నెలవులకు వెళ్లారు.

## ప్రహ్లాద చరిత్ర

హిరణ్యకశిపునకు నలుగురు కొడుకులు * పుట్టారు. వారిలో ప్రహ్లాదుడు పరమ భాగవతోత్తముడు. సకల ప్రాణులూ తన వంటి వారే అనెడి సమభావనతో అందటి హితాన్ని కాంక్షిస్తాడు. పెద్దలు కంటబడితే సేవకునిలా వినమ్రుడై చేతులు జోడిస్తాడు. మార్గ మధ్యంలో అన్యకాంతలు కనబడితే మాతృ భావంతో తప్పుకుంటాడు. తల్లి దండ్రుల్లాగా ధర్మ వాత్సల్యంతో దీనులను రక్షించడానికి అహర్నిశలు చింతిస్తాడు. సఖులను సోదరులుగా గురువులను దైవతాలుగా భావిస్తాడు. నవ్వులాటకైనా అనృత మాడడు.

అతడు మనోహరాకారుడు, కులీనుడు, విద్యాధికుడు, సకలైశ్వర్యసంపన్నుడు అయినా ఆతనిలో లేశ మాత్రం కూడా గర్వరేఖ లేదు. భౌతికములైన సకల సుఖాలు అతనికి అందుబాటులో ఉంటాయి. అయినా ఆతడు ఇంద్రియాధీనుడు కాడు. అతడు నిండుయవ్వనంలో ఉన్నాడు. బలానికి ప్రాభవానికి కొదవలేదు. అయినా కామంగాని రోషం గాని అతని దరికి జేరవు. మెఱపు తీగల్లాంటి మెలత తెండ్లో అనుక్షణం అతని కంటపడతారు. కాని అతడు స్త్రీ వ్యసనంలో ఎన్నడూ చిక్కుకొనడు. ప్రపంచంలో అతడు ఏది చూచినా ఏది విన్నా పరమార్థ

* ప్రహ్లాదుడు, అనుహ్లాదుడు, సంహ్లాదుడు, హ్లాదుడు—ఈ నలుగురు హిరణ్యకశిపుని కొడుకులు.

దృష్టితో చూస్తాడు, వింటాడు. అంతే కాని వస్తూ దృష్టితో చూచి దాని వెంట పడడు. రాక్షసేంద్రా దానవేంద్రుని పుత్రుడైన ప్రహ్లాదునకు నిరంతరం శ్రీహరి చింతనం తప్పితే అన్యచింతనం ఏమిన్నీ లేదు. అతడు సకల సద్గుణాకరుడు. సద్గుణాలన్నీ గుంపులు గుంపులుగా వచ్చి ఆతనిలో నిలిచి విడిచిపోవు. అతని విరోధులైన సురేంద్రులు కూడా సత్పురుషుల్లో ప్రహ్లాదుని వంటి సద్గుణవంతులను చూడబోమని కవీంద్రుల్లాగా వృత్తి బంధాలలో కీర్తిస్తారు. అలాంటప్పుడు మీలాంటి భగవద్భక్తులు ఆ దానవనాథుని పుత్రుని కీర్తించకుండా ఉంటారా? ప్రహ్లాదుడు సుగుణఖని. అతనిలోని గుణాలు అసంఖ్యాకాలు. * ఎంత గడువిచ్చినా బృహస్పతికి, భాషాపతికి[1] ఫణిపతికి[2] కూడా వాటినిలెక్కించడంసాధ్యం కాదు ప్రహ్లాదుడు సహజ భాగవతోత్తముడు. పుటుకతో వచ్చిన ఆతని భక్తి పరిణతమైనదవడం చేత, అతడు శ్రీహరి నిత్య సాంగత్యంలో సౌఖ్యం సోలుతూ ఉంటాడు శ్రీహరి తనను జేరినప్పుడు అతనికి తన చెలికాండ్రను జేరాలనే స్పృహ ఉండదు. లక్ష్మీధవుడు తన యెదుట ఆడుతూ పాడుతూ ఉంటే అతడు అలాంటి అసుర బాలకులతో ఆడడం మరచి పోతాడు. సరసిజాక్షుడు తనతో సంభాషిస్తుంటే ఇతరుల మాటలేవీ ఆతని చెవిని బడవు. తనతో శ్రీ విష్ణువుని వీక్షిస్తే ఆతడు తన్మయుడై అన్యమేదీ వీక్షింపడు. శ్రీహరి చరణ కమలామృతంతో అతని అంతరంగం నిండి పోతే అతడు నిత్య పరిపూర్ణుడై సమస్తం మరచి సహజంగా జడత్వం లేక పోయినా జడుడులాగా నిశ్చేష్టుడై ఉంటాడు.

తింటూన్నా, త్రాగుతున్నా, మాట్లాడుతున్నా, నవ్వుతున్నా, ఆడుతూన్నా, నిద్రిస్తున్నా, తిరుగుతూన్నా, చూస్తూన్నా ఆతడు నిరంతరం నారాయణ పాద కమల చింతనామృత పానంచేస్తూ సమస్త విశ్వాన్నీ మరచి పోతాడు అనుక్షణం శ్రీహరి ధ్యానంలో మునిగి తేలుతూ చేష్టలుడిగి ఏకాంతంగా ఒక చోట ఏడుస్తూ ఉంటాడు. నిరంతరం శ్రీహరిని భావిస్తూ పారవశ్యంతో ఒక చోట ఎలుగెత్తి పాడుతూ ఉంటాడు. 'విష్ణువంటే ఇంతే. వేరేమిలేదు' అని సంతోషం పట్టలేక ఒక ప్రక్కకు మెత్తిగిలి నవ్వుతుంటూ ఉంటాడు పద్మాక్షుడను పెన్నిధిని చూచానని ఉబ్బిపోయి ఒక చోట గంతులు వేస్తుంటాడు ఒక చోట పరమేశ్వరుని పలకరించి సంభాషిస్తాడు ఒక చోట ఆనందాశ్రువులు రాలుస్తూ పులకించి పోతూ అరమోడ్పు కనులతో నిలిచి మౌనంగా ఉంటాడు

గత జన్మల్లో అలాంటి భాగవతులను సేవించడం వలన అతనికి ఈ జన్మలో బాల్యం నుండి హరిభక్తి వస్తువడి ప్రవృద్ధమైంది. అతనిలో మోక్ష

---

1. ఆదిశేషుడు 2. బ్రహ్మ.

భావన విస్తరిల్లింది. దుర్జన సాంగత్యం కారణంగా ఆతడు తన మనస్సును అన్యాయమార్గానికి పోనీయకుండా నిగ్రహిస్తాడు. అతడెప్పుడూ అప్రమత్తంగా ఉంటాడు. సంసార బంధంలో కాలుపెట్టడు సాధువుల యెడ విధేయుడుగా ఉంటాడు. కర్మబంధాలకు కట్టుపడడు. గుణగరిష్ఠుడు. పరమ భాగవత శ్రేష్ఠుడు. అలాంటి పవిత్ర చరిత్రుడైన కొడుకు మీద పగపట్టి హిరణ్యకశిపుడు కరుణా దూరుడై అతన్ని వధించడానికి ఆజ్ఞాపించాడు—అని నారదుడు చెప్పేసరికి ధర్మరాజు విస్మితుడై ,

మునీంద్రా ఆశ్చర్యంగా ఉన్నదే! కొడుకులు నేర్చినా నెరకపోయినా తండ్రులు వారిని ప్రాణసమంగా చూస్తారు. స్నేహభావంతో బుద్ధిచెప్పి చెడుదారి నుండి మళ్ళిస్తారు. అంతేకాని వైరం వహించరు. అందులో ప్రహ్లాదుడు సామాన్య బాలుడా. సద్గుణ సముద్రుడు. సాధుశీలుడు. ప్రతిభావంతుడు. నిరంతర హరిచరణ ధ్యాననిరతుడు. సాధువులను గురువులను వినయభావంతో ఎప్పుడూ సేవిస్తాడు. సభ్యజనులు అతని శీలాన్ని సన్నుతిస్తుంటారు. కృపాళుడు. నిర్మల మనస్కుడు. మోహదూరుడు. అలాంటి గుణరాశియైన కొడుకును తండ్రియే చంపడానికి పూను కొనడం ఏమిటి? సవివరంగా ఆ వృత్తాంతం వినాలని కుతూహలంగా ఉంది— అనేసరికి నారదుడిలా చెప్పడం మొదలుపెట్టాడు.

ధర్మనందనా. విను. ప్రహ్లాదుని ప్రవర్తన చూచి దైత్యేంద్రుడు తన మన స్సులో— వీని బుద్ధి మందగించింది నేను సురరాజపదం అధిష్ఠించాననే జ్ఞానం కూడా వీనికిలేదు. ఏమేమో అంటాడు. విద్యాభ్యాసంచేతగాని వీనికి బుద్ధి నైశిత్యం రాదు- అని భావించి ఒకనాడు కొడుకును పిలవనంపి- నాయనా! చదువనివాడు జ్ఞానశూన్యుడౌతాడు, చదివితే "ఇదిమంచి ఇదిచెడు" అని తెలిసికోగల నైపుణ్యం ప్రాప్తిస్తుంది. అంచేత మానవుడు తప్పక చదువుకోవాలి. నిన్ను గురువులదగ్గఱ చదివిస్తాను. చదువు-అన్నాడు.

అసురాచార్యుడైన శుక్రుని కుమారులు చండామర్కులు మహామేధావులు. దైత్యేంద్రుడువారిని వెంటనే రప్పించి- ఆచార్యులారా! వీడు జ్ఞానహీనుడై గ్రుడ్డి వానిలాగా ఉన్నాడు. నా ప్రతాపం వీనికి అణుమాత్రంకూడా తెలిసినట్లులేదు. మీరు గురువులు, కరుణాసముద్రులు. మాకు ఆత్మీయులు మాన్యులు పెద్దలు. కనుక మా మాటవిని ఈ బాలకునకు చదువుచెప్పండి. గ్రంథాలు చదివించండి. నీతివంతునిచేసి వీనిని రక్షించండి— అని వారికి ప్రహ్లాదుని అప్పగించి తీసికొని వెళ్ళమన్నాడు. వారున్నూ ప్రభువు నాదేశానుసారం ప్రహ్లాదుని వెంటబెట్టుకొని వెళ్ళారు. అతని ఈడువారైన కొందఱి బాలురను సహశ్రోతలుగా[1] సమ కూర్చారు.

---

[1] ఒకనితోపాటు వినేవారు.

రాజ సౌధానికి దగ్గఱగా ఒక యింట్లో శుక్రకుమారులు రాకుమారునకు చదువదగిన శాస్త్రాలెన్నో చెప్పారు. ఆ కుమారకుడున్నూ గురువులు చెప్పినవన్నీ శ్రద్ధగావిని పఠించాడు. కాని అతనికి సహజంగా ప్రాప్తించిన విష్ణుభక్తిమాత్రం అణుమాత్రం కూడా తగ్గలేదు. వారు ఎవిధంగా చెపితే ఆ విధంగా చదివేవాడు. కాని వారు చెప్పేదంతా పట్టిమిథ్య అనే స్థిరచిత్తంతో వారితో వాదానికి దిగేవాడు కాడు. వారిని అక్షేపించేవాడుకాడు. కొడుకును నీతికోవిదుని చెయ్యాలనే ఆతురతతో రాక్షసేంద్రుడు ఆతని శుక్రుల దగ్గఱకు పంపాడేకాని అతనెకున్న సందేహం అతనికి ఉండనే ఉంది.

అంచేత కొన్నాళ్ళయ్యాక అతడు గురువులు కొడుకునకు ఏ విధంగా బోధిస్తున్నారో వాడు ఏమి చదువుతున్నాడో తెలిసికోవాలని కుతూహలపడ్డాడు. అతన్ని రాజసౌధానికి తీసికొనరమ్మని శుక్రులకు వర్తమానం పంపాడు. ఆ వర్తమానం విని ప్రహ్లాదుడు రాగా రాక్షసనాథుడాతనికి ఇలా అన్నాడు—

తండ్రీ! నీ చదువు ఉత్సాహ ప్రభుమంత్రశక్తియుతమై చక్కగా సాగుతున్నదా? జ్ఞానవంతుడవయ్యావా? వేదాలూ శాస్త్రాలూ బాగాఅభ్యసించావా? ఏదీ? ఇలారా. అని వాత్సల్యంతో దగ్గఱకు తీసికొని ఒడిలో కూర్చొబెట్టుకున్నాడు. అతన్ని బుజ్జగిస్తూ— నాయనా. తండ్రులకు తనయుల సంభాషణములు అనుదినం సంతోషాన్ని కలిగిస్తాయి. శ్రమను తాపాన్ని, దుఃఖాన్ని పోగొట్టుతాయి. వారి మాటలు తల్లిదండ్రుల చెవులకు అలంకారప్రాయాలు నీకేది శుభంగా తోస్తోందో చెప్పు— అని అడిగేసరికి ప్రహ్లాదుడు తండ్రికి ఇలా అన్నాడు.

రాక్షసేంద్రా! ఇల్లు చీకటి నూతిలాంటిది. దేహధారులందులోపడి కొట్టుకొనడం మౌఢ్యం. మనశ్చాంచల్యంతో "మీరు-నేను" అనెడి భిన్నభావం వహించి వర్తించడం తగదు. కంటికిగోచరించెడి సమస్తమూ విష్ణుకళా సమన్వితమని గ్రహించి ఆ దేవదేవుని నిరంతరం. మనస్సులో ధ్యానిస్తూ అడవుల్లో ఏకాంతంగా ఉండడంమేలు— అని కొడుకు దానవ విరోధియైన శ్రీహరి పక్షంవహించి మాట్లాడేసరికి హిరణ్యకశిపుడు నవ్వు హ హ ఔను. పిల్లలేముందీ? ఎవరెట్లా ఆడిస్తే అలా ఆడతారు. బెదరించి ఎవ్వరితని శత్రుపక్షం పట్టించారో అని భావించి యిలా అన్నాడు.

నా తండ్రీ. ఇదా నీవు చదివింది? నాకు చోద్యంగావుంది ఈబుద్ధి నీకే పుట్టిందా? ఇతరులెవరైనా నీకు ఈదుర్నీతులు బోధించారా? లేక శుక్రులే రహస్యంగా నీకు ఈచదువులు చెప్పారా? శ్రీహరి రాక్షసులయెడ మహాపరాధంచేశాడు. అలాంటి వానిని కీర్తించడం నీకు తగదు. సురలను తరివేయడమో. సురాధిపతులను

శుష్కింప జేయడమో! సిద్ధులను వేధించడమో! మునులను బాధించడమో! యక్షులు, కిన్నరులు, గంధర్వులు, పక్షినాథులు, నాగేంద్రులు మున్నగువారిని నిర్మూలించడమో! చెయ్యాలికాని మోహాంధుడవై హరిని స్మరించి చెడిపోవడం తగదు— అని తండ్రి చెప్పేసరికి ప్రహ్లాదుడు గురువులవంక చూచి యిలా అన్నాడు-

స్వపర భేదభావం మాయాకల్పితం. అది చెడ్డది. జ్ఞానులైన వారు ఎవని యందు తత్పరత్వం వహించి అలాంటిభేదభావాన్ని దరిజేరనీయరో ఆ పరమేశ్వరు నకు నా నమస్కారాలు. సర్వాత్మకుడైన శ్రీహరి జ్ఞానబలంచే పొందదగినవాడు. జ్ఞానహీనులు కొందఱు మాయావశులై భేదబుద్ధితో సముచితమైన రీతిని సంభా వింపలేరు. బ్రహ్మాది వేదవిదులకుకూడా జిజ్ఞాసా*పథం దురవగాహం అలాంట ప్పుడు ఇతరులు పరమాత్ముడైన విష్ణుని తెలిసికోగలరా? బ్రాహ్మణోత్తములారా! సూదంటురాయిచే ఇనుం ఏ విధంగా ఆకర్షింపబడుతుందో అదేవిధంగా శ్రీహరి సాన్నిధ్యంలో దైవయోగంచేత నా మనస్సు ఇట్టే ఆకృష్టమౌతోంది. అందులో అసహజమైన దేమీలేదు.

మందరాల క్రొందేనియల తియ్యందనానికి తేలిసోలెడి తుమ్మెద ఉమ్మెత్త పూవును కన్నెత్తి చూస్తుందా? స్వచ్ఛమైన ఆకాశగంగా తరంగాలలో విహరించెడి రాయంచ సెలయేటి కోసం పలవరిస్తుందా? లేమామిడి చివుళ్ల తిని మైమరచెడి కోయిల కొడిసె చెట్లకడకు పోతుందా? నిండుపున్నమి వెన్నలకు పులకించెడి జక్కవపక్షి మంచుతెరలను వాంఛిస్తుందా? వినుతశీలుడవైన విప్రోత్తమా! వేయిమాటలెందుకూ? శ్రీహరి పాదకమల ధ్యానమనెడి అమృతం ద్రావి మత్తి ల్లిన చిత్తం అన్యాయత్తం ఎన్నడూ కాజాలదు- అనేసరికి పురోహితుడు పట్టరాని కోపంతో ప్రహ్లాదుని చూచి తిరస్కారపూర్వకంగా ఇలా అన్నాడు-

ఏమీ? నీకింతకు అయిదేండ్లయినా నిండలేదు. ఇంతకూడాలేవు. తర్క వాక్యాలు పలుకుతున్నావే! మేం చెప్పిన శాస్త్రార్థాలన్నీ ఏమయ్యాయి? వాటిలో ఒక్కటీ చెప్పవేం? దానవేంద్రుని ముందు మాకు తలవంపులు కలిగించడానికి కాకపోతే నీవు సురవైరియైన శ్రీహరిని భూషిస్తావా? నీ వంశానికి మచ్చతెస్తావా? ఇతడు రాక్షసనాథునకు కొడుకు కాడు. రాక్షసజాతి యనెడి చందన వనంలో ముండ్లచెట్టులాగా చెడబుట్టాడు. నిరంతరం రాక్షసాంతకుడైన రమాధవుని కీర్తిస్తూ ఉంటాడు. మా బోధలు వీని చెవికెక్కవు. దండనంతోగాని దారికిరాడు. పట్టు కొని కొట్టండి- అని నిశాచరేంద్రుని చూచి- ప్రభూ నీ పాదాలపై ప్రతినబూని

* తెలిసి కోవాలనే కోరిక.

చెపుతున్నాం. మా తెలివితేటలన్నీ ధారపోసి వీనిని ఇంకా చదివిస్తాం. కోపిస్తాం. దండిస్తాం. ఉపాయంగా వీని నెలాగైనా దారికి తీసుకొనివస్తాం. మాపై కోపించకు- అని శుక్రసుతుడు ప్రహ్లాదుని ప్రభు సన్నిధినుండి తీసికొనివెళ్లాడు.

ఒంటరిగా కూర్చుండబెట్టి అన్యమార్గం త్రొక్కకుండా మంచిబుద్ధులవడే లాగా ఆచార్యుడతనికి ధర్మార్థకామాల విశిష్టత్వాన్ని వివరించి నూరిపోశాడు. సామదానభేద దండోపాయాలన్నీ సాకల్యంగా చక్కగా బోధించాడు. ఇక నాతడు నీతిపారగుడయ్యాడని విశ్వసించాడు. ముందు తల్లిదగ్గఱకు తీసికొనివెళ్లాడు. ఆమె ఆతని ముద్దాడి నానావిధ మణిభూషణాలతో అలంకరించింది. అపుడాచార్య పుత్రుడు అసురేంద్రనందనుని చూచి- నాయనా! మేము నీకు చెప్పిన వానిని తారుమారుచేయకు. ధర్మార్థకామాలను గూర్చి మేము నీకు బోధించిన పాఠాలను పెడదారిని పట్టించకు. రాక్షసేంద్రుని యెదుట మేము నీకు ఏమిచెప్పామో అవే చెప్పు. కాని వైరిశాస్త్రాలు విప్పకు. దోషభూయిష్ఠాలైన విష్ణుగాథలను ఏకరువు పెట్టకు- అని బుజ్జగించి వానిని ప్రభుసాన్నిధ్యానికి తీసుకొనివెళ్లాడు.

హరిభక్తి అతనిలో మూర్తీభవించింది. అలాంటి భక్తి బ్రహ్మాదులకు కూడా అలవడలేదు. మాతృగర్భంలో ఉన్నప్పటినుండీ ఆతని చిత్తం హరి పరాయత్తమైంది. అడుగడుగునా మాధవచింతనామృత మధురిమకు ఆతడు మైమరచిపోతూంటాడు. సమస్తవిశ్వం విష్ణుమయమని గ్రహించిన ధీశాలి. వినయం, కారుణ్యం, బుద్ధి, వివేకం మొదలైన సల్లక్షణాలకు అతడు ఆటపట్టు. రాజసమక్షానికి రాగానే ఆచార్యుడాతనిని ముందుకు త్రోసి తండ్రికి నమస్కరించమని చెప్పి యిలా అన్నాడు.

రాక్షసాధీశ్వరా! వీనిని విశిష్టమైనమార్గంలో శిక్షించాం. వైరిపక్షంమాని వీడు నీతిపారంగతుడయ్యాడు. వీని విద్యాప్రాభవాన్ని పరీక్షించు- అని గురుసుతుడు విన్నవించేసరికి దనుజేంద్రుడు తనకు పాదాభివందనంచేసి ప్రక్కగా నిలబడిన కొడుకును గాఢంగా కౌగిలించుకుని దీవించాడు. ఒడిలో కూర్చోబెట్టుకున్నాడు. జుట్టుదువ్వాడు గడ్డం పుడికి పుచ్చుకున్నాడు. చెక్కిళ్లు ముద్దుపెట్టుకున్నాడు. శిరం మూర్కొన్నాడు. ప్రేమాతిశయంచేత స్రవించిన అశ్రుజలంతో అతని ముఖాన్ని తడిపివేశాడు. మృదుమధురోక్తులతో ఇలా అన్నాడు-

నాయనా! నిన్నుచూచి చాలకాలం గడిచింది. నాకే చోద్యంగా ఉంది. నీకు గురువులు తెలిసికోదగిన యేయేవిషయాలను ఏరీతిగా బోధించారో! విద్యల యొక్క సారం నీకు అవగతమైనదో లేదో! పరీక్షించి తెలుసుకోవాలనుకుంటున్నాను. నీకు తెలిసిన శాస్త్రాల్లో ఒకపద్యం చెప్పి అర్థతాత్పర్యాలు చెప్పు. నీతోటి రాక్షసబాలకులు నీ నీతిశాస్త్ర ప్రతిభను మెచ్చుకోరు. వారు సమస్తవిషయా

లను ఆకళింపు చేసుకున్నారు. గ్రంథార్థాలన్నీ సమర్థంగా చెప్పగలరు. నీవెప్పుడు నీతిపారంగతుడౌతావో! అని వేయికండ్లతో ఎదురుచూస్తూ న్నాను. ఏదీ! నీ ప్రతిభను చూపించు- అనిన కన్నతండ్రికి ప్రహ్లాదుడిలా అన్నాడు.

తండ్రీ! నన్ను గురువులు చదివించారు. ధర్మశాస్త్రం, అర్థశాస్త్రం క్షుణ్ణంగా చదివాను. అవేకాదు నేను చదివిన శాస్త్రాలు ఇంకా ఎన్నో ఉన్నాయి. అన్ని చదువుల్లోని మర్మం తెలిసికొన్నాను. భక్తిమార్గాలు తొమ్మిది ఉన్నాయి. మనోవాక్కాయలతో శ్రీహరి చెలిమి చెయ్యడం, శ్రీహరి కథలు వినడం, సేవించడం, నమస్కరించడం, పూజించడం, దాస్యం చెయ్యడం, ఆత్మలో ఎఱుక గలిగి ఉండడం, కీర్తించడం, ధ్యానించడం- ఇవీ ఆ నవవిధ భక్తిమార్గాలు. ఈ మార్గాలను ద్రొక్కి మాధవుని నమ్ముకొని సజ్జనుడై యుండడం భద్రమని నే భావిస్తాను. ఇది సత్యం.

గ్రుడ్డివానికి చంద్రోదయం, చెవిటివానికి శంఖధ్వని, మూగవానికి గ్రంథాఖ్యాపనం, నపుంసకునకు వధూకాంక్ష, కృతఘ్ను నకు బాంధవ్యం, బూడిదలో ఉంచిన హోమద్రవ్యం, లోభి అర్థసంపదా, పందికి అందించిన సుగంధవస్తువుగా నిరర్థకాలు. అలాగే భక్తిహీనుని జీవితం శూన్యం. నిష్ప్రయోజనం.

చేతులున్నందుకు శ్రియఃపతిని పూజించాలి. నాల్క ఉన్నందుకు నళిననేత్రుని కీర్తించాలి. కన్నులున్నందుకు పన్నగశాయిని చూచి ఆనందించాలి. చెవులున్నందుకు శ్రీహరి గాథలు వినాలి. మనసున్నందుకు మధువైరియందు నిమగ్నం చెయ్యాలి. బుద్ధి ఉన్నందుకు పురుషోత్తమునిమీద నిలపాలి, పాదాలున్నందుకు పరమేశ్వరునకు ప్రదక్షిణాలు చెయ్యాలి. అపుడే వాటి సార్థకత. అలాగే దేవదేవుని చింతనంలో గడపిన దినమే దినం. చక్రపాణిని వ్యక్తంచేసెడి చదువే చదువు. పరమేశ్వరునిగూర్చి బోధించెడి గురువే గురువు. రమాధవుని చేరమనియెడి తండ్రియే తండ్రి.

పరమేశ్వరుని సేవకు వినియుక్తంకాని శరీరం గాలినింపిన తోలుతిత్తి కాని శరీరంకాదు. వారిజాక్షుని పొగడని నోరు ఢమ ఢమమని మ్రోగెడి ఢక్కగాని నోరుకాదు. శ్రీహరిని పూజింపని చెయి కొయ్యతోచేసిన తెడ్డుకాని చెయ్యికాదు. వెన్నుని చూడని కన్నులు శరీరమను గోడయందలి గవాక్ష రంధ్రాలుకాని కన్నులు కావు. చక్రహస్తుని చింతించని జన్మ క్షణ భంగురమైన నీటి బుడగగాని జన్మ కాదు. విష్ణుభక్తిలేని విబుధుడు పాదాలుగల పశువుకాని విబుధుడుకాడు.

శ్రీహరి దాస్యమనెడి పెనుగాలి లేక సంసారమను మేఘసముదాయం విచ్చిపోతుందా? విష్ణుసేవయనెడి అమృత వర్షంలేక తాపత్రయా[1]లనెడి దావాగ్నులు[2]

1 ఆధ్యాత్మికం, ఆధిభౌతికం, ఆధిదైవికం- తాపత్రయం 2 కార్చిచ్చులు

ఆటిపోతాయా? పరమాత్ముని యెఱుక యనెడి బడబాగ్ని లేక పాపసముదాయ మనుపయోనిధులు* ఇంకిపోతాయా? భగవన్మూర్తియనెడి సూర్యకాంతిలేక మహాపద లను కాఱుచీకట్లు అడగిపోతాయా? కోదండపాణి చింతనం అనెడి అంజనం లేక పునర్దర్శనంలేని ముక్తియనునిధి బ్రహ్మదేవునకైనా కనబడుతుందా?— అని ప్రహ్లా దుడు జంకూకొంకూ లేకుండా నిర్భయంగా తన మనోభావాలు తండ్రికిచెప్పాడు.

ఆ మాటలు రాక్షసేంద్రుని చెవులకు ములుకుల్లాగా తోచాయి. కోపంతో ఆతనీ కణతలు అదిరాయి. పెదవులు కొఱుకుతూ గురుపుత్రుని వంక చుర చుర చూచి "విప్రుడా! ఎంతటి విద్రోహానికి ఒడిగట్టావూ?" అని అదిరిపడి యిలా అన్నాడు. సకలశాస్త్రాలు నూరిపోసి ఈ నిసువును నీతిపారంగతుని చేస్తానని ఆనాడు తీసికొనివెళ్ళి కుటిలభావంతో వానికి తగని వైరికథలు చెప్పావా? భృగు శ్రేష్ఠుడవని నమ్మి వంచితుడనయ్యాను. పైకి బ్రాహ్మణాకృతిలో ఉన్నావుకాని నీవు నిక్కపు బ్రాహ్మణుడవా? పాపకర్మలను మర్మచ్ఛేదకాలైన వ్యాధులు పీడిం చునట్లు అధర్మవర్తనులూ, దురాలోచనా పరులూ అయినవారిని పాపాలుపట్టి పీడి స్తాయి— అనేసరికి పృథివీశునకు పురోహితుడిలా అన్నాడు.

దానవేంద్రా! మా వలన అణుమాత్రం కూడా తప్పులేదు. నీ కుమారునకు మేము విరోధి శాస్త్రాలు చెప్పం. మేమేకాదు పరులెవ్వరూ కూడా క్రౌర్యంతో అలా చెప్పరు. మీ పాదాలాన. వీనికి ఇదంతా సహజంగా వచ్చిన జ్ఞానం. వీనికి చెప్పెడి పాటి వారెవ్వరూలేరు కనుక వీని బుద్ధి మార్చడానికి ప్రతియత్నం చెయ్యండి- అని గురునందనుడనేసరికి రాక్షసనాథుడు కొడుకు నుద్దేశించి— గురు వులు చెప్పని ఈ చదువు నా కడుపున పుట్టిన నీకు ఎవరు చెప్పారో చెప్పు- అని హెచ్చరించగా తండ్రికి ప్రహ్లాదుడిలా అన్నాడు—

తండ్రీ! హరిభక్తి ఇతరులెవ్వరో చెపితే వచ్చేదికాదు. అజ్ఞానమనెడి కారు చీకటిలో కొట్టుమిట్టాడుతూ సంసారలంపటులై ఇంద్రియ సుఖాలువదరగి ఎడతెగ కుండా చస్తూ పుట్టుతూ ఉండేవారికి హరి ప్రబోధాలు నిజేచ్ఛనైనా, పరులు చెప్పినా, అడవులకు వెళ్లినా లేక ఏ మిచ్చినా అలవడవు. కానని వాని సాయంతో కాననివాడు వస్తుజాలాన్ని చూడలేనట్లు కర్మాచరణం చేస్తూ ఆ కర్మంచే బద్ధులైన వారు విష్ణువును చూడలేరు. హరిభక్తుల పాదధూళిని ఔదల (తల) ధాల్చి కర్మబంధంనుండి విడివడిన ఏ కొలది మంది మహానుభావులకో శ్రీహరి సందర్శన భాగ్యం లభిస్తుంది.

దానవేంద్రా! వేయిమాటలుదేనికి? సకలశాస్త్రాలూ తఱచిచూచాను. సంసా రం అంతులేని మహాఘోరమైన సముద్రం లాంటిది ఆ సంసార సముద్రంతో దార

---

* సముద్రాలు

సుతాదులు చేపల్లాంటివారు. నానావిధాలైన వాంఛలూ, ఈర్ష్య, క్రోధం, మదం, మోహం మొదలైనవి ఉత్తుంగతరంగాలు. విశాలమైన ఆ సముద్రాన్ని ఎవడైనా శ్రీహరి భక్తియనెడి నావ సాయంతో దాటగలడుగాని దుర్మేధతో దాటలేడు— అని ప్రహ్లాదుడు నిర్భయంగా పలికేసరికి హిరణ్యకశిపుడు మహోగ్రుడయ్యాడు. నిర్దయగా అతణ్ణి తనతొడపై నుండి క్రిందికి త్రోసివేశాడు. కనులవెంట నిప్పులు కురిపిస్తూ మంత్రులను రాక్షసవీరులను వుద్దేశించి యిలా అన్నాడు—

వరాహ రూపంతో తన పినతండ్రిని జంపిన హరిని క్రోధించడు. పైగా అతని పక్షంవహించి బంటులాగా అతనికి దాస్యంచేస్తు మనస్సులో నిరంతరం అతనినే ధ్యానిస్తూ ఉంటాడు. వీడుచావనైనా చావడే. నాకు మనోవ్యథ కల్పిస్తున్నాడు. నాపై వైరం వహించాడు. ఇలాంటి జనకద్రోహిని మీరు ఎక్కడైనా చూచారా? అయిదేండ్లు నిండాయోలేదో తండ్రినైన నన్ను ధిక్కరించి అణుమాత్రమైనా భీతిలేకుండా నాకు పరమ శత్రువైన కేశవుని కీర్తిస్తున్నాడు. వద్దని వారించినా వినడు. నా శరీరం నుండి పుత్రాకారంలో పుట్టినవ్యాధి వీడు. మీమీ ప్రతాపం చూపి వీనిని వధించి రండి.

వీడు మూర్ఖుడు. కులద్రోహి, దుస్సంగుడు, కేశవపక్షపాతి, నీచుడు. వీనిని ఉపేక్షించరాదు. శస్త్రవైద్యుడు అవయవసమూహంలో దుష్టావయవాన్ని ఖండించి మిగిలిన అవయవాలను రక్షించునట్లు వీనిని చంపించి వీరవ్రతులుపొందెడి మహావిఖ్యాతిని వహిస్తాను. వంశాన్ని దోషరహితం చేస్తాను. మీరేమీ సందేహించకండి. వీడు వధింపదగినవాడు. కనికరించి వీనిని రక్షించడం తగదు. వెంటనే వీనిని యమసదనానికి పంపిరండి— అని దానవేంద్రుడు ఆజ్ఞాపించేసరికి వాడికోఱలు గల రాక్షసవీరులనేకులు శూలాలుదాల్చి నోళ్లుతెఱచి ఉత్సాహంతో 'చీల్చండి; నఱకండి' అని పెడ బొబ్బలు పెట్టడం మొదలుపెట్టారు. రాగితీగల్లాంటి వారి జుట్టు పొగతో గూడిన కార్చిచ్చులాగా మెఱుస్తోంది. వారందఱందఱు భీకరాకారులు. కర్కశ హృదయులు.

"ఇతడు పసివాడు. రాచబిడ్డ. దయాళువు. సాధువు, లోకవంద్యమైన నడవడి గలవాడు. వీనిని వధించడం తగదు"— అని యే మాత్రం వితర్కించక క్రూరాత్ములై నోటికి వచ్చినట్లు తూలనాడుతూ శూలాలతో అతనిని పొడవడం మొదలుపెట్టారు. తండ్రిచూస్తూ ఊరకున్నాడు. ఊరకుండు. పలకడు. వద్దనడు. రాక్షసులందఱు ఒక్కుమ్మడిగా అతనిపై విజృంభించి శూలాలతో పొడిచినా అతని శరీరం యథాతథంగానే ఉంది. కాని గాయపడలేదు. నెత్తురు స్రవించలేదు. ఎముకలు కందలేదు. దృష్టి నశించలేదు. ముఖకాంతి తగ్గలేదు. అతనికి లేశమాత్రం కూడ బడలిక కలుగలేదు. దైన్యం గోచరించలేదు.



రాక్షసయోధులు తననుపొడుస్తూంటే ప్రహ్లాదుడు "ఓ పన్నగశాయీ! ఓ రాక్షసాంతకా! ఓ లోకేశా! ఓ ఆపన్నశరణ్యా! ఓ నిఖిలపావనా!" అని అఖిలాత్మకుడైన శ్రీహరిని సన్నుతిస్తాడేకాని కనులవెంట శోకాశ్రువులు కార్చడు. భయకంపితుడుకాడు. లేచి అటూఇటూ పారిపోడు. చేతులు అడ్డం పెట్టడు. పోయి బంధుసమూహంలో దూరడు. ఇదేమి ఘోరమని తండ్రిని నిందించడు. స్నేహితులను పిలువడు. తల్లిఉన్న స్వర్ణసౌధంలోనికి వెళ్లడు. కష్టపడడు. కంటగించుకోడు. కాపాడండని ఎవరినీ అర్థించడు.

సర్వాత్మకమై యిలాంటిది అలాంటిది అని నిర్దేశించడానికి వలను పడని పరబ్రహ్మమందు తాదాత్మ్యంచెంది మహానందంచే మైమఱచియున్న ప్రహ్లాదునిమీద తన కింకరులుచేత చేయించెడి మారణకృత్యాలు పాపకర్మునిమీద చేసిన సత్కారాల్లాగా నిష్ఫలమవడంచూచి రాక్షసేంద్రుడు విస్మయంచెంది— ఔరా. రాక్షస వీరులు శూలాలతో శరీరాన్ని నిగ్రహిస్తూ ఉంటే వీడు నేలపై పడడే! పారిపోడే! ప్రాణాలువిడువడే. పోనీ తండ్రినైన నా దగ్గఱకువచ్చి శ్రీహరిపక్షం విడిచిపెట్టానని నా పాదాలపై వ్రాలడే "ఇతడిలా సురక్షితంగా ఉండడానికి హేతువేమిటో" అని రెట్టించిన కోపంతో వానినింకా ఘోరవ్యథలపాలు చేయడానికి ఉద్యుక్తుడయ్యాడు.

ఒకసారి దిగ్గజ సమూహాన్ని తెప్పించి త్రొక్కిస్తాడు. ఒకసారి భయంకరములైన విషసర్పాలను తెప్పించి కరిపిస్తాడు. ఒకసారి మంటలు చిమ్మెడి అగ్నికుండంలో విసరివేయిస్తాడు. ఒకసారి పొంగిపొరలెడి మహాసముద్రంలో ముంచివేయిస్తాడు. విషంపెట్టిస్తాడు. నటికేస్తాడు కొండచరియల్లో త్రోయిస్తాడు. పట్టికట్టిస్తాడు.

ఒకమాఱు అభిచారహోమం చేయిస్తాడు. ఒకమాఱు మండుటెండలో, ఒకవేళ జడివానలో నిలవబెట్టి బాధిస్తాడు. ఒకసారి నవరంధ్రాలను మూయించి ఉక్కిరిబిక్కిరి చేయిస్తాడు. ఒకమాఱు మంచులో నిలుపుతాడు. ఒకసారి పెనుగాలిలో విడిచిపెట్టిస్తాడు. ఒక్కొక్కప్పుడు భూమిలో పాతిస్తాడు. అన్నపానీయాలు ఇవ్వకుండా నిగ్రహిస్తాడు. కొరడాలతో కొట్టిస్తాడు. రాళ్లు రువ్విస్తాడు. గదంతో మోదిస్తాడు. ఇలా ఎన్ని మారణోపాయాలు అవలంబించినా పాపరహితుడైన అతడు చెక్కుచెదరడు. ఆ స్థితిలో రాక్షసేంద్రుడు మఱేమీ చెయ్యడానికి పాలుపోక తన మనస్సులో—

సముద్రాల్లో ముంచాను, గదలతో మోదాను, కొండచరియల్లో త్రోయించాను, శస్త్రాలతో పొడిపించాను, ఏనుగులతో త్రొక్కించాను, భయంకరమైన

కార్చిచ్చులో పడవేయించాను, తిట్టాను, శపించాను, అనేక విధాలు బాధించాను •ని వీడు చావడు. వింతగా ఉన్నదే!

పోనీ చావకుండా ఉండే ఔషధం ఏదైనా తిన్నాడా అంటే అదీ లేదు• •పాడే వారెవరు కూడా లేరు. ఎన్ని బాధలు పెట్టినా సహజ తేజంతో ఎంతో ుంరుస్తూ ఉంటాడు. ఏమీ చలించడు. ఒక నిమిషం కూడా దైన్యం వహించడు. ంనిని ఎలా వధించాలో తెలియ కుండా ఉంది. నేను విసివి పోయాను. వీడు సామాన్యుడు కాడు. వీని ప్రభావం మానవాతీతమైనదిగా కనబడుతోంది.

పూర్వం ఒక ముని శునశ్శేపుడను తన కొడుకును యాగ పశువుగా •మ్మివేశాడు. అయినా ఆ మునిబాలుడు తండ్రిపై ఆగ్రహించలేదు. ఎలాగో ప్రాణాలతో బయటపడ్డాడు. అలాగే వీడున్నూ నేను ఆగ్రహంతో పెట్టిన బాధ ంన్నీ మెదలకుండా సహిస్తాడు. నా ఆగ్రహాన్ని అను గహంగా భావిస్తాడు. అన్యుల కెవరికీ చెప్పడు. వీనికి ఏ భయమూ లేదు. వీడు మహాప్రభావ సంపన్నుడు. వీని ంలన నాకు మృత్యువు తప్పదు-అని భావించి ఖిన్నుడై తల పట్టుకొని చింతిస్తుం ంగా గురు పుత్రులు చండామర్కులు * ఏకాంతంలో రాక్షసేశ్వరునకు ఇలా అన్నారు-—

దానవేంద్రా! నీకీర్తి వెన్నెల్లాగా స్వచ్ఛమైనది. నీ ప్రతాపం అందరినీ ఆశ్చర్యచకితులను చేస్తూంది. యుద్ధరంగంలో క్రుద్ధుడవైన నీ కనుబొమ ముడి మాచి లోకపాలురు సైతం కలవరపాటుతో కకావికలౌతారు. నీవు సకలలోకాలనూ అప్రతిహతంగా పాలించావు. నీలాంటి మహావీరునకు ఇలా చింతించడం తగదు. ండెంత? వీడి దంబపుమాటలెంత? ఎంతటి వక్రమార్గంలో చరించేవాడైనా వృద్ధు ంను గురువులను సేవిస్తే తప్పక నీతికోవిదుడౌతాడు. వయఃపరిపాకంతోపాటు బుద్ధివైభవంకూడా పెరుగుతుంది. కనుక నీ వీతని సురద్వేషిగా మలచడానికి ఇంకా యత్నించు. రోషం మాను. శుక్రాచార్యులు శీఘ్రకాలంలో వస్తారు. అప్పటికి వీడు తప్పక మంచిదారిలో అడుగుపెట్టగలడు- అని గురుపుత్రులనే సరికి రాక్షసనాథుడు- అయితే మీరు, గృహస్థులైన రాజుల కుపదేశింపదగిన ధర్మార్థ కామాలను బోధించి వీనిని తీర్చి దిద్దండి- అని ఆజ్ఞాపించాడు.

అపుడు వారు అతనికి త్రివర్గాన్ని గురించి బోధించడం మొదలుపెట్టారు. కాని అతనికి అదంతా అగమ్యంగా ఉంది. ఏమీ తలకెక్కడంలేదు. రాగద్వేషా లతో విషయాసక్తులైన వారికి ధర్మార్థ కామాలు అర్థంకావచ్చుకాని తనకు పనికి రావనుకున్నాడు. లోకవ్యవహారంకోసం భేదం కల్పింపబడ్డదేకాని ఆత్మకు భేద భావంలేదని గ్రహించాడు. పనికిమాలినవాటిని యోగ్యమైనవిగా తలచడం కేవలం

* శుక్రుని కొడుకులు ఇద్దరు - చండుడు, అమర్కుడు.

భ్రాంతిమూలకం అని భావించాడు. గురువు ఉపదేశించిన శాస్త్రాలన్నీ గ్రహింప దగినవికావని నిశ్చయించుకున్నాడు.

గృహస్థ కర్మానుష్ఠానంకోసం గురుపుత్రులు నిజమందిరానికి వెళ్లినపుడు తోడి రాక్షసబాలకులు తనను ఆటలకు రమ్మని పిలిస్తే ప్రహ్లాదుడు వారితో ఆడుతూన్నట్లు నటించి ఏకాంతంలో వారికి ఇలా బోధించడం మొదలుపెట్టాడు.

బాలకులారా! నా మాట వినండి. మన గురువులు మనకు మంచి చదువు ఒకటికూడా చెప్పరు. వారు చెప్పేదంతా బంధహేతువే. కనుక అది వినదగ్గది కాదు. నేచెప్పేది సావధానంగా వినండి. జీవితం అశాశ్వతం. మృత్యువు ఎప్పుడే దారిని వస్తుందో తెలియదు. మన వయస్సులో ఉన్నవారుకూడా మృతిచెందడం మీకు తెలుసుకదా! మన గురువులు క్రూరత్వంతో మనలను తప్పుదారి పట్టిస్తు న్నారు. దుస్స్వభావంతో అనర్థాలయందు అర్థకల్పనంచేసి మనల్ని వంచిస్తూ న్నారు. వీరు చెప్పే శాస్త్రాలు గ్రహింపదగ్గవి కావు. మీకు నేను యథార్థం చెపుతాను వినండి. మీకు శుభం కలుగుతుంది.

ధర్మార్థాలను ఆచరించడానికి కారణమైన మానవజన్మంకే దుర్లభం. అందులో పురుషుడై జన్మించడం మరీ దుర్గమం. మానవుని ఆయుఃపరిమితి నూఱు సంవత్సరాలు. అందులో సగం అంధకార బంధురమైన రాత్రిరూపంతో నిద్రాది వ్యవహారాలక్రింద నిరర్థకంగా గడచిపోతుంది. తక్కిన యాభై సంవత్సరాల్లో బాల్యం, కైశోరం, కౌమారం మొదలైన జీవయోవస్థల్లో ఇరవై సంవత్సరాలు గతిస్తాయి. ఇక మిగిలిన ముప్పది సంవత్సరాల్లో అధికాంశం మానవుడు ఇంద్రియవశుడై కామం, క్రోధం, లోభం, మోహం, మదం, మాత్సర్యం అనేడి త్రాళ్ళచే కట్టువడి ఉంటాడు. ఆ బంధంనుండి అతడు సులభంగా విడిపడలేడు. ఆశ ప్రాణాలకంటె తీపి. ప్రాణహానికికూడా జంకకుండా ఆశకు లోబడి దాస్యం, చౌర్యం, వ్యాపారం మొదలైన యేపనికైనా సిద్ధపడతాడు.

ఇతరుల ధనాదులకోసం అఱ్ఱులు చాస్తాడు. రహఃక్రీడల్లో తేలిస్తూ ధైర్యసారాన్ని ప్రిదిలఖేసెడి వధూజనాన్ని విడిచిపెట్టలేడు. తొక్కు పలుకులతో చెవులకు విందుచేసెడి శిశువులను నెత్తిన బెట్టుకుంటాడు. వయసుతో రూపంతో అసమానలైన మెఱపు తీగల్లాంటి ముదితలనుచూచి మురిసిపోతాడు. వినయం, వివేకం, విద్యకలిగిన పుత్రులనుచూచి పులకించిపోతాడు. కోరికలు తీర్చెడి సైదోదులను, ప్రేమానురాగాలతో పెద్దజేసిన తల్లిదండ్రులను, సుగుణాకరులైన బంధువులను కాదనక వారిపై మమత్వంపెంచుకుంటాడు. ధన కనక వస్తు వాహనలతో భోగాస్పదలైన మందిరాలను, పశుగణాన్ని, సేవకులను వంశపారంపర్యంగా వస్తూన్న స్థిరచర సంపదలను విడిచిపెట్టలేడు.

సంసారాన్ని ఎలాజయించాలో తెలిసికోలేడు. బయటకు వచ్చేదారిలేకుండా తంతువులతో గూడు కట్టుకొని అందులో చిక్కువడి వశించెడి కీటకంలాగా గృహస్థుడు తాను చేజేత చేసిన కర్మములకు బద్ధుడై తుచ్ఛములైన భౌతిక సుఖాలతో ప్రమత్తుడై తన కుటుంబ పోషణాదికంలో మునిగి తేలుతూ అందుండి బయటపడు దారి తెలియక స్వపరభేదభావంతో అజ్ఞానాంధకారంలో పడి కొట్టుకుంటూ ఉంటాడు. కనుక కౌమారదశలో పురుషుడు బుద్ధిబలంతో భాగవతధర్మాలను అనుష్ఠించాలి. మనం సుఖాలు కోరితేరావు. అలాగే దుఃఖాలున్నూ. అవి కర్మానుసారంగా పర్యాయక్రమంలో వస్తుంటాయి. కనుక వ్యర్థకార్యాలతో ఆయువును వ్యయంచేయరాదు. శ్రీహరి సేవవలన మోక్షం సిద్ధిస్తుంది. విష్ణువు సర్వభూతాలకు ఆత్మేశ్వరుడు. ప్రియుడు. కనుక మోక్షకాంక్షియైన దేహికి దేహత్యాగ పర్యంతం నారాయణ చరణార్చవించ సేవనం కర్తవ్యం.

మన వారిలో ఘనులనుకొనే వారే వెఱ్ఱితనంతో గృహస్థధర్మం అవలంబించి జీవితాన్ని వ్యర్థపఱచుకొనిన వారిని మీరు చూచారుకదా! ఆత్మశ్రేయస్సు కోరుతూ కూడా సంసారమార్గం విడువలేక అందులో చిక్కువడటం ఎంతమౌఢ్యం? లోకంలోగల సకలయోనుల్లో పడి పుటుతూ చస్తూ ఉంటాడు. దీనికి అంతం ఉండదు. కర్మాధీనుడై తనను తాను తెలుసుకోలేడు. నూఱుజన్మలెత్తినా అతనికి ముక్తిలభించదు. దీనివలన కీర్తిలేదు శుభమూలేదు. ఈ పుటుకలతో చావులతో ఎందుకీ వ్యథ? కనుక చావుపుటుకలులేని దారిని వెదకి కొనడం వివేకం కాదూ?

విద్వాంసుడుకూడా ఒకొక్కప్పుడు వివేకం కోల్పోయి మద్యపానంచే మైమరచిన మదవతి విలాసచేష్టలకు పరవశించిపోతాడు. ఆమెకు క్రీడామృగంగా మారిపోతాడు. ఆ లంపటంలో నుండి బయట పడలేడు. అలాంటప్పుడు కేవల విషయాసక్తులైన మన రాక్షసులను గుఱించి చెప్పేదేముందీ? అంచేత వారితో మనకు పొత్తువద్దు. ఇప్పటినుండీ మనం ముక్తసంగులైన మహాత్ములతో సాంగత్యం చేసి మోక్షకాంక్షతో ఆదిదేవుడైన శ్రీహరిని ఆశ్రయిద్దాం. విషయసుఖాలు మరగిన వారికి శ్రీహరిభజనం సాధ్యంకాదు. "నీవు చెప్పింది రమ్యంగానే ఉంది కాని అదిప్రయాసగమ్యం. సులభంకాదు" అని మీరు భావిస్తే ఇంకా వివరించి చెపుతాను వినండి.

పరబ్రహ్మ సకలభూతాల్లో అంతర్యామిగాఉంటాడు. అన్నిచావుల్లోను అన్నివేళలా ఉంటాడు, అతడు లేనిచోటులేదు. చరాచర జీవుల్లోనూ, స్థూలసూక్ష్మ జీవుల్లోనూ, భూమి, నీరు, తేజం, వాయువు, ఆకాశం అనెడి పంచభూతాల్లోనూ, భూత వికారాలైన ఘటం (కుండ) పటం (వస్త్రం) మొదలైన వస్తుజాలంలోనూ, గుణ సామ్యమైన ప్రధాన మందునూ, గుణ వ్యతికరమైన మహత్తు మొదలైన

తత్త్వాల యందునూ, రజస్సత్త్వ తమో గుణాల యందును భగవంతుడు నిండి ఉంటాడు. అతనికి ఈశ్వరుడు, పరమాత్మ, పరబ్రహ్మ మొదలైన నామాలెన్నో ఉన్నాయి. అతడు కేవలం అనుభవానంద స్వరూపుడు. అతనికి వికల్పం(మార్పు) లేదు. అతడిలా ఉంటాడని నిర్దేశించడం శక్యం కాదు.

అలాటి పరమాత్మ త్రిగుణాత్మకమైన తన దివ్యమాయ చేత తన సకల విభూతులూ అంతర్హితం కాగా చరాచర విశ్వ రూపంలో చూడబడేది, చూచేది, భోగించేవాడు, భోగింప దగినది సమస్తం తానే అయి వికల్పం గల వాడిలాగా ఇలా ఉంటాడని నిర్దేశింప దగిన వాడిలాగా గోచరిస్తాడు. అంచేత రాక్షస భావం విడిచిపెట్టి సకల భూతాల యందు సమదృష్టి, దయాసుహృద్భావాలు కలిగి ఉండాలి. అలా ఉంటే శ్రీహరి సంతోషిస్తాడు. శ్రీహరి సంతసిస్తే అలభ్యమైనదేదీ ఉండదు.

శ్రీహరి చరణ కమల ధ్యానమనెడి అమృత రసపానం చేత పరవశుల మైతే మనకు దైవ వశం చేత అకాంక్షితాలైన ధర్మార్థ కామాలూ సిద్ధిస్తాయి. కాంక్షితమైన మోక్షమూ లభిస్తుంది. కాని అవెందుకూ? త్రివర్గం, ఆత్మవిద్యా, తర్కం, దండనీతి, జీవికాదులు త్రిగుణాత్మకలైన వేదాలచే ప్రతిపాదింప బడ్డవి. అవేవీ మనకు అనుసరణీయాలు కావు కనుక గుణాతీతుడైన పరమ పురుషునకు ఆత్మార్పణం చెయ్యడంమేలు. పరమాత్మ తత్వం తెలిస్తే పురుషునకు స్వపర భ్రాంతి ఉండదు. కలలోగన్న విశేషాలాగా దృశ్యమానమైన సమస్త వస్తు జాలం కేవలం మిథ్య అనెడి భావం కలుగుతుంది—అని ప్రహ్లాదుడు తన తోడి బాలురకు ఇంకా ఇలా బోధించడం మొదలు పెట్టాడు—

పూర్వం నారాయణుడు నరునితో గూడి తపోనిరతిలో ఉన్నప్పుడు నారద మహర్షికి ఈ భాగవత రహస్యం చెప్పాడు. ఇది అంతలంతలకు సాధ్యం కాదు. హరిభక్తుల పాదధూళిచే పవిత్రమైన శరీరం గల పరతత్వజ్ఞులకు మాత్రమే సాధ్యం. దివ్యదృష్టి సంపన్నుడైన నారద మహర్షి వలన నేను ఈ జ్ఞానాన్నీ, భాగవత ధర్మాన్నీ విన్నాను—అని ప్రహ్లాదుడు పలికేసరికి రాక్షస బాలకులు ఆశ్చర్యకితులై అతనికి ఇలా అన్నారు.

రాకుమారా. మనం కలిసిమెలిసి ఉంటున్నాం. శుక్రకుమారుల దగ్గఱ అనేక శాస్త్రాలు విన్నాం. నీకు ఇంకే సద్గురువెవ్వడూ లేడు. రాజాంతఃపురం లోనికి ముక్కంటికైనా అడుగు పెట్టడం సాధ్యం కాదు. అంతఃపురం నుండి నీవు బయటకు అడుగు పెట్టవు. అలాంటి స్థితిలో నీకు ఇలాంటి విద్య నేర్పిన ప్రగల్భు డెవ్వడో చెప్పు. నిన్ను మేం ఎప్పుడూ సేవిస్తూంటాం. నిన్ను మేం రాజుగా భావి

స్తాం. నిన్నెంతో ఆదరించి గౌరవిస్తాం. కాని విచిత్రమైన ఈ బుద్ధి విశేషం నీకెలా లభించిందో తెలియదు—

అని రాక్షస బాలకులు అడిగే సరికి పరమ భాగవతోత్తముడైన ప్రహ్లాదుడు నవ్వి పూర్వం తాను నారదుని వలన విన్న మాటలను స్మరణకు తెచ్చుకొని యిలా అన్నాడు-మిత్రులారా! వినండి. మా తండ్రి ఒకప్పుడు మందర పర్వతం మీద ఎంతో సహనశీలంతో దారుణ తపస్సు చేస్తుండగా "పాములు చీమలు తినినట్లు పాపాత్ముడైన వీనిని వీని పాపాలే తిన్నాయి. రాక్షస సంఘం మీద దండెత్తడానికి ఇదే అదను" అని దేవతలు భావించి యుద్ధోన్ముఖులయ్యారు. ఇంద్రాదులు మహోద్రేకంతో భేరి భాంకారాలు దిగంతాల యందు మార్మోగగా రాక్షసులపై ఆకస్మికంగా వచ్చిపడేసరికి వారు భయావిష్టులై దారసుతాదులను, ధనకనక వస్తు వాహనాలను, మందిరాలను విడిచి ప్రాణాలు అరచేతిలో పెట్టుకొని నలువైపులకు పారిపోయారు.

దేవతలు ప్రల్లదనంతో రాజనివాసాలను ఇష్టం వచ్చినట్లు కొల్లగొట్టారు. ఇంద్రుడు జంకు గొంకు లేకుండా అంతఃపురం ప్రవేశించి మా తల్లిని అదలించి చెఱబట్టాడు. పాపం ఆమె సిగ్గుతో తపించి విలపించింది. బలాత్కారంగా పట్టుకొన బడిన అమాయకమైన ఆడగొఱ్ఱె లాగా భోరుమని యేడ్చింది. సరిగా అదే సమయంలో నారద మహర్షి యాదృచ్ఛికంగా ఆ దారిన వచ్చాడు. సురేంద్రుని దౌష్ట్యం చూచి విహ్వలించి-దేవనాథా! నీవు వేల్పులలో విశిష్టుడవు, పుణ్యమూర్తివి, నీతికోవిదుడవు నీవిలా నిస్సహాయమైన మానిని చెఱబట్టడం ఏమిటి? ఈమె కల్మషం లేని మహాసాధ్వి పైగా గర్భవతి. దుర్జయుడైన రాక్షసేంద్రునిపై రోషం మాని ఈమెను విడిచిపెట్టు—అనగా ఇంద్రుడు దేవర్షికి ఇలా అన్నాడు-

మునీంద్రా. లోకనాశకమైన రాక్షసుని వీర్యం ఈమె గర్భమందు ప్రవృద్ధమౌతోంది, అందుచేత ప్రసవించేదాకా ఈమెను చెఱబట్టి ఆ పుట్టిన పిల్లవానిని నా వజ్రధారతో ఖండించి నిశ్చింతగా ఉంటాను అపుడీ దానవ రాజ పత్నిని విడిచి పెడ్తాను— అనిన అమరేంద్రుని మాటలు విని నారద మహర్షి-సురాధిపా! ఈమె గర్భస్థ శిశువు ఎలాంటి వాడో చెపుతాను. విను. అతడు భయ రహితుడు మహా భాగవతుడు. అనేక జన్మముల నుండి సంక్రమించిన హరిభక్తి మహిమ వలన అతడు సంగర రంగంలోగాని అన్యోపాయాలచే గాని నీచే వధ్యుడు కాడు. నీ భుజబలం అతని ముందు వ్యర్థం-అని దేవముని అనే సరికి ఇంద్రుడు తాను హరి భక్తుడు గనుక భక్తి బాంధవంతో మా అమ్మను విడిచి ఆమెకు ప్రదక్షిణ నమస్కారాలు చేసి నిజలోకానికి వెళ్ళిపోయాడు.

నారద మహర్షి మా యమ్మను కన్న బిడ్డలాగా ఊరడించి తన ఆశ్రమానికి తీసుకొని వెళ్ళి-తల్లీ! నీవు మహా పతివ్రతవు. నీ గర్భస్థ శిశువు సామాన్యుడు కాడు. మహా భాగవతోత్తముడు. తపో మహిమచే కృతార్థుడై నీ భర్త త్వరలో వస్తాడు. అందాక నీవు నా ఆశ్రమంలో ఉండు-అనగా ఆమె సమ్మతించింది.

మా అమ్మ నారీ శిరోమణి, పతియే దైవమని భావించెడి మహా సాధ్వి, పతి రాకను కాంక్షిస్తూ గర్భపరిరక్షణేచ్ఛతో అక్కడే నారద మహర్షిని సేవిస్తూ ఉంది. అలా తనకు పరిచర్య చేస్తున్న దైత్య రాజ పత్నికి ఆశ్రిత వత్సలుడైన అమర ముని అభయ ప్రదానం చేసి ఆమెను కంటికి రెప్పలాగా కాపాడుతున్నాడు. అంతేకాదు గర్భస్థుడనైన నన్ను ద్దేశించి, ధర్మతత్వాన్నీ నిర్మల జ్ఞానాన్నీ ఉపదేశించాడు. చాలా కాలం గడచి పోవడం వల్లనూ, ఆడుది అవడం చేతను మా అమ్మ నారదోపదిష్టమైన ఆ విద్య మఱచి పోయింది. కాని నారద మహర్షి కృపా విశేషం చేతను దైవయోగం చేతను ఆ మహర్షి మాటలు నాకు ఎన్నడూ మరపునకు రావు. అవి మీకుచెబుతాను వినండి వాటిని మీరు విశ్వసిస్తే మీకు శుభం కలుగుతుంది అహంకారం నశిస్తుంది-అని ప్రహ్లాదుడు వారికి నారదోక్తమైన ధర్మం ఇలా చెప్పడం మొదలు పెట్టాడు.

వృక్షము నందున్నప్పుడే దానికి పుట్టెడి పండ్లకు జన్మం. సంస్థానం, వర్ధనం, అపచయం (కోత), క్షీణత్వం, పరిపాకం, నాశం-అనెడి షడ్భావ వికారాలుంటాయి. కాని వృక్షానికి కాదు. అలాగే ఈశ్వర మూర్తియైన కాలమహిమ వలన ఈ వికారాలు దేహానికి ఉంటాయి. కాని ఆత్మకు కాదు. ఆత్మనిత్యుడు,, క్షయ రహితుడు, శుద్ధుడు, క్షేత్రజ్ఞుడు[1], సర్వాశ్రయుడు, వికార రహితుడు" స్వప్రకాశకుడు, సృష్టిహేతువు, వ్యాపకుడు[2], నిస్సంగుడు, పరిపూర్ణుడు, అద్వితీయుడు ఈపంద్రెండు ఆత్మ లక్షణాలును ఎఱిగినవిద్వాంసుడు దేహాదులందూమోహ జనకాలైన అహంకార మమకారాలను విడిచి వేస్తాడు. బంగారపు గనులుండెడి చోట బంగారపు నలుసులుగల రాళ్లు మెఱుస్తూ ఉంటాయి. స్వర్ణకారుడు ఆ రాళ్ల యందు పుటంపెట్టి అగ్నియోగం చేత వాటిని కరిగేలాగా ఊది ఉపాయంగా వాటిల్లోని బంగారాన్ని బయటకు తీస్తాడు. అలాగే ఆత్మకృత కార్యకారణాలెఱిగిన చతురుడు ఆత్మ లక్షణాలచేత సకల దేహాల యందును ఆత్మ వస్తువును పరిశీలించి అనంతరం నిరతిశయమైన బ్రహ్మ భావం పొందుతాడు.

భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశం, మనస్సు, బుద్ధి, అహంకారం-ఈ ఎనిమిది ప్రకృతులు. రజోగుణం, సత్వగుణం, తమోగుణం-ఈ మూడును

---

1. సర్వక్షేత్రముల (దేహముల) నెఱిగిన వాడు. 2. చరాచర సమస్త భూతకోటి యందు వ్యాపించి యున్నవాడు.

ప్రకృతి గుణాలు. కర్మేంద్రియాలు అయిదు, జ్ఞానేంద్రియాలు అయిదు, ప్రాణాలు అయిదు, చిత్తం-ఈ పదాలును వికారాలు-అని కపిలుడు మొదలైన పూర్వాచార్యుల మతం. ఆత్మ ఈ యిరువదేడింటినిగూడి ఉంటుంది. శరీరం ప్రకృతులైన భూమి మొదలైన వాటితోను, వికృతులైన ఇంద్రియాదులతోను గూడి ఉంటుంది. శరీరం జంగమం స్థావరం అని రెండు విధాలు. అలాంటి శరీరంలో గల పృథివ్యాదులను గంధాదిగుణ మూలమున విభజించి అవి ఆత్మగాదని విడిచి విశుద్ధమైన మనస్సుతో ఆత్మ పదార్థాన్ని అన్వేషించాలి. ఆత్మకు జన్మస్థితిలయాలుండవు. మణిగుణమందలి దారం లాగా అది అన్నింటి యందును ప్రదీపించి ఉంటుంది. ఆత్మను తెలిసికొనడానికి ఉపాయాంతరాలు కూడా ఉన్నాయి. బుద్ధికి జాగరణం, స్వప్నం, సుషుప్తి-అను మూడు దశలుంటాయి, కాని అవి ఆత్మకు ఉండవు. ఉన్నట్లు తోస్తాయి. అవి బుద్ధివే అయినా ఆత్మచేత అనుభూతములగుట వలన అవి ఆత్మవే యని అజ్ఞులు భావిస్తారు. కాని అది వాస్తవం కాదు. పుష్ప ధర్మమైన గంధాన్ని వహించి ప్రసరించెడి వాయువును, వాయుగుణం కాని గంధం చేత దాని కంటె వేఱైన పదార్థంగా తెలిసికొంటున్నాం. అలాగే ఆత్మ అనుభవిస్తూ ఉన్నా వాస్తవంగా బుద్ధి దశలైనజాగరణాదులచే ఆత్మ దేహేంద్రియాల కంటె భిన్నమైనదని తెలిసికోవాలి.

కనుక సంసారం బుద్ధిసాధ్యం, గుణకర్మబద్ధం, అజ్ఞానకారణం. అది నిజం కాదు. స్వప్నంలాంటిది. సకలార్థాలు మనస్సంభవాలు. స్వప్నం జాగరణం సమములు. పరమాత్ముడు గుణశూన్యుడు. కాని గుణాశ్రయంచేత జనన మరణాలున్నట్లు తోస్తుంది. వాస్తవంగాలేవు. కనుక మిత్రులారా. త్రిగుణాత్మకములైన కర్మలకు కారణభూతమైన అజ్ఞానాన్ని, జ్ఞానాగ్నిచే కాల్చివైచి కర్మరహితులై శ్రీహరిని దర్శించడం ఉత్తముల లక్షణం.

అందేత విజ్ఞాన వైరాగ్యలాభసాధనాలైన భాగవతధర్మాలయందు మనం ఆసక్తి వహించాలి. ఆ సాధనాలేవో మళ్లీ చెపుతున్నాను వినండి. గురుశుశ్రూష, ఈశ్వరార్పణంగా కర్మచెయ్యడం, సాధుజన సంగమం, ఈశ్వరప్రతిమను ఆరాధించడం, హరికథలయందు ఆసక్తి కలిగి ఉండడం, వాసుదేవుని యందు ప్రీతి, శ్రీమన్నారాయణుని గుణకర్మలను, కథలను, నామాన్ని కీర్తించడం, శ్రీహరిచరణకమల ధ్యానం, విశ్వేశ్వరుని విలోకించడం, పూజించడం— ఇవిభాగవత ధర్మాలు. ఈ ధర్మాలను పాటిస్తూ సర్వభూతములందు ఈశ్వరుడున్నాడని సమ్మానించాలి. కామక్రోధ లోభ మద మాత్సర్యాలను జయించాలి. ఇంద్రియాలను ఉరికట్టాలి. భక్తికలిగి ఉండాలి. అపుడు పరమేశ్వరుడైన విష్ణుదేవుని యందు పురుషుడు ఐక్యమవుతాడు.

శ్రీహరి లీలావతారాలయందలి విక్రమగాథలూ, సద్గుణాలూ విని భక్తుడు ఆనందంతో పులకించిపోతాడు. కనులవెంట సంతోషబాష్పాలు కారుస్తాడు. కంపిత స్వరంతో కమలాక్షా! వైకుంఠా! వరదా నారాయణా! వాసుదేవా. అని గొంతెత్తి పాడతాడు. ఆడతాడు,కన్నీరు కారుస్తాడు. చింతిస్తాడు. నమస్కరిస్తాడు, ప్రణయ భావంలో మునిగి పోతాడు, తనలో తాను మాట్లాడుకుంటాడు. దయ్యంపట్టిన వాడి లాగా తిరుగుతాడు. తుట్టతుదకు భక్తివివశుడై కర్మబంధాలను ద్రెంచివైచి అజ్ఞానపటవిని దగ్ధంచేసి శ్రీహరి సాయుజ్యం చెందుతాడు.

కమ్మక రాగాదులతోకూడిన మనస్సుగల దేహికి సంసార చక్రాన్ని మళ్లీం చెడి హరిచింతనం బ్రహ్మమందలి మోక్షసుఖం ఎలాంటిదో అలాంటిది. హరిభజనం దుర్గమంకాదు. హరి సకల ప్రాణికోటి హృదయాంతర్యామియై రూపందాల్చి నట్లుంటాడు. ఇంద్రియార్థాలవలన ప్రయోజనంలేదు. జీవితం నీటిబుడగలాంటిది. నిమిష భంగురమైనది. అలాంటి జీవికి మమతాస్పదాలూ చంచలాలూ అయిన పుత్రమిత్ర కళత్రాదులుగాని బంధుభృత్య బలాదులుగాని రాజ్యకోశ మణి మంది రాలుగాని ఇంకా ఇతర విధాలైన వైభవాలుగాని నిరర్థకాలు. యజ్ఞయాగాది పుణ్య లబ్ధాలైన స్వర్గాదిలోక భోగాలుకూడా నిత్యాలుకావు. ఆ పుణ్యం క్షీణించేసరికి ఆ భోగాలుకూడా అంతరించి పోతాయి.

మానవుడు తాను విద్వాంసుడనని అహంకరించి కర్మాచరణం చేసి విరుద్ధ ఫలం పొందుతాడు. నిష్కామంగా కర్మలు చెయ్యాలి. అలాకాకపోతే దుఃఖాలు తప్పవు. పురుషుడు దేహం కోసం భోగాలు అపేక్షిస్తాడు కాని ఆ దేహం నిత్యం కాదు. వెంటరాదు. మృతశరీరాన్ని శునకాదులు తింటాయి. దేహి కర్మములు ఆచ రించి కర్మబద్ధుడై తిరిగీ ఆయా కర్మముల కనురూపమైన శరీరాన్ని ధరిస్తాడు. ఈ రీతిగా అజ్ఞానంచేత పురుషుడు కర్మగత దేహాలను విస్తరించుకుంటూపోతాడు. ధర్మార్థకామాలు అజ్ఞానతంత్రాలు. మోక్షం జ్ఞానలభ్యం. మోక్షప్రదాత అయిన హరి సకల భూతకోటికీ ఆత్మేశ్వరుడు. ప్రియుడు. తానై సృజించిన మహాభూతా లచే జీవుడుగా వ్యవహరింపబడతాడు. ఏ కోరికాలేకుండా హృదయ గతుడైన హరిని భక్తిభావంతో భజించాలి.

దానవులు, దైత్యులు, ఉరగులు, మానవులు, గంధర్వులు, సురలు- మత్త్వరైనా కానీ రమానాథుని చరణకమల ధ్యానంచేత చరితార్థులవుతారు. అచ్యుతుడు భక్తిచేత చిక్కినంత సులభంగా వ్రతాలచేగాని క్రతువులచేగాని దానాలచేగాని శౌచంచేగాని శీలంచేగాని తపంచేగాని చిక్కడు. శ్రీహరిని మెప్పించ డానికి భక్తి ఒక్కటే సమర్థమైనది. దేవత్వంగాని మహాదేవత్వంగాని శాంతత్వంగాని సమర్థమైనవికావు. దనుజులు, మనుజులు, ఖగులు, యక్షులు, దైత్యులు,

శూద్రులు, బోయలు, గొల్లపడుచులేకాదు మృగాలూ పక్షులుకూడా జగత్తంతా విష్ణుమయమని భావిస్తే మోక్షం పొందుతారు. బాలులారా! చీకట్లో ఎందుకిలా పరుగులు పెట్టడం? గురువులు వారు నేర్పిన మార్గాలేవో చెపుతారు. అంతేకాని దివ్యమైన విష్ణుపదవికి మార్గం చెప్పరు. పుస్తకాలన్నీ తీసికొనిరండి. తిరిగి ఆచార్యునకిచ్చి వెయ్యండి. ఒంటరిగా రండి. రహస్యవిశేషాలు చెపుతాను. ఇష్టంలేని వారు కర్మాధీనులై వెళ్లిపొండి.

అంబుజాక్షుని యందు మనసు నిలిపి ఆడుదాం. పద్మనాభుని భద్ర యశస్సును ఎప్పుడూ గానంచేద్దాం. రాక్షససాంగత్యాన్ని విడిచివేద్దాం. హరిభక్తుల సాంగత్యంచేద్దాం. సంసార పటలాన్ని సంఛిన్నంకావిద్దాం. కామాది శత్రువర్గాన్ని చీల్చిచెండాడుదాం. చిత్తాన్ని శ్రీకాంతుని అధీనం చేద్దాం. మోక్షపదంలో అడుగు పెడదాం. మనకు సకల శుభాలు కలుగుతాయి— అని ప్రహ్లాదుడు ఏకాంతంలో ఆయా వేళల్లో రాక్షస బాలకులకు మోక్షమార్గం ఉపదేశించగా వారు గురువులు చెప్పిన చదువులకు స్వస్తిచెప్పి నారాయణుని యందు భక్తిని పెంచుకొనడం మొదలు పెట్టారు. అది గ్రహించి గురుపుత్రుడు భయపడి రాక్షసేశ్వరునకిలా అన్నాడు-

దానవాగ్రేసరా. నీ కొడుకు రాక్షసబాలకుల నందరిని చేరదీసి నేను చెప్పేచదువులన్నీ కల్లలని వారికి నచ్చబలికి నన్ను నిందిస్తున్నాడు. అందరి మనసులను మార్చి వారిని మోక్షాయత్తుల్ని చేశాడు. మనకు నిజంగా మోసం వాటిల్లింది. ఇక నీవు నీ శక్తిసామర్థ్యాలు చూపి వానిని చక్కజేయాలి. "ఈ గురువు విష్ణు గాథలెన్నడూ చెప్ప"దని నన్ను ధిక్కరించి పిల్లలు నే చెప్పేది చదవడం మాని వేశారు. ప్రహ్లాదుడు మురవైరి గాథలు విడువడు. జడునిలాగా విచ్చలవిడిగా తిరుగుతూ ఉంటాడు. ఉల్లాసంతో నే చెప్పిన మాటలు పలుకడు. ఇంతటి దుడుకు తనంగల వీనిని చదివించడం మాకు సాధ్యంకాదు. చక్కని రక్కసికులంలో వీడు చెడబుట్టాడు. ఎన్ని చెప్పినా శ్రీహరిపసందు మక్కువ మాత్రం విడిచిపెట్టడు. ఇలాంటి కొడుకును నీ వెలా కన్నావోకాని ప్రభూ. ఇంత వెఱ్ఱివానిని మేం ఎక్కడా చూడలేదు-

అని గురుసుతుడు పలికిన పలుకులు రాక్షసేశ్వరుని కర్ణరంధ్రాలకు ఖడ్గ ప్రహారాల్లాగాసోకాయి. తోక తొక్కనసర్పంలాగా వాయుప్రేరితమైన కార్చిచ్చు లాగా, కఱ్ఱతో కొట్టబడిన మృగేంద్రంలాగా మిట్టిపడ్డాడు. భయంకరమైన రోషం చేత మనస్సు దహించుకొని పోయింది. పుత్రుణ్ణి సంహరించాలని నిశ్చయించు కున్నాడు. శరీరం కంపించింది. కన్నులెఱ్ఱబడ్డాయి. కొడుకును పిలిపించాడు. అదలించలేదు. మన్నించలేదు అయినా అతడు శాంతస్వభావంతో అంజలివట్టి

శ్రీమన్నారాయణ ధ్యానంచేస్తూ అర్ధ నిమీలిత నేత్రుడై నిలబడ్డాడు. అపుడు దాన వేంద్రుడాతని చూచినిర్దయగా పిడుగుల్లాంటి మాటలతో అదలిస్తూ ఇలాఅన్నాడు-

ఓరీ! నీకు నా ప్రతాపం తెలియదు. విను. నా ఆజ్ఞలేక సూర్యుడు గగన తలాన ప్రకాశించడు. అన్నికాలాల్లోనూ వాయువు నాకు అనుకూలుడై వీస్తాడు. నా ప్రతాపాగ్నికి తేజం కోల్పోయి అగ్ని విచ్చలవిడిగా ప్రకాశించడానికి భయ పడతాడు. అనుల్లంఘనీయమైన నా శాసనాన్ని ఉల్లంఘించి యముడు ప్రాణికోటిని హింసించడానికి జంకుతాడు. ఇంద్రుడు నా యెదుట తలయెత్తి తిరుగలేడు. అమరులు, కిన్నరులు, గంధర్వులు, యక్షులు, విహగులు, నాగులు, విద్యాధరులు కూడా నన్నుచూచి అదలిపోతారు. కాని ఓరీ పలువా. నీ వెందుకు భయపడవూ? నీకు దిక్కెవ్వరూ?

ప్రజ్ఞావంతులైన దిక్పాలకులు నాకు విద్వేషులయ్యిండిన్నీ, నా ఆజ్ఞను భంగించడానికి భయపడిపోతారు. రోషసంభరితాలైన కడగంటి చూపులతో, నేను చూస్తేచాలు ముల్లోకాలకు మతిపోతుంది. జ్ఞానం నశిస్తుంది. అందరూ గజగజ లాడిపోతారు. అలాంటి స్థితిలో నీవు నా ఆజ్ఞను ధిక్కరిస్తున్నావే ఎంతటి దురహం కారం? వైకుంఠుడు అజేయుడని నీవు చెప్పేది అంతా కంఠశోషకే కాని మరేమీ కాదు. శ్రీహరి మహావీరుడే అయితే నేను దేవతలను రణభూమిలో చీల్చిచెండాడే టప్పుడు చేతకాని వాడిగా ఎక్కడోదాగి ఉండడందేనికి? వారిని రక్షించడానికి యుద్ధక్షోణికి రావద్దూ?

ఆచార్యులు చెప్పినది కాదని బాలురకు మోక్ష పదమందు ఆసక్తిని కల్పి స్తావా! నీ వాచాలత్వాన్ని జూపి నాకు వైరియైన వైకుంఠుని వర్ణిస్తావా? రాక్షస వంశాచారాలను మంటగలిపావు. నీవు మూఢాత్ముడవు, కులద్రోహివి, నీచుడవు. నిన్ను జంపి కులాన్ని నిర్దోషం చేస్తాను. నేను సకల దిక్కులనూ జయించాను, దేవేంద్రాది దిక్పాలకులు కూడా వేరే దిక్కు కానగ నేనే దిక్కని నన్ను కొలు స్తారు. అలాంటప్పుడు ఓరీ! నీకు దిక్కెవరు? ముల్లోకాల్లో నన్ను మించిన బలవం తుడు లేడు. మహాశాలులైన వారిని కూడా నేను ఒంటరిగా జయించాను. నీవు ఎవని బలంతో నాకు ప్రతి వీరుడవై ఇలా ఆడుతున్నావు?-అనిన తండ్రికి కొడుకు వినయ భావంతో మెల్లగా ఇలా అన్నాడు.

అసురేంద్రా. బలాఢ్యులకూ బలహీనులకూ, నీకూ నాకూ బ్రహ్మాదులకూ సకల ప్రాణికోటికీ బలం ఆ శ్రీహరి యొకడె నాకు దిక్కు.

భగవంతుడు లీలావినోదంగా అఖిల జగాలను సృష్టిస్తాడు, రక్షిస్తాడు, ఖండిస్తాడు. అతడు మాత్రం అవ్యయుడు అతడు అన్నిరూపాల్లోనూ ఉంటాడు. కనుక నీవు విషమ బుద్ధిని విడిచి సమచిత్తంతోఉండు అపమార్గం బట్టిన చిత్తం

కంటె ఇతరులెవ్వరూ వైరులుకారు. కనుక నీవు నీ మనస్సును నిగ్రహించుకో. మదంతో గూడిన రాక్షస ప్రవృత్తిని విడిచిపెట్టు. నీ యెదుట నీ కెవ్వరూ మంచిని చెప్పరు.

నీవు లోకాలన్నీ గడియలో జయించావు. కాని ఇంద్రియాలను మనస్సును జయింపలేక పోయావు. నిన్ను బంధించే భయంకర శత్రువులు ఆర్గురు[1] నీలోనే ఉన్నారు. వారిని నీవు నిర్జిస్తే ప్రాణికోటిలో నీకు విరోధి అనే వాడెవ్వడూ ఉండడు. దానవేంద్రా! జాగ్రత్తగా ఆలోచించు. బుద్ధిని వశంగతం చేసుకో. కర్మ బంధాలను త్రెంచివేసుకో, సమదృష్టి గలిగి సంసార లంపటం నుండి బయటపడు. హృదయంలో హరిభక్తిని పాదుకొల్పు—అనిన కుమారునకు రాక్షసాధిపతి యిలా అన్నాడు.

ఓరీ! నీకు హద్దూపద్దూ లేకుండా ఉంది. పడుచుదనపు ప్రల్లదనంతో చంపితే చస్తానంటావు. అణుమాత్రం కూడా చలించవు. పరుషోక్తులతో నన్ను బెదరిస్తున్నావా? చావునకు తెగించిన వానిలాగా వదరుతున్నావు: నాకు ఎదురాడతావా? నేనుజగన్నాథుడను. ఈ భూతకోటికి నాకంటె వేరే రాజెవ్వరూ లేడు. మహా ప్రతిభాశాలియైన నాతమ్ముడు హిరణ్యాక్షుని చంపిన తర్వాత నేను ఆ నారాయణుని కోసం లోకాలన్నీ గాలించాను. కాని ఆతనిజాడ ఎక్కడాలేదు. అతడు ఈ విశ్వంలో మాత్రంలేడు. ఉంటే ఎక్కడున్నాడో, ఏరీతిగా ఉంటాడో, ఎక్కడెక్కడ తిరుగుతూ ఉంటాడో, ఏ జాడను వస్తాడో చెప్పు. భృత్యుడులాగా వాణ్ని సమర్థిస్తూ నోటికి వచ్చినట్లు మాట్లాడుతున్నావు. నిన్నూ, వానినీ కూడా వధిస్తాను చూడు—

అని తండ్రి నిష్ఠురంగా మాట్లాడే సరికి శ్రీహరి భక్తాగ్రగణ్యుడైన ప్రహ్లాదుడు అణుమాత్రం కూడా చలించలేదు. ఆగ్రహం చెందలేదు. పైగా అతని శరీరం హర్షంతో పులకించి పోయింది. శ్రీహరిని మనస్సులో స్మరించి దోయిలించి ఏమీ తెలియని బాలుడులాగా నటిస్తూ ఇలా అన్నాడు-తండ్రీ! శ్రీమన్నారాయణుని కోసం ఎన్నో మాఋలు విశ్వం అంతా గాలించానన్నావు. ఎందుకూ? అతడెక్కడ లేడూ? అతనికై వెదకడం ఏమిటి? సముద్రంలో ఉన్నాడు గాలిలో ఉన్నాడు. ఆకాశంలో ఉన్నాడు. భూమియందున్నాడు. అగ్నిలో ఉన్నాడు. అన్ని దిక్కుల్లో ఉన్నాడు. రేబవళ్ళయందెప్పుడూ ఉంటాడు. సూర్యచంద్రుల్లో ఉంటాడు. ఓం

1. కామం, క్రోధం, లోభం, మోహం, మదం, మాత్సర్యం - ఈ ఆరు అంతశ్శత్రువులు.

కారంలో ఉంటాడు. త్రిమూర్తుల్లో ఉంటాడు ఇక్కడుంటాడు అక్కడుంటాడు అని సందేహించి వెదక వలసిన పనిలేదు. అతడు జగదంతర్యామి. సమస్త చరాచర జీవకోటిలో ఉంటాడు. దానవేంద్రా! ఎక్కడ వెదికితే అతడు అక్కడే ఉంటాడు- అని ఈవిధంగా సకల భూతకోటిలోను శ్రీహరి ఉన్నాడని ప్రహ్లాదుడ చేసరికి రాక్షసరాజు సంభ్రమపాటుతో 'అబద్ధం. ఎక్కడాలేడు. లేడు' అని అతణ్ణి బెదరించగా శ్రీహరి నరసింహాకృతి వహించి మహా ప్రభావంతో సకల చరాచర భూతకోటి గర్భాల్లో ప్రవేశించి ఉన్నాడు.

అపుడు దానవేంద్రుడు తిరిగి ప్రహ్లాదునుద్దేశించి- ఓరీ. శ్రీహరి అన్నిచోట్లా ఉన్నాడని మిడిసిపాటుతో అంటున్నావు. ఆ హరినీ గిరినీ ఈ సభా స్తంభంలో చూపగలవా? నీ వాతనిని ఈ స్తంభంలో చూపలేకపోతే నీశిరం ఖండించి నిన్ను నేలకూలుస్తాను. అపుడాత డెక్కడ నుండి యైనా సంరంభంతో వచ్చి నీకు అడ్డుపడగలడేమో చూస్తాను-అనగా హరిభక్తుడైన, ప్రహ్లాదుడు - రాక్షసేంద్రా! శ్రీహరి సర్వాత్మకుడు. బ్రహ్మ మొదలు తృణపర్యంతం సకల చరాచరాల్లో ఉంటాడు. ఈ స్తంభంలో ఉండడా? తప్పకుండా ఉంటాడు అందులో సందేహం లేదు. నీ వీ నాడాతని ప్రత్యక్షంగా చూచగలవు- అని కొడుక చేసరికి-

హిరణ్యకశిపుడు గద్దెనుండి గద్దన లేచి ఒక్క ఉదుటున ఉరికాడు. ఒరలో ఉన్నకత్తిని చఱ్ఱున లాగి ఝళిపిస్తూ ధిక్కార పూర్వకంగా-డింభకా విను నీవు మూఢత్వంతో విష్ణువు విశ్వాత్మకుడని భాషిస్తున్నావు అయితే ఈ స్తంభంలో ఉన్నాడా? - అని దాన్ని భయంకరంగా తన అరచేతితో మోదాడు. ఆ స్తంభం మహాతేజంతో ప్రకాశిస్తోంది. జనులు భయభీతులై ప్రాణాలు అరచేతుల్లో పెట్టుకొని ఉన్నారు.

## శ్రీహరి నృసింహ రూపంతో స్తంభం నుండి ఆవిర్భవించడం

రాక్షసేశ్వరు డారీతిగా శ్రీహరిపై దారుణ వైరం వహించాడు. ఆ వైరానుబంధంచేత అతనిలో రోషాగ్ని జ్వలించింది. ఆ రోషాగ్ని చేత అతనిలో వినయం విజ్ఞానం నశించాయి. అవి నశించేసరికి అతని హృదయం చెదరింది. హృదయం చెదరేసరికి తామసం పెరిగింది. - ఆ తమోగుణ యోగంచేత అతడు స్థైర్యాన్ని కోల్పోయాడు. అపుడాతడు సంభ్రమ పాటుతో ఒడలు తెలియకుండా ప్రహ్లాదుని ధిక్కరిస్తూ "ఓరీ! హరిని ఈ స్తంభంలో చూపు" మని కనకమణి

కంకణాలు క్రేంకారధ్వనులు చేయగా దిగ్దంతుల దంతాలను పట్టి పెకల్చ సమర్థమైన చేతితో కత్తినెత్తి ఆ స్తంభాన్ని ఒక్క వేటువేశాడు.

వ్రేటువేసి వేయగానే స్తంభం చిటిలి పెఠిల్లుమంది. దానిలో నుండి అగ్ని కణాలువెల్వడి దిశదిశలూ వ్యాపించాయి. అప్పుడు ప్రళయ సమయంలో మహావాయు విజృంభణానికి సంఘటితమై పైకిరేగిన ధూళిపరాగపు ఆకిడికి చెల్లచెదరైన మేఘాల పరస్పర సంఘట్టనంవలన జనించిన పిడుగుల యొక్క నిష్ఠుర నిర్ఘోషను నిరసిస్తూ ఛటచ్ఛట, స్ఫుటస్ఫుట మను కఠొరధ్వని బయల్వెడలింది. ఆ ధ్వనికి భూనభోంతరాళం మార్మ్రోగింది. బ్రహ్మాండ భాండం బ్రద్దలైంది. బ్రహ్మేంద్రాదులు కూడా భయకంపితులయ్యారు. వెంటనే స్తంభాన్ని చీల్చుకొని నృసింహస్వామి ఆవిర్భవించాడు.

వికసించిన తామర పువ్వుల జంటలాంటి ఆ దేవదేవుని పాదయుగళి-చక్రం, చాపం, హలం, కులిశం, మత్స్యం మొదలైన దివ్య చిహ్నాలతో కమనీయంగా రమణీయంగా ఉంది. అతని పాదసంఘట్టనకు భూభారాన్ని వహించెడి దిగ్గజాలూ, కులపర్వతాలూ, ఆదిశేషువూ, కూర్మం వంగి క్రుంగిపోయాయి. సముద్రంలో పుట్టిన వేల్పుటేనుగు ఐరావతం తొండంలాగా ప్రచండంగా ఉన్నాయి ఆతని తొడలు. ఘణఘణమని మ్రోగెడి బంగారు మువ్వల మొలనూలులతో ముచ్చటగా ఉన్న అతని కటి ప్రదేశమందు పీతాంబరం నేత్రపర్వంగా ఉంది. అతని నాభిరంధ్రం గంగానది యందలి సుడిగుండంలాగా గంభీరంగా ఉంది. పిడికిలియంతటి అతని సన్నని నడుం నున్నగా ముగ్ధమోహనంగా ఉంది.

వక్షస్థలం కులపర్వత సానువులాగా కర్కశంగా విశాలంగా ఉంది. గోళ్ళు వాడిగా దనుజ వీరుల ధైర్యలతలను కోసివేసెడి కొడవళ్ళలాగా, రాక్షసరాజు విశాల వక్షస్థలమందలి మైపూతలు చెదిరిపోయేటట్లు దున్నెడి నాగళ్ళలాగా, శరణాగతుల కన్నులనెడి వెన్నెల పులుగులకు కాంతినీ శాంతినీ కల్పించెడి కలువలఱేని కిరణాల్లాగా, ప్రళయాగ్ని జ్వాలల్లాగా, జాంబూనద పుంజాల్లాగా ప్రతిభాసిస్తున్నాయి. శంఖం, చక్రం, గద, ఖడ్గం, సింగం, తోమరం మొదలైన ఆయుధాలతో ఉద్ధతంగా ఉన్న అతని భుజాలు ఎత్తైన పర్వత శిఖరాల్లాగా, శౌర్య సముద్రానికి చెలియలికట్టల్లాగా ప్రకాశిస్తున్నాయి.

మనోహరమైన మంజీరాలూ (కాలియందెలు), రత్న మణిరంజితాలైన హారాలూ, కేయూరాలూ (బాహుపురులు) కంకణాలూ, మకరకుండలాలూ కిరీటం మొదలైన నానా విధా భూషణాలూ మిఱుమిట్లు గొలుపుతున్నాయి. అతని మెడ కొండకొనల్లాంటి మూడుముడుతలతో నిండుగా ముచ్చటగా ఉంది. అతని క్రీబెదవి గాలి తెరలకు అల్లాడెడి పారిజాత పల్లవంలాగా రోషావేశంతో కంపిస్తోంది.

అతని కోరలు శరత్కాల మేఘమండల మందలి మెఱపు తీగల్లాగా మెఱసి పోతున్నాయి. ఆతని నాల్క కల్పాంత సమయంలో సకల లోకాలనూ మ్రింగి వేయడానికి విజృంభించిన అగ్నిజ్వాలలాగా విచలిస్తూ వెలుగులు చిమ్ముతోంది. అతని నోరూ, నాసికారంధ్రాలూ మేరుమందర పర్వత గుహాంతరాళాల్లాగా విశాలంగా ఉన్నాయి. ఆ విశాల నాసికారంధ్రాల నుండి వెల్వడెడి ఉచ్ఛ్వాస వాయువుల సంఘట్టనకు సప్తసముద్రాలు సంక్షుభితాలవుతున్నాయి. ఆతని నేత్రాలు ఉదయాద్రిపై ప్రకాశించెడి భానుమండలంలాగా ఉన్నాయి. ఆ నేత్రాంచలాలనుండి వెలుపడుతున్న అగ్నికణాలు నక్షత్ర గ్రహ మండలాలను నిరోధిస్తున్నాయి. ఇంద్రధనువు లాంటి కనుబొమలు ముడివడడంచేత అతని ముఖం భయంకరంగా ఉంది. అతని గండస్థలాలు (చెక్కిళ్లు) గండశైలాల్లాగా నిండుగా ఉన్నాయి.

అతనిమెడజూలు సంజకెంపుజాలతోనొప్పెడిమేఘపంక్తులతో సరితూగుతూ ఆకాశపర్యంతం వ్యాపించాయి. ఆ జూలు విదలింపులు తట్టుకోలేక గగనగత విమానాలు కొన్ని కంపించగా కొన్ని పడిపోతున్నాయి. శంఖంలాగా తెల్లగాఉన్న అతని చెవులు నిశ్చలంగా నిక్కపొడుచుకుని ఉన్నాయి. కేసరాలు, సముద్ర మధన సమయంలో మందర పర్వత పరిభ్రమణ వేగానికి ఉవ్వెత్తుగా లేచి నభోమండలానికి నవశోభను కల్పించెడి పాలకడలి అలల తుంపరల్లాగా ఉన్నాయి. ఆతని రోమాలు పర్వసమయ మందలి నిండుచంద్రుని కిరణాల్లాగా తెల్లగా ఉన్నాయి. అతని గర్జాధ్వనికి అష్టదిగ్గజాల కర్ణపుటాలు బద్దలౌతున్నాయి. అతని శరీరం వెండికొండలాగా సమున్నతంగా దుర్నిరీక్షంగా ఉంది. అతని దేహ కాంతులు వైరివీరుల గర్వాంధకారాన్ని పటాపంచలు చేస్తున్నాయి ప్రహ్లాదుని రంజింపజేయడానికి అంతరంగంలో కరుణారసాన్ని, హిరణ్యకశిపుని భంజించడానికై బహిరంగా వీరరసాన్ని పరిపోషిస్తూ అద్వితీయ ప్రభాసంపన్నుడైన శ్రీహరి, నృసింహుడుగా ఆవిర్భవించేసరికి అందరూ నివ్వెరపోయారు.

హిరణ్యకశిపుడు ఆ భీకర దృశ్యం చూచి గజగజ కంపించిపోయి - ఔరా . ఆశ్చర్యంగా ఉన్నదే. కేవలం నరుడూ కాడు. కేవలం సింహమూ కాదు. నరాకారమూ సింహాకారమూ కూడి ఉంది. ఇది శ్రీహరి మాయారచన కాని అన్యం కాదు. బాలుడు తెగబడి మాటలాడేసరికి శ్రీహరి తన సర్వవ్యాపకత్వాన్ని ప్రతిష్ఠించడానికి ఇలా నరసింహ శరీరం ధరించి నిశ్చయంగా నన్ను శిక్షించడానికి వచ్చాడు. హరిచే నాకు మృతి తప్పదని భావిస్తాను. అయినా విక్రమించి అందఱూ నా సొంపూ పెంపూ చూస్తూండగా ఉద్యమిస్తాను. నా వైరిని హరిస్తాను - అని మనస్సులో అనుకున్నాడు. ధైర్యం సడలిపోయింది.

అయినా లేని ధైర్యం తెచ్చుకున్నాడు. తత్తరపాటుతో గదనెత్తి గర్జించుచు సింహాన్ని సమీపించెడి గంధగజంలాగా నృసింహుని కెదురుగా నడిచాడు.

కాని ఆ దేవదేవుని దివ్యతేజః పుంజంచేత ఆకృష్టుడై కార్చిచ్చును దగ్గఱిన మిణుగురు పురుగులాగా నిస్తేజుడూ నిశ్చేష్టుడూ అయ్యాడు. ఏం చెయ్యాలో అతనికి తోచలేదు. రాజేంద్రా! తిరిగీ విశ్వసృష్టి చెయ్యాలనే సంకల్పంతో ప్రళయాంత సమయమందు బ్రహ్మాండ భాండాలను నిరోధించెడి చీకట్లను దిగద్రావెడి సాత్త్విక తేజోరాశియైన మహావిష్ణువు ముందు తామసుల ఆటలు సాగుతాయా ?

రాక్షసరాజు మహోద్దండమైన గదాదండాన్ని గిరగ్గిర త్రిప్పుతూ నరసింహునిపై విసిరాడు. కాని, ఆ దేవుడు దర్పంతో సర్పాన్ని ఒడిసి పట్టుకొనిన గరుత్మంతునిలాగా రాక్షసుని పట్టుకొనేసరికి అతడు మహా కోపంతో మిట్టిపడి అటూ ఇటూ గుంజులాడి పట్టు తప్పించుకొని బయటపడ్డాడు. ధైర్యం కూడగట్టుకొని కుప్పించి ఆకాశానికి ఎగిరాడు. పక్షీంద్రుడైన గరుత్మంతుని చరణాల నుండి జాఱిన సర్పంలాగా క్రిందికి ఉఱికాడు. తన భుజాటోపంతో నృసింహుడు కుంటుపడి పోతాడనుకున్నాడు. ఏమాత్రం కలవరం చెందకుండా చెలరేగిన దనుజేంద్రుని చూచి మేఘాల మాటున దాగి పొంచిచూస్తున్న దేవగణాలు తిరిగి తమకు ఆపదలు మూడవుకదా అని శంకించి పరస్పరం మంతనాలు చేస్తున్నారు.

దానవేంద్రుదు మహావీరుడు. రణకోవిదుడు. ఖడ్గం, కవచం ధరించి భూనభోభాగాల్లో చిత్రవిచిత్రగతులతో అవలీలగా దుముకుతున్నాడు.పరిభ్రమిస్తున్నాడు. సాపవపుడేగలాగా అంతరాళంలో అడ్డులేకుండా స్వైరవిహారంచేస్తున్నాడు. నరసింహదేవుడు అతని విజృంభణం సహించలేక పోయాడు. ఇక అతణ్ణి తుదముట్టించాలని నిశ్చయించుకున్నాడు. విశాలమైన ఆ దేవదేవుని ముఖం నుండి అగ్ని జ్వాలలు వెల్వడి భూమ్యాకాశాల నడిమి ప్రదేశమంతా క్రమ్మివేశాయి. ధగధగ మెఱుస్తున్నఆతనికోరలకాంతులకు రాక్షసుని కనుచూపుమందగించింది.ముళ్ళలాంటి ఆతని కేసరాల తాకిడికి మేఘసముదాయం ఛిన్నమై చలించిపోతోంది. ప్రళయ సమయ మేఘాల్లోని విద్యుల్లతల్లాగా ఆతని గోళ్ళు భీకర కాంతులను విరజిమ్ముతూన్నాయి. జూలు విదలించాడు. గర్జించాడు. సంభ్రమపాటుతో నలువైపులా కలయ జూచాడు. కనుబొమలు బంధించాడు. నాల్క ఆడించాడు. ఒక్క గంతువేసి ఆ రాక్షసుని ఒడిసి పట్టుకున్నాడు. పాము ఎలుకను పట్టుకున్నట్లు నరసింహుడు తనను సవిలాసంగాఒడిసి పట్టుకొనేసరికి రాక్షసరాజు ప్రాణభీతితో సొమ్మసిలి అతనికి లోబడి పోయాడు.

రాక్షసుడు సామాన్యుడుకాడు. అతని శరీరం వజ్రకఠినమైంది. బాహువులు దీర్ఘంగా స్ఫురంగా ఉంటాయి. మహోత్సాహి. ఇంద్రాగ్ని యములుకూడా ఆతనికి భయపడతారు. అంతటి వానిని శ్రీహరి అవలీలగా తన తొడల పైచేర్చి గరుత్మంతుడు సర్పాన్ని చీల్చినట్లు తన వాడి గోళ్ళతో చీల్చివేశాడు. అతని హృదయ కమలం నుగ్గునుగ్గయింది. కర్కశాలైన అతని నాడికాసమూహాలు

ఛిన్నాభిన్నమయ్యాయి. విశాలమైన వక్షస్థలం ప్రీలిపోయింది. మాంసం చిన్న చిన్న ముక్కలై పోయింది. నెత్తురు వర్షించింది. నరసింహుడా దుష్ట దనుజుని చీల్చివేసి ఆతని ప్రేవులను కంఠమాలికలుగా ధరించాడు. రక్తసిక్తాలైన ఆతని గోళ్ళుమెరిసి పోతున్నాయి.

రాక్షసుని వక్షఃకవాటాన్ని పగులగొట్టేటప్పుడాతని గోళ్ళు గొడ్డళ్ళలాగా ఉన్నాయి. గంభీరమైన హృదయాన్ని ఛేదించేటప్పుడు గునపాల్లాగా ఉన్నాయి. నరాలను తెగ తెంచునపుడు అవి కొడవళ్ళలాగా గోచరించాయి. పొట్టలోని ప్రేవులను ఖండించునపుడు అంపంలాగా రాణించాయి. తన ఒడి యందున్న దానవుని సంహరించడానికి నరసింహుడు ఏ ఆయుధాన్నీ ఉపయోగించలేదు. సకల శస్త్రాస్త్రాలు ఆతని ఆ వాడి గోళ్ళే. అవి అతి విచిత్రమైనవి దనుజ నాయకుని శరీరపతనానికి సాధనభూతాలైన ఆ గోళ్ళు మహాతేజంతో అగ్నిజ్వాలలను కొంచెపరస్తూ దేవగణాల ముఖాలకు వికాసాన్ని చేకూరుస్తున్నాయి.

అది కేవల పురుషరూపమూ మృగ రూపమూకాని నరసింహరూపం. రాత్రి పవలూకాని సంధ్యాసమయం. ఆకాశం భూమీకాని ఊరు (తొడలు)మధ్య ప్రదేశం. ప్రాణసహితాలూ, ప్రాణరహితాలూకాని గోళ్ళు. ఈ రీతిగా రాక్షసుడు ఆశించని రూపంతో సమయంలో ప్రదేశంలో ఆయుధాలతో శ్రీహరి త్రిలోక కంటకుడైన దానవనాథుని మహోద్రేకంతో వధించాడు. ఆ సమయంలో నరసింహుడు భయంకరమైన అగ్నిజ్వాలలాగా దుర్నిరీక్షంగా ఉన్నాడు. అతని ముఖం క్రూరంగా ఉంది. నాల్క పాము నాల్కలాగా భయదంగా ఉంది. కేసరాలు రక్తసిక్తాలయ్యాయి. ప్రేవులు కంఠమాలలుగా ధరించాడు. దనుజుని హృదయ కమలాన్ని చీల్చిన ఆ దేవదేవుడు ఏనుగు కుంభస్థలాన్ని విదళించి సగర్వంగా వస్తున్న మృగరాజులాగా ఉన్నాడు. నెత్తుట దోగిన కత్తుల్లాంటి ఆతని గోళ్ళు సంధ్యారాగం చేత ఎఱ్ఱనైన చంద్రరేఖల్లాగా ఉన్నాయి అలా హిరణ్యకశిపుడు నిహతుడయ్యేసరికి రాక్షస వీరులు సహింపలేకపోయారు. పౌరుషంతో చేతి కందిన ఆయుధాలు తీసుకొని తత్తరపాటుతో రణాయత్తులయ్యారు అలా వేలకొలది వచ్చిపడిన దానవ యోధులను శ్రీహరి చక్రాది యుద్ధసాధనాలతో ఒక్కడు కూడా మిగలకుండా చక్కాడాడు.

అలా రక్షో వీరుల నందఱిని వధించి నృసింహుడు రణ సంరంభం చాలించాడు. లోకభీకరంగా చూస్తూ రాక్షసేంద్రుని సింహాసనం అధిష్ఠించాడు. మహోగ్రహంతో ఉన్నాడు. అతని ముఖం భయంకరంగా ఉంది. అచట నున్న వారందఱు ఆతని మోహాకారాన్ని చూచి భయపడి దాక్కున్నారు. అతని దగ్గఱకు వచ్చి అతణ్ణి తేరి చూడడానికి గాని పలకరించడానికి సాహసించలేక పోతున్నారు. అపుడు దేవాంగనలు మహానందంతో ఆ పరమ పురుషునిపై పుష్పవృష్టి కురిపించారు, ఆకాశ

మార్గాన దేవతా విమానాలు మహోత్సాహంతో అటూఇటూ తిరుగుతున్నాయి. గంధ ర్వులు గొంతెత్తి మధురంగా పాడుతున్నారు. అప్సరలు నేత్ర పర్వంగా నాట్యాలు చేస్తున్నారు. దేవదుందుభులు అవిరళంగా మ్రోగుతున్నాయి. సునందుడు, కుము దుడు మొదలైన శ్రీహరి పార్శ్వచరులనూ, బ్రహ్మరుద్రేంద్రాదులనూ మున్నిడు కొని దేవతలు, కిన్నరులు, కింపురుషులు, పన్నగులు, సిద్ధులు, గరుడులు, గంధర్వులు, చారణులు, విద్యాధరులు మొదలగు వారున్నూ ప్రజాపతులున్నూ శ్రీ నరసింహస్వామిని దర్శించాలనే కుతూహలంతో అచటికి తరలి వచ్చి ఆ దేవే శుని విడివిడిగా ఇలా స్తుతించడం మొదలుపెట్టారు.

## బ్రహ్మాదిదేవతలు నృసింహుని వేర్వేఱ స్తుతించడం

దేవేశా! నీవు లీలా వినోదంగా లోకాలను కల్పిస్తావు. రక్షిస్తావు. భేది స్తావు. నీ శక్తి దురంతమైనది. నీ తేజం అనంతమైనది. నీ వీర్యం విచిత్రమైనది. నీ చేష్టలు నిత్యపవిత్రాలు. నీవు అవ్యయాత్ముడవు. నీ అనుగ్రహాన్ని ఆకాంక్షించి నీకు నేను నమస్కరిస్తున్నాను-అన్నాడు బ్రహ్మ.

సురవరేణ్యా! మున్ముందు ఎప్పుడో వేయి యుగాల తరువాతగాని నీ దురంత కోపానికి ఇది తగిన వేళకాదు. దేవ విరోధియైన నిశాచరుని వధించావు. ఇతడు ఆతని కొడుకు. నీకు భక్తుడు. వినిర్మల చరిత్రుడు. పవిత్రుడు. కరుణించి వీనిని రక్షించు-అని రుద్రుడు ఉద్రేకంతో అన్నాడు.

ప్రభూ! ప్రాణికోటి హృదయ కమలాల్లో వసించి భాసించెడి నీకు సమస్తమూ తెలుసు. ఇంత కాలమూ ఈ దానవుని వలన ఎంతలేసి బాధలు పడ్డామో! ఈనాడు మమ్మల్ని రక్షించావు. రాక్షసుని వధించావు. మాకు మా హవ్య కవ్యాలు తిరిగి లభించాయి. మాకు తిరిగి ప్రాణాలు లేచివచ్చాయి. నీపాదసేవ మరిగినవారు మోక్షవిభవాన్ని కూడా కాంక్షించరు. అస్థిరాలైన ఇతర సుఖాలు కాంక్షిస్తారా? అనంత భక్తితో నిన్ను సేవించే భాగ్యం మాకు ప్రసాదించు-అని ఇంద్రుడు సన్నుతించాడు.

దేవా! నీవు మహాదరంతో లోకాలను సృజించి రక్షింపగా ఈ దానవేశ్వ రుడు దౌష్ట్యంతో వానిని భేదించే సరికి అవి తరిగిపోయాయి. నీవు ఆ దుష్టుని నరసింహాకృతితో వధించి వేదవిధిని తిరిగి లోకాలను ఉద్ధరించావు: ధర్మాన్ని రక్షించావు-అని ఋషులు ప్రణుతించారు.

ఆత్మేశ్వరా! శ్రాద్ధ కర్మల్లో మా కొడుకులు తిలజల పూర్వకంగా పిండ ప్రదానం చేస్తే ఈ దుండగుడు ప్రచండ కోపంతో అడ్డుతగిలి మా కీయకుండా

తానే గ్రహిస్తాడు. ఆ దుష్టుని నీవు నీ శిత నఖరాలతో చీల్చిచంపావు—అని పితృ దేవతలు ప్రస్తుతించారు.

నృసింహా! క్రుద్ధుడై మా అణిమాది సిద్ధులను హరించిన దైత్యుని సంహ రించావు. నీవు మహాయో ద్ధవు. నీ అనుగ్రహంచేత మాసిద్ధులు మాకు తిరిగి సంక్రమించాయి- అని సిద్ధులు స్తుతించారు.

మహాత్మా! రాక్షసుని సంహరించి మా అంతర్ధానాదిక విద్యలన్ని తిరిగి మాకు అనుగ్రహించావు. నీ వైభవం నిరుపమం. విచిత్రం-అని విద్యాధరులు వినుతించారు.

ఈశ్వరా! దానవుడు మా రత్నాలనూ కాంతా రత్నాలనూ, కారుణ్యం లేకుండా కాజేశాడు. వాని వక్షాన్ని చీల్చి వధించావు. మా రత్నరాసులు మాకు దక్కాయి. మా పత్నులు మాకు తిరిగి లభించారు. మేం బ్రతికి పోయాం-అని ఉరగులు కీర్తించారు.

విశ్వేశా! దుర్జయుడైన దైత్యునివధించి వర్ణాశ్రమ ధర్మాల్లో పడిన గండిని పూరించావు. నిన్ను కొలిచి బ్రతికే వారమైన మేం నిన్ను ఏమని పొగడగలం- అన్నారు మనువులు.

లోక శుభంకరా! ప్రజా సృష్టికోసం నీవు మమ్మల్ని సృజించావు. కాని దైత్యుని ఆజ్ఞచే మేం మా విధిని పాటించలేక ఎంతో బాధ పడ్డాం. నీవు సంకో చించకుండా ఈనాడు రాక్షసుని వక్షం చీరి వధించి వేశావు. ఇకనుంచి మేం ప్రజా సృష్టి యథావిధిగా చేస్తాం- అని ప్రజాపతులు ప్రస్తుతించారు.

నిశాచరుని కొలువులో మేం రాత్రింబవళ్ళు ఆడేవాళ్ళం, పాడేవాళ్ళం. అయినా అతడు అదయంగా మమ్మల్ని అమితంగా బాధించేవాడు. నీ వలన ఈనాడాతడు యమసదనం చేరాడు. పాతకుడైనవానికి ఎన్నడైనా శుభం కలుగుతుందా? - అని గంధర్వులు బంధురమైన ఆనందాతిరేకంతో పొంగిపోతూ అన్నారు.

పరమాత్మా. జగజ్జన హృదయ కంటకుడు, సురవిరోధి హిరణ్యకశిపుడు నేడు నీచే నిహతుడయ్యాడు. సాంసారిక వ్యాధులను నివర్తింపజేసెడి నీ చరణ యుగళాన్ని ఆశ్రయించి జీవిస్తాం-అని చారణులు పారవశ్యంతో ప్రణుతించారు.

జగన్నాయకా! మాకెన్నడూ భంగపాటు లేదు. పతనం లేదు. అలాంటి మాపై ఎక్కి ఈ కిరాతకుడు అన్ని దిక్కులూ తిరిగేవాడు. నీవు నీవాడి గోళ్ళతో వీనిని కడతేర్చావు. మా ఆపదలు తీర్చావు - అని యక్షులు అక్షీణమైన ఆనం దంతో అర్చించారు.

పురుషోత్తమా! మేం అల్పులం, నిన్ను కీర్తించగల సామర్థ్యం మాకు లేదు. ఇతడు దుష్ట పురుషుడు. సాధువులయెడ ఎంతో పరుషంగా వర్తించెడివాడు.

ఇతణ్ని కూల్చావు లోకాలు ఊపిరి పీల్చుకున్నాయి - అని కింపురుషులు కీర్తించారు.

ఆర్తజన శరణ్యా ! ముల్లోకాలకు శత్రువైన ముష్కరుడు ఈ నిశాటుడు. వీడు ఈనాడు నేలకూలాడు. కొలువుల్లో క్రతువుల్లో ఇక నిర్భయంగా నీ శుభ గీతాలు గానం చేస్తాం — అని వైతాళికులు కైవారాలు చేశారు.

శ్రీహరీ! ఈ పాపాత్ముడు ధర్మాన్ని ఆలోచించడు. మాచే నీచ కార్యాలు చేయించాడు. ఈ దుష్కర్ముని పీడ వదలిపోయింది. ఇక నిన్ను భక్తితో నిరంతరం సేవిస్తాం - అని కిన్నరులు సన్నుతులు చేశారు.

ఈశ్వరా ! సనకసనందనుల శాపవశంచేత క్రూరనిశాటగా జన్మించిన వీనిని సంహరించి నీవు వీనిని అనుగ్రహించావు. కాని కీడు చేయలేదు. భక్తితో నిన్ను సేవించే దానికంటే నీతో వైరం వహించడం వలన నిన్ను శీఘ్రంగా సులభంగా చేరవచ్చు. నీ నారసింహ శరీరం పరమాద్భుతమైనది. అందరి ఆపదలు తొలగిపోయాయి - అని విష్ణుసేవకులు వినుతించారు.

ఇలా బ్రహ్మరుద్రేంద్రాలు, సిద్ధులు, సాధ్యులు మొదలైన దేవముఖ్యులు వేత్త్వేఱుగా శ్రీ నారసింహుని అనేక విధాలుగా ప్రస్తుతించారు. అయినా ఆ దేవుని రోష సంరంభం తగ్గలేదు. ఆతణ్ణి దగ్గఱడానికి ఎవరూ సాహసించలేకపోయారు. అపుడు వారందఱు లక్ష్మీదేవిని పిలిచి - నీవు శ్రీహరికి పట్టపుదేవివి. హరిని సేవించడంలో నైపుణ్యం కలదానవు. హరికి ప్రీతిపాత్రురాలవు. నీవు వెళ్ళి నరహరి రోషాన్ని తగ్గించు - అని అర్థించేసరికి ఆమె అంగీకరించి ఆ కలకంఠకంఠి నరకంఠీరవుని (నరసింహుని) ఉపకంఠానికి (సమీపమునకు) వెళ్ళి ఆ దేవుని భీకరాకృతిని చూచి యిలా తలపోసింది.

అహో! ఏమి యీ భీకరాకారం? శ్రీహరి వలన నేనెన్నడూ విన్నదికాదు. ఎక్కడా చూచిందీ కాదు. ముఖం లయసమయ సూర్యమండలంలాగా ఉంది కాని పున్నమినాటి పూర్ణ చంద్రబింబంగా లేదు. వీరరసం, రౌద్రరసం, అద్భుతరసం పెనవేసుకున్నాయి కాని ఎక్కడా కృపారసం గోచరించడం లేదు. చూపులు జ్వలదగ్ని శిఖల్లాగా ఉన్నాయి కాని ప్రసాదభాసురాలుగా లేవు. దంష్ట్రాంకురాలు భీకరకాంతులను విరజిమ్ముతున్నాయి కాని అరవిరిసిన తామర పువ్వుల్లాగా లేవు. కఠినములైన గోళ్ళతో గూడిన నరసింహ విగ్రహంకాని కామినీ జనానికి సులభమైన సుందర విగ్రహం కాదు - అని శంకిస్తూ లక్ష్మీదేవి వెళ్ళి పలకరించాలని ఉవ్విళ్లూరుతుంది.... పలుకరిస్తే అలుకతో మాఱుపలుకడేమో అని నిలిచిపోతుంది. హృదయంలో చనువూ భయమూ పెనవేసికొనగా ఆమె శంకించి ఆతడు శాంతుడైన తర్వాత దగ్గఱకు వెళ్ళడానికి నిశ్చయించుకుంది. బ్రహ్మదేవుడు ఆమె మనోగతం

గ్రహించాడు. నృసింహుని రోషం నివారించడం ఒక ప్రహ్లాదునివల్ల తప్ప ఇతరుల వలన సాధ్యం కాదనుకున్నాడు.

వెంటనే అతణ్ని పిలిచి - నాయనా ! నీ తండ్రి నిమిత్తంగా శ్రీహరి దాల్చిన భీషణాకారం అలాగే ఉంది. అతడు క్రోధం విడువలేకున్నాడు. నీవు మెల్లగా అతణ్ని శాంతింపచెయ్యి - అనేసరికి 'అలాగే' అని పరమభాగవతోత్తముడైన ప్రహ్లాదుడు చేతులు జోడించి మందగమనంతో నృసింహుని సాన్నిధ్యానికి వెళ్ళి సాష్టాంగ దండప్రణామం చేశాడు. భక్తపరాధీనుడైన ఆ ఈశ్వరుడు ఆ బాలుని ఆలోకించి కరుణాతరంగితాంతరంగుడై అతణ్ని దగ్గరకు పిలిచాడు. కృపారసం తొణికిసలాడుతూన్న కన్నులతో చూచాడు. యముడను కాలసర్పానికి భీతిల్లెడివారికి అభయదానం ఇవ్వడంలో ప్రశస్తమైన తన శుభహస్తాన్ని అతని తలపై ఉంచాడు. అలా శ్రీహరి మంగళహేతువైన తన చేతితో ప్రహ్లాదుని స్పృశించేసరికి అతని భయం తొలగిపోయింది. బ్రహ్మజ్ఞానం కలిగింది. శరీరం పులకించింది. ఆనందాతిశయంతో అశ్రుబిందువులు స్రవించాయి. స్వరం కంపించింది. వినయం వివేకం విపృద్ధమయ్యాయి. చిత్తం ఏకాగ్రమైంది. భక్తిపరత్వంతో ఆ దేవుని చరణకమలాలను హృదయంలో నిలుపుకొని ముకుళితహస్తుడై యిలా సన్నుతించాడు.

## ప్రహ్లాదుడు నృసింహ దేవుని ప్రస్తుతించడం

శ్రీహరీ ! దేవతలు, మహర్షులు, సిద్ధులు, బ్రహ్మాదులు కూడా తత్పరత్వంతో నిత్యం నిన్ను గురించి వితర్కించి పూర్తిగా సన్నుతించలేరట. అలాంటప్పుడు రాక్షసుని కడుపున పుట్టి గర్వోన్మత్తుడైన బాలుడనగు నేను జడబుద్ధితో నిన్ను నుతించగలనా ? ఈశ్వరా . నిన్ను సంతుష్టుణ్ణి చెయ్యాలంటే గజేంద్రుని లాగా భక్తితత్పరత్వంతో నిన్ను సేవించాలి, కాని జపం, తాపం, వంశం, తేజం, శ్రుతం, అందం, ఉద్యోగం, నైపుణ్యం ప్రతాపం, పౌరుషం, నిష్ఠ, బలం, ప్రజ్ఞ, జపం, యాగం - ఇవేవీ పనికిరావు.

నిర్మల జ్ఞానం, దానధర్మరతి, సత్యం, సహనం, నిర్మత్సరత్వం, యజ్ఞం, తపం, అనసూయ - కలిగి దర్పించే బ్రాహ్మణుని కన్న మనస్సును, ఆత్మాన్ని ప్రాణాలనూ, వాక్కులనూ, కర్మములను సమభావంతో నీయందు లగ్నం చేసిన చండాలుడు మేలు. తుదకు అతడు తన వంశ సంపదను కీర్తిని వృద్ధి చేసినవాడౌతాడు. ఈశ్వరుడు కృపాళుడు కనుక అజ్ఞుడు చేసిన అపరాధాలను పట్టించుకోడు. అతడు సంపూర్ణుడు. నీవు కోరదగిన అర్థమేమీ లేదు. అయినా భక్తులను అనుగ్రహించడానికి వారిచ్చే అర్థాలను స్వీకరిస్తావు. కాని వాస్తవంగా ఈశ్వ

రార్పణ బుద్ధితో వారు నీకు సమర్పించేదంతా తిరిగి వారియందే పర్యవసిత మవుతుంది. ఎలాగంటే మానవుడు తన ముఖాన దిద్దుకున్న బొట్టు అద్దంలో ఛాయారూపంలో అతనికే తిరిగి గోచరిస్తుంది. కాని అది అద్దానికి సంక్రమించదు. అలాగే నీకర్పించే అర్ఘ్యాదులు నీ ఛాయలాగా వర్తించి తిరిగి ఆరాధకులకే సంక్రమిస్తాయి. కనుక నిన్ను భక్తితో భజించాలి.

నేను అల్పుడను, అయినా వెలపులేకుండా నా శక్తి కొలది నిన్ను నుతిస్తాను. నిన్ను కీర్తించడంవలన పురుషుడు మాయను జయించి ముక్తి పొందుతాడు. సర్వేశా! సాత్త్వికుడవైన నీ యాజ్ఞలను తలదాల్చి నిర్వహించెడి బ్రహ్మాదులు, దేవతలు నీయీ భీకరాకారం చూచి భయపడుతున్నారు. రోషం మాను - నీ మనోహరాకృతులు శుభంకరాలుగాని తేళ్లూ, పాములూలాగా భీకరాలు గావు. రాక్షసుని మర్దించావు. సాధువులకు హర్షం కలిగింది. నీవు అవతరించిన పని తీరింది. ఇంకా అలుక దేనికి? లోకులు నిన్ను కలుషహారివనీ, సంతోషకారివనీ అంటారు కదా!

అయితే వాడి కోరలతో, బొమముడితో, నిక్కబొడుచుకొన్న జూలుతో, పదనైన గోళ్ళతో, రక్తకేసరాలతో, ప్రేగుల దండలతో, అగ్నిగోళాల్లాగా కణకణలాడుతూన్న నేత్రాలతో, గర్జాధ్వనితో భయంకరంగా ఉన్న నీ నరసింహాకృతిని చూచి నేను భయపడను. కాని సకలానర్థాలకు మూలమైన సంసార దవాగ్నికి మాత్రం భయపడతాను. నన్ను నీ పాదాశ్రయునిగా కృతార్థుణ్ని చెయ్యి. సకలయోనులయందు జన్మించి సుఖవియోగంవలనను, దుఃఖసంయోగం వలనను జనించిన శోకాగ్నిచే పరితప్తుడనై, దుఃఖనివారకంగాని దేహాభిమానంచేత మోహితుడనై పరిభ్రమించెడి నాకు నీవే ప్రియుడవు, సఖుడవు, పరదేవతవు. బ్రహ్మగీతాలైన నీ లీలావతార గాథావిశేషాలను కీర్తిస్తూ రాగాదులనుండి విముక్తుడనై దుఃఖసాగరాన్ని తరించి నీ చరణ స్మరణ సేవానిపుణులైన భక్తులతోకూడి ఉండేలాగా అనుగ్రహించు.

బాలుని, తల్లిదండ్రులు-రోగిని, వైద్యుడిచ్చిన ఔషధం-సముద్రంలో మునిగే వానిని నావ, తప్ప ఇతరులు రక్షింపలేరు. అలాగే సంసార తాపంచేత సంతప్తుడై నీ చేత ఉపేక్షింపబడ్డ వానిని ఎన్నటికైనా నీవుకాక అన్యుడు రక్షింపలేడు. లోకంలో ఎవ్వడేపని, ఎవనిచేత ప్రేరితుడై, ఏ యింద్రియాలతో, ఎందుకోసం, ఎవని నిమిత్తం, ఎచట, ఏ సమయంలో, ఏ రూపంలో, ఏ గుణంతో అపరమైన జనక భావంతో చేసి పరమైన బ్రహ్మభావంతో రూపాంతరం కల్పిస్తాడో ఆ వివిధ ప్రకారాలు నిత్యముక్తుడవూ, రక్షకుడవూ అయిన నీవేకాని అన్యంకావు. నీ అంశమైన పురుషునకు నీ అనుగ్రహంచేత కాల ప్రేరితమైన నీ మాయ, గుణ సంయోగం చేత కర్మమయమైన మనస్సును సృజిస్తుంది. మాయా కల్పిత వికారాలు కలిగి వేదోక్త

కర్మమయమై సంసార చక్రాత్మకమైన ఈ మనస్సు నీ సేవవలననే తరిస్తుంది. కాని మరోవిధంగా కాదు. విజ్ఞానంచేత నీవు బుద్ధిని, గుణాలను నిర్మించావు. నీ అనుగ్రహంవలన కార్యసాధన శక్తిని వశపరచుకొన్న కాలం, మాయతో గూడి కర్మేంద్రియాలు, జ్ఞానేంద్రియాలు, పంచప్రాణాలు, మనస్సు- అనెడి పదునాలు వికారాలతో గూడిన సంసార చక్ర నిర్మాణం చేస్తోంది. దేవా! అలాంటి సంసారమనెడి కార్చిచ్చుచే సంతప్యమానుడనైన నన్ను రక్షించు.

దిక్పాలకుల సంపదా, ఆయువూ, వైభవం శాశ్వతాలనుకొని జనులు వాటి కోసంతపిస్తారు. కాని క్రుద్ధుడై అట్టహాసం చేస్తూ మా తండ్రి కనుబొమముడిచేసరికి అవన్నీ నశించాయి. అలాంటి మహా వీరుడ్ని నీవు క్షణకాలంలో ఇట్టే మట్టిలోకలిపావు. కనుక ఆ సంపదలూ, వైభవాలు ఏవీ స్థిరాలు కావు. బ్రహ్మాదుల శ్రీ వైభవాలు జీవితాలు కూడా కాల రూపకుడైన భగవంతుని చేత నశ్వరాలే. అవేవీ చిరకాలం నిలిచేవి కావు. అంచేత నాకు అవేవీవద్దు నా పూర్వజన్మ సుకృతం చేత నాకు నిన్ను గూర్చిన జ్ఞానం ఒకింత ఉంది. కనుక నీకు కింకరుడనై నిన్ను కొలుస్తాను.

భౌతిక సుఖాలన్నీ ఎండమావుల్లాంటివి. అవి నిరర్థకాలు. శరీరం రోగాల పుట్ట. అయినా మానవుడు విరక్తి చెందడు. ఎప్పుడూ ప్రచండమైన కామాగ్నిచే సంతప్తుడవుతూ ఉంటాడు. దుష్టములైన భౌతిక సౌఖ్య పరంపరలకు లొంగి యేనాటికి ముక్తుడుకాడు. హరిహర బ్రహ్మలకు కూడ నీవు నీ మహోద్దామమైన చేతితో అభయ ప్రదానం చెయ్యవు. నేను బాలుడను తమోగుణ ప్రధానమైన రాక్షస వంశంలో పుట్టినవాడను, రాక్షసుడను. ఉగ్రమై రజోగుణంతో కూడిన వాడను. అయినా నిరవధికమైన అనురాగంతో నీవు నీ పాణికమలంలో నా తల స్పృశించి నాకు అభయదానం చేశావంటే చోద్యం కాదూ

మహాత్మా సజ్జనులైన బ్రహ్మాదులందును, దుర్జనులమైన మా యందును సేవానుగుణంగా పక్షపాతంగాని ద్వేషభావంగాని లేకుండా కల్పవృక్షంలాగా సమదృష్టితో ఫలప్రదానం చేస్తావు. విషయ సుఖాలకు ఆకరమైన సంసార కూపంలో కాలుతూన్న మూఢులతో గూడి నేను నీ సేవకుడైన నారదమహర్షి కారణంగా నేను నీ కృపకు పాత్రుడనయ్యాను. నా తండ్రిని వధించి నన్ను నీవు రక్షించడం నా యందుగల పక్షపాత దృష్టితో కాదు. దుష్ట రాక్షసులను సంహరించడం శిష్టులైన నీ భక్తులను మునులను రక్షించడం నీ నైజగుణాలు. ఈ విశ్వం అంతా నీవే. గుణాత్మకమైన విశ్వాన్ని సృజించి అందులో ప్రవేశించి కారణ భూతాలైన గుణములతో కూడినవాడవై రక్షకుడు సంహారకుడు మొదలైన రూపాలు వహిస్తావు. సత్కార్యాలకు అసత్కార్యాలకు, కారణభూతమైన విశ్వానికి

నీవు పరమ కారణమవు. నీ మాయచేత స్వపరబుద్ధి వికల్పం ద్యోతకమవుతుంది గాని వాస్తవంగా నీ కంటె అన్యమైనదేదీ లేదు.

బీజం వృక్షంగా పరిణమించినా వృక్షం దానికంటె భిన్నమైనది కాదు. అలాగే నీ వలన సృష్టిస్థితి లయాలను చెందెడి లోకం నీ కంటె వ్యతిరిక్తమైనది కాదు. నీవు సృజించిన విశ్వాన్ని నీ యందు నిలుపుకొని పూర్వం ప్రళయసమయ సముద్రంలో శేషశయ్యపై నిర్వ్యాపారుడవై ఆత్మానందంలో మునిగితేలుతూ నిదురపోయేవాడిలాగా యోగనిమీలిత నేత్రుడవై ఉంటూ కొంతకాలానికి కాల శక్తిచేత సంప్రేరితాలైన సత్త్వాదిగుణాలను అంగీకరించి యోగ సమాధి చాలించిన నీ నాభి నుండి వటబీజం నుండి ఉద్భవించిన వటం (మఱ్ఱి) లాగా నీ యందు అణగి సూక్ష్మరూపంలో ఉన్న ప్రపంచం కమలాకారంలో ఉద్భవించింది. ఆ కమలంనుండి చతుర్ముఖ బ్రహ్మ జన్మించి నలువైపులా చూచాడు. తనకు కారణభూతమైన కమలం కంటె అన్యమేదీ కనబడలేదు. అపుడతడు జలాంత రాళంలో ప్రవేశించి నూఱు దివ్యసంవత్సరాలు వెదకి తన జన్మమునకు మూల కారణమైన నిన్ను చూడలేక తిరిగి కమలం దగ్గఱకు వచ్చాడు. చిరకాలం దుర్భర తపం చేశాడు. పృథ్వియందు గంధంలాగా తనయందేయున్న నిన్ను దర్శించాడు. వేయి ముఖాలూ, పాదాలూ, శిరస్సులూ, చేతులూ, ఊరువులూ, నాసికలూ, చెవులూ, కన్నులూ కలిగి తళతళ మెరసెడి ఆభరణాలతో కాంతివంతములైన ఆయుధాలతో మహాలక్షణ లక్షితుడవై మాయాకలితుడవై నిజకాంతిచే తమో గుణాన్ని దూరీకరిస్తూ గోచరించిన పురుషోత్తముడవగు నిన్ను చూచి విస్మితు డయ్యాడు. అలా మహోగ్రమైన తపస్సుచేసి నిన్ను దర్శించిన బ్రహ్మదేవునకు నీవు హయగ్రీవరూపంతో సృష్టిక్రమాన్ని తెలిపెడి వేదాల నిచ్చావు. అదే రూపంతో మధుకైటభులను అంతమొందించావు.

నీవు మూలపురుషుడవు.... కృత త్రేతా ద్వాపరయుగాలు మూడింటను వివిధ యోనుల్లో అవతరించి లోకాలను భరిస్తూ, హరిస్తూ ఆయా యుగాలకు అనుగుణము లైన ధర్మాలను ప్రతిష్ఠిస్తూ ఉంటావు ఇలా ఆ మూడు యుగాల్లో ప్రత్యక్షావ తారాలతో కార్యసాధనం చేస్తావు. కాని కలియుగంలో అలాకాక గూఢ వర్తనుడవై దుష్టసంహారం చేసి లోకాలను రక్షిస్తావు.

విషయ సుఖాలు మరగిన మనస్సు నీ చింతనంలో నిలువదు. మాధుర్యాది రసాలు ఆస్వాదించి పరవశించెడి నాల్క నిన్ను కీర్తించదు. కాంతాజన ముఖాలను చూడడానికి కుతూహలపడెడి చూడ్కి నీ ఆకారాలను చూడదు. నానావిధ దుర్భాష లను వినాలని కాంక్షించెడి చెవులు నీ పవిత్ర గాథలను వినవు. నాసిక దుర్గంధాల కోసం తపిస్తుంది. శరీరం వైష్ణవ ధర్మాలను పాటించదు. కర్మేంద్రియాలు అడగి

ఉండవు. సవతులు గృహస్థుని కలవరపెట్టినట్లు అవి పురుషుని కలచివేస్తాయి. ఇలా ఇంద్రియాలచే చిక్కువడి స్వశరీరమందు మిత్రభావాన్ని పరశరీరమందు అమిత్రభావాన్ని వహిస్తూ, చస్తూ, పుడుతూ సంసారమనెడి వైతరణీ నదిలో మునిగిన లోకాన్ని ఉద్ధరించడం నీ కర్తవ్యం. నీవు సృష్టి స్థితి లయకారకుడవు. నిన్ను భక్తితో సేవించెడి నన్ను రక్షించు.

భగవంతుని కథా సుధారసపానంచేత మత్తిల్లిన చిత్తం కలవాడనుగా నేను సంసారమనెడి వైతరణికి జంకను, శోకించను. కాని విభిన్నాత్ములై నీ గుణ కీర్తనం చెయ్యక మాయా మయాలైన విషయ సుఖాలను మరగి సుగతిని గానని మూఢులను చూచి మనస్సులో దుఃఖిస్తాను. దేవా మునీంద్రులకు సహజంగా ఏ కోరికలూ ఉండవు. వారు జితేంద్రియులు. వారు నిర్జనస్థలాల్లో తపోనిష్ఠలో ఉంటారు. అక్కడ వారికి నీవుకాక ఇంకా దిక్కెవ్వరు? కనుక అనన్యబుద్ధితో నిన్నే సేవిస్తారు. కాని కాముకులైన వారిస్థితి అలా కాదు. దురదను పోగొట్టుకొనేందుకు రెండు చేతులతో గోకుటవలన మొదట సుఖంగానే కనపడుతుంది. కాని క్రమక్రమంగా గోకిన కొలదీ అది మరింత హెచ్చి దుస్సహ దుఃఖాన్ని కల్పిస్తుంది. కామం కూడా దురద లాంటిదే. పశుపక్షులకూ, క్రిమికీటక ములకూ సామాన్యమైన మిథునాది కర్మలు గృహమేధికి మొదట సుఖకరంగా కన్పించినా పోనుపోను అవి దురంత దుఃఖాన్ని కలిగిస్తాయి. ఎన్నటికీ సంతుష్టి ఉండదు. నీ అనుగ్రహ విశేషం చేత పురుషుడు వివేకవంతుడై, ఇంద్రియాలను నిగ్రహిస్తాడు.

జితేంద్రియత్వం, మౌనం, వ్రతం, జపం, తపం, శ్రుతం, అధ్యయనం, నైజధర్మవివరణం, ఏకాంతవాసం, సమాధినిష్ఠ - ఈ పది ఇంద్రియ నిగ్రహం లేనివానికి భోగార్థాలయి విక్రయించు జీవనోపాయాల్లాగా, దాంభికులకు సాధారణ ప్రసంగాల్లాగా ఉండి సఫలాలు కాజాలవు. భక్తి లేనివారికి నీ జ్ఞానం లభించదు. రూపంలేని నీకు బీజాంకురాల్లాగా కార్యకారణాలైన సదసద్రూపాలు రెండూ ప్రకాశమానాలవుతాయి. ఆ రెండింటిని భక్తియోగంచేత బుద్ధిమంతులైనవారు మథనం (రాపిడి) వలన కాష్ఠమందు అగ్నిని పొందినట్లు నిన్ను పొందుతారు. పంచభూత తన్మాత్రలు ప్రాణులు, ఇంద్రియాలు మనస్సు, బుద్ధి, అహంకారం, చిత్తం - ఈ సమస్తమూ నీవే. సగుణం, నిర్గుణం నీవే గుణాభిమానులై జనన మరణ చక్రంలో తగుల్కొని పండితులైనవారు కూడా ఆద్యంతాలు తెలియక ఉపాధి రహితుడవైన నిన్నెఱుగరు. తత్త్వజ్ఞులైన విద్వాంసులు వేదాధ్యయనాదులమాని వేదాంత ప్రతిపాద్యుడవైన నిన్ను సమాధి యోగంచేత తెలిసికొని సేవిస్తారు.

కనుక యోగియైనా తపోవ్రత యోగియైనా, వేది (పండితుడు)యైనా, తత్త్వవేదియైనా బ్రహ్మ స్వరూపాన్ని తెలుసుకోవాలంటే నిలయ ప్రాంగణంతో

నీకు సాష్టాంగ ప్రణామంచేసి నీకు మ్రొక్కాలి. నోరారా శుభప్రదాలైన నీ స్తోత్రాలు చెయ్యాలి భక్తిభావంతో సమస్త కర్మములనూ భగవదర్పితంగా ఆచరించాలి నిర్మల చిత్తంతో నీ చరణనీరజాలను ధ్యానించాలి. నీ కథలు చెవులారా వినాలి.... నిన్ను నిరంతరం స్మరించి యజించాలి. కనుక దేవా! నాకు నీ దాస్యయోగం అనుగ్రహించు - అని ముకుళితకరుడై నిలబడియున్న ప్రహ్లాదుని సన్నుతులకు సంతసించి గుణాతీతుడైన శ్రీహరి రోషం విడిచి యిలా అన్నాడు.

బాలకా ! నీ సచ్చరితకు సంతోషించాను. నీకు శుభం కలుగుగాక! నీ మనోభీష్టాన్ని కరుణామయుడనై తీరుస్తాను, చింతించకు. వాస్తవం చెపుతున్నాను. భక్తుల కోరికలు తీర్చడం నా విధి. చర్మచక్షువులతో నన్నెవ్వరూ తేరిచూడలేరు చూడగలిగిన విజ్ఞులకు పునర్జన్మం ఉండదు. అందుకే శ్రేయస్సుల నెఱిగినవాడనైన నేను సాధువులు, విద్వాంసులు అర్థించినదంతా ఇస్తాను. నీవు కూడా ఏదైనా అడుగు ఇస్తాను - అని పరమేశ్వరుడు ప్రహ్లాదుడు నిష్కాముడో కాదో పరీక్షించాలనే భావనతో అన్నాడు. ప్రహ్లాదుడు సామాన్యుడా ? అతడు నిష్కాముడు, ఏకాంత భక్తుడు. కామం భక్తి యోగానికి అంతరాయం అని యెఱిగినవాడు. అందుచేత యిలా సమాధానం చెప్పాడు.

పరమేశ్వరా! పుట్టినప్పటి నుంచి ఏ కోరికలూలేని నాకు నీవు "కోరిన కోర్కెలిస్తా - అడుగు"మని అనడం నన్ను వంచించడానికి కాదూ! కోర్కెలు సంసార బీజాలు. హృదయ బంధకాలు. వాటికి వెఱచి నేను మోక్షకాంక్షతో స్వీయ శ్రేయస్సుకోసం నిన్ను ఆశ్రయించాను. ఇంద్రియాలు, ప్రాణాలు, మనస్సు, శరీరం, బుద్ధి, సిగ్గు, స్మృతి, ధైర్యం, జ్ఞానం, సత్యం, తేజం - ఈ మొదలైనవి ఎప్పటికైనా నశించేవే. అటువంటివి ఆశించినవారి కెన్నడూ మోక్షం రాదు. భృత్యులు అర్థకాములై రాజులను సేవిస్తారు. రాజులు ఏదో స్వప్రయోజనం కాంక్షించి భృత్యుల కోర్కెలు తీరుస్తారు. నీ నా సంబంధం అలాంటిది కాదు. నాకు ఏ కోర్కెలూ లేవు. నా వలన నీకూ ఏ ప్రయోజనమూ లేదు. అయినా నీవు నాపై అవ్యాజంగా కోరిన కోర్కెలిస్తానంటున్నావు కదా' అయితే నాకు ఏ కోర్కెలు లేకుండా వరం అనుగ్రహించు. నిష్కాముడైనవాడు నీలో సమానమౌతాడు - అని ప్రహ్లాదుడు ప్రణవపూర్వకంగా నమస్కరించేసరికి శ్రీహరి యిలా అన్నాడు.

నీ వంటి జ్ఞానులు, ఏకాంతభక్తులూ నన్ను ఏదీ కోరడానికి అంగీకరించరు. అయినా నేనే నీకు వరం ఇస్తున్నాను. నీవు ఈ లోకంలో రాక్షసనాథుడవై ఒక మన్వంతరకాలం అఖిల భోగాలూ అనుభవించు. నిర్మల బుద్ధితో నా కథలు విను. నేను సకల భూతాంతర్యామిని. యజ్ఞేశ్వరుడను. ఈశ్వరుడను. నీవు నన్ను

ఆత్మలో ప్రతిష్ఠించుకొని కర్మదూరుడవై ఈశ్వరార్పణంగా నాకు పూజలు చెయ్యి. భోగాలతో పుణ్యం నశిస్తుంది. వ్రతాలతో పాపాలు తొలగిపోతాయి. కాల క్రమంలో నీవు శరీర త్యాగంచేసి దిగంతవ్యాప్తమై ఇంద్రాదులచే కొనియాడబడెడి యశస్సుతో భవబంధాలనుండి విముక్తుడవై నన్ను చేరతావు. ప్రేమభావంతో నా యీ అవతార విశేషాలనూ నీ ఉదార స్తోత్ర వాక్యాలనూ మన్నించేవానికి పునర్జన్మం ఉండదు. కర్మబంధాలు తొలగిపోతాయి - అని నృసింహదేవుడనేసరికి ప్రహ్లాదుడిలా అన్నాడు—

పరమేశ్వరా ! పూర్వం నీవు వరాహావతారం ధరించి తన తమ్ముడైన హిరణ్యాక్షుని వధించావనే క్రోధంతో మా తండ్రి హిరణ్యకశిపుడు లోకేశ్వరుడవైన నిన్ను ఎఱుగక నీపై కత్తికట్టాడు. నీ భక్తుడనైన నన్ను వైరిగా భావించి నన్నెంతో బాధించాడు. నేడు నీ శాంతి దృష్టిచేత నిర్మలత్వం పొందాడు. కనుక అతడు పాపవిముక్తుడై శుద్ధాత్మకుడయ్యే లాగా వరం వేడుకుంటున్నాను. అనుగ్రహించు - అనగా భక్తవత్సలుడైన శ్రీ హరి అతనికి ఇలా అన్నాడు.

నీవు నాకు నిజభక్తుడవు నిన్ను కనడంవల్ల నీ తండ్రి గతించిన ఇరువది యొక్క తరముల వారితో గూడి విశుద్ధుడై వర్తిస్తాడు. విజ్ఞానమనెడి దివ్వెచే సంసారమనేడి చీకటిని తొలగించగల మునీంద్రులు ఏ దేశంలో ప్రశాంతంగా జీవించగలుగుతారో ఆ దేశవాసులు దుర్జనులైనా వారు పరిశుద్ధులైనా అనుగ్రహానికి పాత్రులౌతారు. అందులో సందేహం లేదు.

ప్రాణికోటిలో ఎవరైనా నీలాగా నిష్కామంగా నన్ను సేవిస్తే నాకు భక్తులౌతారు. నా భక్తులందరికి సాధువర్తనుడవూ భక్తాగ్రగణ్యుడవూ అయిన నీవు ఆదర్శప్రాయుడవౌతావు. ఇక నీవు నీ మనస్సును నా యందునిలిపి వేదవిహిత పద్ధతిని నీ తండ్రికి ప్రేత కార్యాలు నిర్వర్తించు. అతడు రణరంగంలో నా శరీర స్పర్శచేత నిర్మల దేహుడై పాపముక్తుడై నవ్యతేజంతో పుణ్యలోకాలకు వెళ్తాడు- అని నృసింహదేవు డాదేశించే సరికి ప్రహ్లాదుడు తండ్రికి పరలోక క్రియలు చేశాడు. అనంతరం విప్రులచేత అభిషక్తుడయ్యాడు. అపుడు మహానందంతో ప్రసన్న వదనుడైన నృసింహుని చూచి దేవతా ప్రముఖ సహితుడై బ్రహ్మ ఇలా అన్నాడు.

దేవదేవా. భూతభావనా. రాక్షసేంద్రుడు హిరణ్యకశిపుడు దారుణ తపం చేసి నేను సృజించిన ఏ ప్రాణిచేతిలోను చావకుండా నా వల్లన వరం పొందాడు. వర గర్వంచేత సాధు దౌష్ట్యానికి పాల్పడ్డాడు. ధర్మాలను భంగించాడు. నేడు నీ చేత నిహతుడయ్యాడు. లోకాలకు శుభం కలిగింది. భాగవత శ్రేష్ఠుడైన ఈ బాలుని మృత్యు ముఖంనుండి తప్పించి రక్షించావు. వరాలిచ్చావు. మేలైంది.

ని ఈ నృసింహావతార ఘట్టాన్ని ఏకాగ్రచిత్తంతో చింతించే వారికి మృత్యుభీతి ఉండదు. యమబాధలుండవు. - అన్నాడు బ్రహ్మకు నృసింహదేవుడు - పద్మాసనా! దేవ శత్రువులెవ్వరికీ ఇకముందు ఇలాంటి వరాల్ని ఇవ్వబోకు. పాపాత్ములక్కు వరాలివ్వడం పాములకు అమృతం ఇవ్వడం లాంటిది - అని ఆనతిచ్చి, బ్రహ్మాది దేవతా సమూహం చేత పూజితుడై భగవంతుడైన నృసింహుడు అంతర్హితుడయ్యాడు.

తర్వాత ప్రహ్లాదుడు శూలికి (శివునకు) నమస్కరించి తమ్మిచూలికి (బ్రహ్మకు) ప్రణమిల్లి, ప్రజాపతులకు మొక్కి భగవద్విభూతులగు దేవతలకు కైమోడ్చి వందనం చేయగా సంతసించి బ్రహ్మదేవుడు శుక్రుడు మొదలైన మునీంద్రులతో కూడి అతణ్ణి దైత్యదానవ రాజ్యానికి పట్టం కట్టి అతనిచేత పూజితుడై దీవించాడు. రుద్ర ప్రముఖులైన దేవతలందరూ అనేకరీతుల ఆశీస్సులతో ప్రహ్లాదుని కృతార్థుణ్ణిచేసి బ్రహ్మను ముందుకొని ఎవరి నివాసాలకు వారు వెళ్ళారు.

ఇలా విష్ణుదేవుడు విష్ణుపార్శ్వచరుల్ని (జయవిజయుల్ని) బ్రాహ్మణ శాపం చేత మొదటి జన్మలో దితిపుత్రులైన హిరణ్యాక్ష హిరణ్యకశిపులను వరాహ నారసింహ రూపాల్లో అవతరించి వధించాడు. రెండవ జన్మలో రాక్షస రూపం ధరించిన రావణ కుంభకర్ణులను శ్రీరాముడుగా అవతరించి సంహరించాడు. ఇక మూడవ జన్మలోనే, శిశుపాల దంతవక్త్రులను పేరులతో ప్రఖ్యాతి చెందిన వారిని శ్రీకృష్ణావతారంలో శిక్షించాడు. ఇలా మూడు జన్మల విరోధ వైరానుబంధంతో వారు నిరంతరం శ్రీహరిని స్మరించడం చేత పాపవిముక్తులై వారు తిరిగి హరి సాన్నిధ్యం చేరారు - అని నారదుడు ఇంకా ఇలా అన్నాడు.

ధర్మరాజా! నరసింహుని విహారం, రాక్షసరాజు సంహారం, పుణ్య భాగవతుడైన ప్రహ్లాదుని సచ్చరిత్రం, చక్కగా విచారించి ఎవడైనా విన్నా, చదివినా శుభాకారంతో ఆతడు ఏ భయమూ కలగని లోకం చెందగలడు. బ్రహ్మాదులు కూడా మనస్సులో వితర్కించి వాక్కులతో వర్ణింపలేని జనార్దనుడైన పరబ్రహ్మం నీ ఇంట్లో చెలికాడై, మేనమామ కొడుకై, సచివుడై, మనఃప్రియుడై, మహాఫలప్రదాతయై ఉండడం నీ అదృష్టం. వైకుంఠుడు మహామహిమాత్ముడు. మాయామయుడైన మయుడు పూర్వం ఒక పర్యాయం ఈశ్వరుని యశస్సును భంగించేసరికి శ్రీహరి ఆ ఈశ్వరునకు బాసటగా నిలబడి అతని పరువునూ ప్రతిష్ఠనూ నిలబెట్టాడు - అని నారదుడనేసరికి ధర్మరాజు విస్మితుడై - మునీంద్రా! ఆశ్చర్యంగా ఉన్నదే! మయుడు మహేశ్వరుని కీర్తికి ఎలా భంగం కలిగించాడో! శ్రియఃపతి మహేశ్వరుని కీర్తిని తిరిగి ఎలా నిలబెట్టాడో! వినాలని కుతూహలంగా ఉంది - అని అనగా నారదుడు ఈరీతిగా చెప్పడం మొదలు పెట్టాడు.

చక్రాయుధుడైన శ్రీహరి తోడ్పాటుగల ఇంద్రాదులచే నిర్జితులయి సోదరులు చింతాక్రాంతులై విక్రమించడం మాని మయుని వెనుక చేరారు. మయుడు మాయా నిలయుడు, దుర్గయుడు. తనను ఆశ్రయించిన అసురగణాలకు సాయం చెయ్యాలని నిశ్చయించాడు. తన విద్యాబలంచేత వారికి అయో, రజత, సువర్ణ[1] మయాలైన మూడు నగరాలను నిర్మించి యిచ్చాడు. వాటి రాకపోకలు ఎవరికీ తెలియవు. వాటి పై కప్పులు అమితకఠినంగా ఉంటాయి. రాక్షసులందరు ఆ విచిత్ర నగరాల్లో నివసిస్తూ కామసంచారులై పూర్వ వైరాన్ని తలపోసి అస్త్రక బలంతో సమస్త లోకాలను బాధించడం మొదలు పెట్టారు.

అపుడు లోకాధిపతులందరూ శోకాతురులై భువనభర్త, దుష్టజన సంహర్త అయిన శ్రీకంఠుని దర్శించి ముకుళిత హస్తులై ఆ మహేశ్వరునకు ఇలా అన్నారు- పరమేశ్వరా ! త్రిదశ వైరులైన అసురులు త్రిపురాలను ఆలయాలుగా చేసుకొని పరాజయ మెరుగని మమ్మల్ని వర్ణింపనలవి కాని యాతనలు పెడుతున్నారు. సాపరాధులైన వారిని సంహరించి మమ్మల్ని రక్షించు., మీ అధీనంలో ఎన్నడూ దైన్యం యెట్టిదో ఎరుగం. ఇపుడు దుర్బలులమై దుష్టులైన దానవులచేత నానా బాధలు పడుతున్నాం. మమ్మల్ని కాపాడు - అనగా భక్తవత్సలుడైన పరమేశ్వరుడు శరణాగతులగు గీర్వాణులకు అభయదానం చేసి దుర్వారబలంతో విల్లందుకున్నాడు. అమోఘమైన ఒక బాణం సంధించి త్రిపురాల పై విడిచాడు. అపుడు మార్తాండ మండలంనుండి వెలువడు - కిరణ సముదాయంలాగా ఆ బాణంనుండి దేదీప్యమానాలైన మహోగ్ర బాణాలు వేలకొలది వెల్వడి దిక్కులు నిండాయి. మంటలు చిమ్ముతూ కుప్పలుగా తెప్పలుగా వచ్చి త్రిపురాలను కప్పివేశాయి. ఆ బాణాగ్ని జ్వాలలకు ఆ మాయానగరాల్లో ఉన్న రాక్షసులు దగ్ధులై విగజీవితులయ్యారు. మహాయోగి యైన మయుడు వారి మృతకళేబరాలను త్రిపుర మధ్యస్థమైన సిద్ధరస - కూపంలో వేసేసరికి ఆ సిద్ధామృత రస మహిమచేత వారు పునర్జీవితులై వజ్రకఠినాలైన చక్కని శరీరాలతో పిడుగులయందలి అగ్నిశకలాల్లాగా ప్రకాశించారు.

మహేశ్వరుడు ఆశ్చర్యచకితు డయ్యాడు. తన యత్నం విఫలమైనందుకు సిగ్గు పడ్డాడు. ఆతని దీనస్థితి చూచి శ్రీహరి ఒక ఉపాయం పన్నాడు. తన మాయాబలంచేత తానొక పాడియావుగా మారాడు. బ్రహ్మదేవుడు దూడయై పొదుగును ఆఘ్రాణిస్తూ వెంటరాగా అక్కడకు వచ్చి విచిత్రంగా కూపంలోని సిద్ధామృతరసం త్రావివేశాడు. దైత్యులు ఆ గోవు సౌందర్యానికి ముగ్ధులై దానివంక చూస్తూ దాన్ని నివారించలేదు. ఇలా శ్రీహరి మోహనాకారం ధేనువుగా వచ్చి

1. ఇనుము, వెండి, బంగారంతో నిర్మింపబడిన.

త్రిపుర మధ్యస్థమైన కూపంలోని అమృతాన్ని త్రాగివేశాక కొంత సేపటికి ఆ కూప పాలకులకు స్పృహ వచ్చింది. శోకాకులు చిత్తులయ్యారు. మయుడు ఆశ్చర్యభరితుడై ఏగతిని చింతించి శోకించకుండా - దానవులారా! దుఃఖం మానండి: దైవవిధి అచింత్యం. అమరులైనా దనుజులైనా నరులైనా ఇంకా ఎంతటి నిపుణులైనా దైవ నిర్ణయాలను కాదనలేరు. నేను మీకు తోడ్పడాలని యెంత యత్నించినా దైవం అనుకూలించక పోవడం వలన మీకు తిరిగి దుస్థితి తప్పలేదు - అన్నాడు.

అనంతరం శ్రీహరి ధర్మం, జ్ఞానం, తపం, విద్య, వైరాగ్యం, సమృద్ధి మొదలైన స్వీయ శక్తులతో రథకేతనాలను, ధనుర్బాణాలను, కవచాన్ని, గుర్రాలను సూతుని ఇతర రణసాధనాలను నిర్మించి శంకరున కిచ్చాడు.... శంకరుడు శ్రీహరి నిజశక్తిచే నిర్మించి యిచ్చిన కవచాన్ని ధరించాడు. ధనుర్బాణాలు గ్రహించాడు. రథారూఢుడై బయలుదేరాడు. శక్తివంతమైన ఒకబాణాన్ని సంధించి అభిజిన్ముహూర్తంలో త్రిపురాలపై ప్రయోగించాడు. ఆ బాణాగ్ని జ్వాలల ఛటచ్ఛట ధ్వనులు భూనభోమధ్యాలు నిండాయి. త్రిపురాలు త్రుటికాలంలో దగ్ధమయ్యాయి. ఇలా రుద్రుడు సామాన్యులకు దృగ్గోచరాలు కాని త్రిపురాలను దహించి కూల్చి వేసేసరికి అమరులు, గంధర్వులు, గరుడులు, సిద్ధులు, సాధ్యులు, యక్షులు జయ జయ ధ్వానాలు చేస్తూ కుసుమవర్షం కురిపించారు.

ప్రజలు హర్షించారు. బ్రహ్మాదులు కీర్తించారు. అప్సరలు నర్తించారు. దివ్యదుందుభి ధ్వానాలు దిశదిశలా వ్యాపించాయి. మునిజనులానందించారు. లోకాలన్నీ శోకం విడిచి సంతోషించాయి. త్రిపురాలను అలా తృణ కణాల్లాగా దహించి పరముడూ అవ్యయుడూ అయిన శివుడూ బ్రహ్మాదులచే కీర్తింపబడుతూ నిజ నివాసమైన కైలాసానికి వెళ్లాడు. ధర్మనందనా! నిజమాయచేత మనుజలోకాన్ని విడంబిస్తూ లోకహితం కోసం శ్రీకృష్ణుడు చేసే అద్భుత చేష్టలు ఎలా ఉంటాయో చూచావా? ఆ దేవదేవుని పరాక్రమ గాథలను మునిజనులు నిరంతరం గానం చేస్తూ ఉంటారు - అనగా విని నారదునకు ధర్మసూనుడిలా అన్నాడు.

## నారదుడు ధర్మరాజునకు వర్ణాశ్రమ ధర్మాలు చెప్పడం

- మునీంద్రా! సకల వర్ణాశ్రమాచారాల్లో మానవులకు సమ్మతమైన ధర్మమేది? నరునకు ఏ ధర్మంచేత భక్తి జ్ఞాన వైరాగ్యాలు కలుగుతాయి? నీవు బ్రహ్మదేవునకు సాక్షాత్ పుత్రుడవు. సర్వజ్ఞుడవు. నీకు తెలియని ధర్మం లేదు. నీ మనస్సెప్పుడూ శ్రీమన్నారాయణుని యందు మగ్నమై ఉంటుంది. అనఘుడవు. శాంతుడవు. దయాన్వితుడవు. సాధుశీలుడవు. నీలాంటి మహాత్ములు భక్తితో దేన్ని పరమధర్మమని భావిస్తారో ఆ ధర్మ స్వరూపం నాకు వివరించి చెప్పు.

వినాలనుంది, నాకు. కుతూహలంగా ఉంది ! అనేసరికి నారదుడు ఇలా చెప్పడం మొదలు పెట్టాడు.

ధర్మనందనా! దక్షపుత్రికయైన గౌరి యందు నరనారాయణులు అవతరించి లోక శ్రేయస్సుకోసం బదరికాశ్రమంలో తపోనిరతుడై యున్న నారాయణుని వల్లన నేను విన్న సనాతన ధర్మక్రమం చెపుతాను విను. సకల వర్ణాల వారికి సత్యం, దయ, ఉపవాసాది తపం, శౌచం, సహనం, సదసద్వివేకం, మనో నిగ్రహం, బహిరింద్రియ నిగ్రహం, అహింస, బ్రహ్మచర్యం, దానం, యథోచిత జపం, సంతోషం, మార్దవం, సమదర్శనం, మహాజనసేవ, గ్రామ్య వాంఛలు లేకుండడం, నిష్ఫల క్రియలు విడిచి పెట్టడం, మితభాషిత్వం, దేహం కన్నా భిన్నమైన తనను (ఆత్మను) వెదకికొనడం, ప్రాణికోటికి అన్నోదకాలు పంచియివ్వడం, సకల ప్రాణులందు దేవతా బుద్ధిని, ఆత్మబుద్ధిని కలిగియుండడం; శ్రీ నారాయణ చరణధ్యానం, కీర్తనం, శ్రవణం, సేవ, నమస్కారం, దాస్యం, ఆత్మ సమర్పణం, సఖ్యం-అనెడి ఈ ముప్పది లక్షణాలు ముఖ్యం.

బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులను ద్విజులంటారు. ఆ మూడు జాతులవారికి గర్భాదానాదులైన పదునారు సంస్కారాలు అవిచ్ఛిన్నంగా ఉంటాయి. శూద్రులకు వివాహరూప సంస్కారమొక్కటే మాత్రమే ఉండడం చేత వారికి ద్విజత్వంలేదు. బ్రాహ్మణునకు యజ్ఞాలు చెయ్యడం, చేయించడం, వేదాలు అధ్యయనం చెయ్యడం, చేయించడం, దానం, ప్రతిగ్రహం-ఈ ఆరూ విహిత ధర్మాలు. క్షత్రియులకు ప్రతిగ్రహం (ఇతరుల నుండి తీసికొనడం) తప్ప మిగిలిన ఐదు ధర్మాలు ఆచరణీయాలు. యాజనం, అధ్యాపనం, ప్రతిగ్రహం-ఇవి బ్రాహ్మణునకు జీవనోపాయాలు కనుక క్షత్రియులు వీటిని అనుసరించరాదు. ప్రజాపాలనాధికారం వారిచేతుల్లో ఉంటుంది కనుక వారు బ్రాహ్మణులు కాని వారివద్దనుండి సుంకం తీసుకొనడం, ద్రోహులను శిక్షించి శుల్కం గ్రహించడం వల్లన జీవింపవచ్చు. వైశ్యునకు కృషి, వాణిజ్యం, గోసంరక్షణం మొదలైనవి విహిత కర్మలు. శూద్రునకు ద్విజసేవ కర్తవ్యం.

ధర్మరాజా! ఈ రీతిగా నాల్గుజాతులవారికి వృత్తులు విధింపబడ్డాయి. ఒకవేళ ఆ విహితవృత్తులు పాటించడం సాధ్యం కాకపోతే వృత్త్యంతరాలు కూడా కల్పింపబడ్డాయి. అందు బ్రాహ్మణునకు కృషి, గోసంరక్షణాదికం అయాచితంగా ప్రాప్తించినది, యాయవారం, శిలోంఛవృత్తి ఈ నాలుగు ముఖ్యం. వీటిలో మొదటి దానికంటె రెండవది, రెండవదానికంటె మూడవది, మూడవదానికంటె నాల్గవది శ్రేష్ఠమైనది. విహితవృత్తులు అవలంబించడానికి అవకాశం ఉన్నప్పుడు వాటినే ఆచరించాలి. అలాంటి అవకాశం లేనప్పుడు రాజులు తప్ప తక్కిన వారందరు ఏ వృత్తి అవలంబించినా ప్రత్యవాయం లేదు.

శిలోంఛ వృత్తిని[1] ఋతమని, అయాచిత వృత్తిని అమృతమని, యాచ్నా వృత్తిని మృతమని, కర్షక వృత్తిని ప్రమృతమని, వాణిజ్యాన్ని సత్యానృతమని అంటారు. ఆయా వృత్తుల తారతమ్యం తెలిసికొని వాటిని అనుసరించాలి. బ్రాహ్మణుడు సర్వవేద మయుడు. క్షత్రియుడు సర్వదేవమయుడు. కనుక బ్రాహ్మణ క్షత్రియులకు నీచసేవ పనికిరాదు.

ఈ నాలుగు జాతుల వారికి కొన్ని ప్రత్యేక లక్షణాలు కూడా ఉంటాయి. అంతరింద్రియ నిగ్రహం, బహిరింద్రియ నిగ్రహం, శౌచం, తపం, మార్దవం, కృప, సత్యం, జ్ఞానం, ఓర్పు, హరిభక్తి, నిత్యసంతోషం - ఇవి బ్రాహ్మణులకు సహజ లక్షణాలు.

శౌర్యం, దానశీలం, ప్రసాదం, ఆత్మనిగ్రహం, తేజం, ధైర్యం, దైవభక్తి, ధర్మం, అర్థం, కామం, బుధసేవనం, ఆచార్యసేవనం, హరిసేవనం, సత్కర్మలు. పరితోషణం, వీర్యం, రక్షణం - ఇవి క్షత్రియుల నైజలక్షణాలు.

ధర్మార్థకామాలతో సంతృప్తిచెంది ఉండడం, గురువులను, దేవతలను, బ్రాహ్మణులను పూజించడం, వినయంగా ఉండడం, సంతోషం, పరులకు మేలు చేయాలని భావించడం వైశ్యజనలక్షణాలు. ఋజువర్తనం, శుచిత్వం, యజమానులను నిష్కల్మష భావంతో సేవించడం, మంత్రం చెప్పకుండా పంచయజ్ఞాలు* చెయ్యడం, గోబ్రాహ్మణులను సేవించడం, న్యాయవర్తన-ఇవి శూద్రజన ధర్మాలు. ఇక స్త్రీల ధర్మాలు చెపుతాను విను.

స్త్రీ ఇంటిని విడిచి పెట్టరాదు. శరీర శుభ్రత పాటించాలి. ఎప్పుడూ అలంకరించుకొని లక్ష్మిలాగా ఉండాలి. సత్యబద్ధంగా ప్రియంగా మాటలాడుట యందు నైపుణ్యం గలిగి ఉండాలి. ప్రేమతో భర్తహృదయాన్ని రంజింప జెయ్యాలి. భర్తను దైవంగా భావించాలి. భర్త ఏ పద్ధతిని నడిస్తే తాను అదే పద్ధతిని నడుస్తూ భర్త బంధువులను కూడా అదే రీతిగా చూడాలి. మృదుభావంతో పతికి స్నానం, పానం, భోజనం, శయనం సమకూర్చాలి. భర్త ఒకవేళ పతితుడైతే స్త్రీ తన పాతివ్రత్య మహిమచేత ఆతన్ని సన్మార్గగామిగా చెయ్యాలి ఇలా భర్తను హరి భావనతో సేవించెడి స్త్రీ హరిలోకంలో లక్ష్మిలాగా తనభర్తతో కలిసి అక్ష్య

1. శిలవృత్తి = పొలములో రాలిన ధాన్యపు గింజలను ఏరి తెచ్చుకొనుట. ఉంఛవృత్తి = అంగళ్ళ యందును, రోళ్ళకడను క్రిందపడిన గింజల నేఱుకొనుట ఈ రెంటిని కలిపి శిలోంఛవృత్తి అనడం కద్దు.

(1) బ్రహ్మయజ్ఞం, (2) పితృయజ్ఞం, (3) దేవ యజ్ఞం (4) భూత యజ్ఞం, (5) మనుష్య యజ్ఞం - ఇవి పంచయజ్ఞాలు

యానందం పొందుతుంది. పతిని దైవంగా భావించి సేవించేటి సతికి ఉపవాసాలతో గాని, వ్రతాలతో గాని, తపస్సుతో గాని పనిలేదు. ధర్మనందనా! వెయ్యి మాటలెందుకూ? పతివ్రతయైన పడతికి లోకంలో దుర్లభమైనది ఏదీ లేదు.

రజకులు, చర్మకారకులు, నటులు, బురడకులు (మేదర), కైవర్తకులు, భిల్లులు, చండాలురు, పుల్కసులు, మాతంగులు మొదలగు వారు ఆయా కులాగత వృత్తులను చౌర్యహింసాదులు లేకుండా పాటించాలి. మానవులకు ప్రతి యుగంలోను సహజమైన ధర్మాలు ఇహ పరాలయందు సుఖాపాదకాలని వేదవిదులైన పెద్దలంటారు. కాలు కాలున దున్నితే నేలసారం తగ్గిపోతుంది. ఆ నేలలో చల్లిన విత్తులు నిస్తేజాలై సరిగా మొలకెత్తవు. అగ్నిలో అదేపనిగా నెయ్యివేస్తే దాహకత్వం తగ్గి అది క్రమంగా చల్లారిపోతుంది. అందులో వేల్చిన హవ్యాలు ఫలించవు. అదే రీతిగా నిరంతరం తనివితీరా కామోపభోగాలలో మునిగి తేలిన మనస్సు క్రమంగా నిష్కామమై విరక్తి చెందుతుంది. కనుక సత్యస్వభావంతో ఎప్పుడూ విడువకుండా నిజవంశాచారాలనూ, విహిత కర్మలనూ ఆచరించెడివాడు మెల్లగా నైజకర్మములందు విముఖత్వాన్ని చెంది ముక్తి పొందుతాడు. జాతి మాత్రం చేత పురుషునకు వర్ణాన్ని నిర్దేశింప పనిలేదు. శమ దమాది గుణాలకు ప్రాధాన్యం ఇవ్వాలి-అని నారదుడు ధర్మజునకు ఇంకా ఇలా అన్నాడు.-

క్రమంగా వివిధ వర్ణాల లక్షణాలు చెప్పాను. ఇక ఆశ్రమ ధర్మాలు చెపుతాను. విను. బ్రహ్మచారి మౌంజి[1] కౌపీనం[2] యజ్ఞోపవీతం (జంధ్యం) కృష్ణాజినం[3] పలాశ దండం[4] కమండలం దర్భ పవిత్రం ధరించాలి. కేశ సంస్కారం[5] పనికిరాదు. శుచియై ఉండాలి. మౌనం పాటించాలి. త్రిసంధ్యల యందు బ్రహ్మగాయత్రిని జపించాలి. సాయం సమయములందును, ప్రాతఃకాలము లందును సూర్యుని, అగ్నిని, గురువును, దైవాన్ని, ఉపాసించాలి. గురు నిలయానికి వెళ్ళి, భక్తి, వినయం, సౌమనస్యం కలిగి వేదాధ్యయనం చెయ్యాలి. అధ్యయనం మొదలు పెట్టేటప్పుడూ, ముగిశాక గురువునకు పాదాభివందనం చెయ్యాలి. రేపూ మాపూ విహిత గృహాలకు వెళ్ళి భిక్ష గ్రహించాలి. ఆ భిక్షాన్నాన్ని గురువునకు నివేదించి ఆతని ఆజ్ఞగొని మితంగా భుజించాలి. అర్హకాలాల్లో ఉపవసించాలి. స్త్రీలతోనూ, స్త్రీలోలురైన వారితోనూ ప్రయోజన మాత్రమైన మిత సంభాషణం చెయ్యాలి. గురుపత్నులుగాని అన్య స్త్రీలుగాని తనకు అభ్యంజనస్నానం, కేశాలంకరణం, శరీర మర్దనం చేస్తానని వస్తే తిరస్కరించాలి. జితేంద్రియుడై సత్యనిరతుడై

---

1. దర్భల మొలత్రాడు, 2. గోచి, 3. నల్లయిఱ్ఱి తోలు, 4. మోదుగుకఱ్ఱ 5. జుట్టుదువ్వుకొనుట.

యుండాలి. స్త్రీలను ఏకాంతంలో కలియరాదు. స్త్రీ కార్చిచ్చు. పురుషుడు నేతికుండ. కలిస్తే కరగకుండా ఉండదు. ఒంటరిగా ఉంటే బ్రహ్మ కూడా తన కన్నకూతురు నైనా విడువడు. ఇక ఇతరుల విషయం చెప్పడం దేనికి ? కనుక స్త్రీ సాంగత్యం ఏమాత్రమూ తగదు.

ఈ దృశ్య ప్రపంచం అంతా బ్రహ్మమయం అనే జ్ఞానం కలిగి దేహి స్వతంత్రుడైన ఈశ్వరుడయ్యే పర్యంతరం స్త్రీ పుం భేదాన్ని పాటించాలి. అంతే కాని బ్రహ్మచారి అయ్యేది, యతి అయ్యేది, గృహమేధి అయ్యేది మనస్సు పరిపక్వం కాకముందు అద్వైత భావాన్ని అనుసంధానం చేసికొనడం తగదు. కనుక రహస్యంగా కన్న కుమార్తెనైనా దగ్గరకు రానీయరాదు. ఈ నియమాలు బ్రహ్మచారికి, యతికి సామాన్యాలు. వారు తప్పక పాటించాలి. కాని గృహస్థునకు ఋతు కాలంలో నిజపత్నీ సంయోగం అనివార్యం: అయినా అతడున్నూ దృఢ వ్రతుడై ఉండాలి. పరకాంతలను చూడాలని తహ తహ లాడరాదు. ఎల్లవేళలా చందన భూషణాద్యలంకారాలు చేసికోరాదు. మధుమాంసాలు వర్జించాలి. నియమ నిష్ఠలు పాటించాలి.

గృహమేధి పాటించ వలసిన విధులింకా ఉన్నాయి. అతడు గురువులవలన వేదవేదాంగాలు* పఠించాలి. నిజాధికారాన్ని బట్టి వాటి అర్థ విచారం చెయ్యాలి. తన శక్తిననుసరించి గురువులకు అభీష్ట ద్రవ్యాలు ఇవ్వాలి. గృహంలోగాని వనంలోగాని నిష్ఠతో ఉంటూ గురువునందు, అగ్నియందు, ఆత్మయందు, సకల భూతకోటియందు శ్రీహరిని దర్శిస్తూ ఇంద్రియ వ్యసనాలకు లోనుగాక జ్ఞానం కలిగి వర్తిస్తే బ్రహ్మపదం పొందుతాడు. ధర్మనందనా వనప్రస్థులకు మహర్షులు చెప్పిన నియమాలు కొన్ని ఉన్నాయి. అవి చెపుతాను. విను. ఆ నియమాలను అనుసరించి జీవయాత్ర చేసిన వనప్రస్థుడు మహర్లోకానికి వెళ్తాడు.

గృహస్థాశ్రమం విడిచి వనప్రస్థుడైన యాతడు అడవిలో దున్నకుండా పండెడి నీవార ధాన్యాన్ని[1] పచ్చివిగాని అగ్నిపక్వం చేసిగాని లేక ఎండకు పండిన పండ్లనుగాని భుజించాలి. వన్య వస్తువులతో నిత్యకృత్యాలైన చరు[2]పురోడా[3]

---

* శిక్ష, వ్యాకరణం, ఛందస్సు, నిరుక్తం, జ్యోతిషం, కల్పం - ఈ ఆరూ వేదాంగాలు

1. నీవారం = విత్తకుండా దానంతట అది అక్కడక్కడ కాలంలో పండెడి దూసర్లు మొదలైన తృణ ధాన్యం.
2. చరువు-హోమద్రవ్యం.
3. పురోడాశవం - యజ్ఞార్థం చేసెడి పిండివంట.

శనాలు కల్పించాలి. ప్రతిదినం ఆ క్రిందటి రోజున సమకూర్చిన వాటిని విడిచి పెట్టి నూతన ద్రవ్యాలను సమకూర్చుకోవాలి. పర్ణశాల యందుగాని కొండగుహ లలో గాని అగ్నిని భద్రపరచాలి. మంచును, గాలిని, అగ్నిని, వర్షాన్ని, ఎండను సహించాలి. గోళ్ళు, గడ్డం, వెంద్రుకలు తీయరాదు. దండం, కమండలం, లేడి చర్మం, నారచీరెలు, జటలు ధరించాలి. అలా పంద్రెండేళ్ళుగాని, ఎనిమిదేళ్ళుగాని, నాలుగేళ్ళుగాని, రెండేళ్ళుగాని, కనీసం ఒకయేడు గాని తపః ప్రయాసంతో బుద్ధి హీనం కాకుండా మునియై చరించాలి. ఒకవేళ వ్యాధిచేగాని వార్థక్యంచేగాని స్వధర్మాచరణమందు అశక్తుడైతే వానప్రస్థుడు నిరాహారుడై అగ్నులను ఆత్మయందు ఆరోపించుకొని అహంకార మమకారాలను విడిచిపెట్టి సన్యసించి, తన శరీర మందున్న పృథివ్యాది భూతాలను, ఇంద్రియాలను వాటివాటికారణ వస్తువు లందు లయింప జెయ్యాలి.

అది ఎలాగంటే ?

శరీరమందున్న అవకాశాలను (రంధ్రాలను) ఆకాశమందు, నిశ్వాసాన్ని గాలి యందు, శరీరగతమైన ఊష్మాన్ని (వేడిమిని) అగ్నియందు, నెత్తురు, శ్లేష్మం, మూత్రం మొదలైన వాటిని నీటియందు, మాంసాదికమైన ఘన పదార్థాన్ని భూమి యందు - ఇలా ఉత్పత్తి క్రమాన్ని అనుసరించి కారణ వస్తువులందు అను సంధానం చెయ్యాలి. అలాగే ఇంద్రియ వ్యాపారాలను, ఇంద్రియాలను ఉత్పత్తి క్రమాన్ని అనుసరించి వాటివాటి అధిదేవతలందు సంక్రమింపజేయాలి. వాక్కులతో కూడిన వాగింద్రియాన్ని దాని అధిదేవతయైన అగ్నియందును, శిల్పాది వ్యాపా రాలతో గూడిన పాణీంద్రియాన్ని దాని అధిదేవతయైన ఇంద్రుని యందును, గతి (నడక)తో గూడిన పాదేంద్రియాన్ని దాని అధిదేవత యగువిష్ణువునందును, రతితో గూడిన ఉపస్థేంద్రియాన్ని (రహస్యాంగాన్ని) దాని అధిదేవతయైన ప్రజాపతి యందును, మలవిసర్జనాది సంయుతమైన పాయ్వింద్రియాన్ని (ముడ్డి) దాని అధి ష్ఠాన దైవమైన మృత్యువునందును లయసంధానం చెయ్యాలి.

కర్మేంద్రియాల్లాగానే జ్ఞానేంద్రియాలను కూడా ఉత్పత్తిక్రమం అనుసరించి వాటి వాటి అధిదేవతలందు లయంచెయ్యాలి. శబ్ద సహితమైన శ్రోత్రేంద్రియాన్ని (చెవిని) దిక్కులందును, స్పర్శ సంకలితమైన త్వగింద్రియాన్ని (తోలు) దాని అధిదేవతయైన వాయువునందును, స్వవిషయమైన రూపంతో గూడ చక్షురింద్రియాన్ని (కళ్ళు) సూర్యునియందును, స్వవిషయమైన రసాదులతో గూడిన రస నేంద్రియాన్ని (నాలుక) నీటియందును, స్వవిషయమైన గంధాదులతో గూడ ఘ్రాణేంద్రియాన్ని (ముక్కు) దాని అధిదేవతయైన పృథ్వియందును, అదే రీతిగా

వివిధ వాంఛలతో గూడిన మనస్సును దాని అధిదేవతయైన చంద్రుని యందును, జ్ఞానసహితమైన బుద్ధిని బ్రహ్మ యందును, దేహాత్మాభి మానానికు కారణభూతమైన అహంకార మమకారాలను వాటి అధిదైవతమగు రుద్రుని యందును, నిర్మల వృత్తులతోగూడిన చిత్తాన్నిదాని అధిదేవతయైన క్షేత్రజ్ఞుని(జీవుడు)యందును, సాత్త్వికాహంకారాన్ని స్వకార్య భూతాలైన ఇంద్రియాలతో గూడ మహత్తత్వమందును సంక్రమింప జెయ్యాలి.

అలాగే పృథివిని జలంలోను, జలాన్ని తేజస్సులోను, తేజస్సును వాయువులోను, వాయువును ఆకాశంలోను,ఆకాశాన్ని తామసాహంకారంలోను,అహంకారాన్ని మహత్తత్వంలోను, మహత్తత్త్వాన్ని ప్రకృతి యందును, ప్రకృతిని నాశరహితుడైన పరమాత్మ యందును, లయం పొందించాలి. ఇక జ్ఞానమాత్రావశిష్టుడైన క్షేత్రజ్ఞుడు (జీవుడు) నాశరహితుడని గ్రహించి అన్వయ బుద్ధితో కట్టెలను దహించిన అగ్నిలాగా వానప్రస్థుడు స్వయంగానే విరమించి నిర్వికార పరబ్రహ్మయందు లీనం కావాలి.

ధర్మనందనా! వనప్రస్థుడు వ్యాధివలనగాని, వార్ధక్యంవలనగాని స్వధర్మాచరణమందు అశక్తుడైతే ఏం చెయ్యాలో చెప్పాను. అలాకాక అతడు విహిత ధర్మాలను ఆచరిస్తూ ఇంకా జీవించి ఉంటే వానప్రస్థాశ్రమానంతరం అతడు ముక్తులైనవారి సాంగత్యంలో సన్యాసం స్వీకరించాలి. అలా సన్యసించాక శరీర మాత్రావశిష్టుడై ఏ కోర్కెలు లేకుండా ఉండాలి. ఎవరి ఆశ్రయమూ కాంక్షించరాదు. భిక్షాన్నంతో జీవయాత్ర సాగిస్తూ ఆత్మారాముడై చరించాలి. సకల భూత సముడై శాంతచిత్తుడై ఉండాలి. నిరంతరం నారాయణ పరాయణుడై ఉండాలి. కౌపీనమునకు (గోచీకి) కప్పుకునేందుకు మాత్రం వలసిన వస్త్రాలు ధరించాలి. దండ కమండలాలు కాక ఇతర వస్తువులేవీ ఉంచుకోరాదు.

ఆత్మపరాలుకాని శాస్త్రాల జోలికి పోరాదు. గ్రహ నక్షత్రాది విద్యలను విడిచివెయ్యాలి. తర్కశాస్త్రాలు తర్కింపరాదు. ఏ పక్షం అవలంబించకుండా శిష్యులకు గ్రంథాలు చెప్పాలి. బహు విద్యలు తగదు. బహు విద్యల వలన చిత్తం నిశ్చలంగా ఉండదు. అన్యాయత్తం అవుతుంది. మఠాధిపత్యం కూడా వాంఛనీయం కాదు. దానివలన నిగ్రహానుగ్రహాది వైషమ్యం కలుగక మానదు. పెక్కు దినాలు ఒకచోట నివసింపరాదు. ఊరూర నొక్కొక్క రాత్రి మాత్రం గడపాలి.

కార్యకారణ వ్యతిరిక్తమైన పరమాత్మయందు విశ్వాన్ని, అలాగే చిద చిదాత్మకమైన విశ్వమునందు పరబ్రహ్మమైన ఆత్మను దర్శించాలి. జాగ్రద్దశకు స్వప్నావస్థకు గల సంధి సమయంలో ఆత్మనిరీక్షణం చెయ్యాలి. ఆత్మకు బంధంగాని మోక్షంగాని పరమేశ్వర సంకల్పాదీనాలు కాని వస్తుతః లేవని

గ్రహించాలి. జీవితం ధ్రువం కాదనిన్నీ మృత్యువు ధ్రువమనిన్నీ తెలిసికొని భూతజాలం యొక్క ఉత్పత్తి వినాశాలకు హేతుభూతమైన కాలగతిని ప్రతీక్షిస్తూ ఉండాలి. ఇలా జ్ఞానోత్పత్తి పర్యంతం చరించి ఆపైన పరమహంసయై దండం మొదలైన బాహ్య చిహ్నాలను కూడా విడిచిపెట్టవచ్చు. పరివ్రాజకుడైనవాడు అలా బాహ్య చిహ్నాలను విసర్జించి అంతరంగ వ్యక్తమైన ఆత్మలో అనుసంధానం కల్పించుకోవాలి. అతడు మహామనీషియైనా బాహ్యానుసంధానం లేకపోవడంచేత ఇతరుల దృష్టిలో వెఱ్ఱివానిలాగా మూగవానిలాగా పిల్లవానిలాగా కనబడాలి. తన మహిమ అన్యులకు గోచరం కాకుండా ఉండాలనేందుకు పురాతనమైన ఒక ఇతిహాసం ఉంది. అది ఆజగరవ్రతం అవలంబించిన ఒక మునికిని ప్రహ్లాదునకు జరిగిన సంవాద రూపమైనది. దానిని వివరిస్తాను విను.

## ప్రహ్లాదాజగర సంవాదం

పూర్వం భగవత్ప్రియుడైన ప్రహ్లాదుడు కొందఱు మంత్రులతో గూడి లౌకిక వృత్తం తెలిసికోవాలనే కుతూహలంతో లోకాల్లో సంచారం చేస్తూ ఒక నాడు కావేరీనదీ తీరం చేరాడు. అక్కడ సహ్య పర్వతం క్రిందనున్న నేలపై శయనించిన ఒక మునీంద్రుని చూచాడు. అతని శరీరం అంతా దుమ్ముకొట్టుకొని ఉంది. అయినా ప్రచ్ఛన్నమైన కాంతులను విరజిమ్ముతోంది. ఆకారంచే గాని, మాటలచే గాని వర్ణాశ్రమాది చిహ్నాలచేగాని అతడెవడో యే ఆశ్రమాన్ని అవలంబించినవాడో తెలియకుండా ఉంది. అజగరం (కొండచిలువ) లాగా కదలకుండా మెదలకుండా నిష్క్రియంగా పడివున్నాడు. ప్రహ్లాదుడాతని స్థితిని జూచి విస్మితుడయ్యాడు. దగ్గఱకు వెళ్ళి విధిచోదితంగా అతనిని పూజించి అతని పాదాలకు శిరాన్ని మోపి మ్రొక్కులిడి యిలా అన్నాడు.

మునినాథా! ప్రయత్నించి మహాభోగాలనుభవించెడి నరునివలె నీవు దృఢ శరీరం గలిగి ఉన్నావు. నీవు కదలవు. మెదలవు. ఏ ప్రయత్నమూ చెయ్యవు. నీకు ఈ దార్ఢ్యం ఎలా వచ్చింది ? లోకంలో ఉద్యోగికే ధనం లభిస్తుంది. ధనవంతునకుగాని భోగాలు లభించవు. భోగానుభూతి లేనిదే దేహ దార్ఢ్యం ఉండదు. నీవు యత్నించవు. నీకు ధనం లేదు. భోగాలు లేవు. ఊరకే నేలమీద పడి ఉంటావు. అలాంటప్పుడు నీ శరీరం దృఢంగా ఉండడానికి హేతువేమిటి ? నీవు సమచిత్తుడవు. ఆఢ్యుడవు. పండితుడవు. బుద్ధి నిధివి. ఎవనినీ పొగడవు. ఎవనినీ తెగడవు. ఏ ప్రయత్నమూ చేయవు. ఉదాసీనంగా, నిష్క్రియంగా, నిర్వికారంగా ఇలా శయనించి ఉంటావూ. దీనికి హేతువేమిటి ? అని ప్రహ్లాదుడడిగేసరికి ఆ

ముని ముఖం వికసించింది. ప్రహ్లాదుని సుధామధుర వాక్కులు కర్ణపేయంగా విని అతడు మహానందంతో ఇలా అన్నాడు-

అసురేంద్రా! నీవు మహాజ్ఞానివి. నీవు ఆత్మసమ్మతుడవు. ఆంతరంగిక దృష్టితో సమస్తం తెలిసికోగల శక్తి నీకుంది. నీవు అధ్యాత్మచక్షువుతో జీవుల ప్రవృత్తి-నివృత్తి లక్షణాలను ఎఱుగగలవు. భగవంతుడైన హరి నీ మనోవీథిలో ఉండి సూర్యుడు చీకటిని పారద్రోలునట్లు అజ్ఞానాంధకారాన్ని తొలగిస్తాడు. నీవు సాత్త్వికుడవు. సర్వజ్ఞుడవు. నీకు తెలియనిది లేదు. అయినా నీవు అడిగావు కనుక నేను విన్న ధర్మం చెపుతాను. విను. నిన్ను చూడగల్గడం నా అదృష్టం. నీతో ఒకింత మాట్లాడంచేత నాకు ఆత్మశుద్ధి కలిగింది.

భోగానుభూతిచే పూరింప తరం కానిదీ, జన్మపరంపరలకు హేతుభూత మైనదీ అయిన విషయేచ్ఛకు లోనై నేను పుణ్యకర్మములనూ, పాపకర్మములనూ ఆచరిస్తూ నానా యోనుల్లో జన్మించాను. తుదకు మనుష్య దేహం ధరించాను. ధర్మాలాచరించి స్వర్గం పొందడానికి, అధర్మం ఆచరించి పశుయోనుల్లో పడడానికి, జ్ఞానోపార్జనంచేత మోక్షం పొందడానికి ఈ లోకం ద్వారం లాంటిది. అలాంటి, లోకంలో స్వర్గాపవర్గాలను ఇవ్వగలిగిన మానవ జన్మం ధరించి కూడా శారీరక సుఖ ప్రాప్తికోసం, దుఃఖ నివృత్తికోసం కర్మాచరణం చేస్తారు. దానివలన వాంఛితఫలం సిద్ధించకపోగా విపరీతఫలం లభిస్తుంది. శబ్దాది విషయ సుఖాలు నశ్వరాలు. ఆత్మసుఖం మాత్రం నిత్యం. అంచేత నేను నివృత్తి మార్గం అవలంబించి ఉద్యోగం (యత్నం) లేక నిద్రిస్తూ ప్రారబ్ధభోగా లనుభవిస్తూ ఉంటాను. ఇలా సుఖరూపమైన పురుషార్థం తనయందే ఉందని తెలియక మానవుడు నాచుచే ఆవరింపబడి ప్రచ్ఛన్నంగాఉన్న పరిశుద్ధ జలాన్ని విడిచి జలభ్రాంతిచే ఎండమావుల వెంట బడతాడు.

అలాంటి మూఢుడు సత్యంకాని ద్వైతంలోపడి ఘోరమైన సంసార చక్రంతో పరిభ్రమిస్తూ ఉంటాడు. దైవ తంత్రాలైన దేహాదులచేత ఆత్మకు సుఖాన్ని, దుఃఖ నివృత్తినీ కోరేవాని యత్నం నిష్ఫలం. ధనాదులు లభించినా అవి సుఖాన్ని కలిగించలేవు. దుఃఖ హేతువులే అవుతాయి. ధనం ఆర్జించడానికి మానవుడెంతో శ్రమపడాలి. అది వ్యయమౌతుంటే ఎంతో దుఃఖిస్తాడు. ధనవంతుడు అందరికీ భయపడతాడు. అతనికి నిద్రాహారా లుండవు. అతనికి ఎన్నో శంకలు. ఆర్జితధనం రాజులపాలో, దొంగలపాలో అవుతుందని నిత్యశంక. బంధుమిత్రుల వలనను యాచకుల వలనను కూడా బెడద తప్పదు. కనుక ఎటు చూచినా భయమే.

ధనం వలన భీతి ఒకటే కాదు. దానివలన శోకం, మోహం, క్రోధం రాగం, ద్వేషం, శ్రమ సంభవిస్తాయి. కనుక విజ్ఞునకు ధనకాంక్ష తగదు. భాగవతోత్తమా! తేనెటీగ, అజగరం నాకు గురువులు. తేనెటీగనుండి వైరాగ్యాన్ని అజగరం నుండి సంతృప్తిని నేర్చుకున్నాను. తేనెటీగ పూవుపూవుపై వ్రాలి మధుకణాలు తెచ్చి కూడబెడుతుంది. మానవుడు దాన్ని హరిస్తాడు. అయినా అది వ్యథ చెందదు. నిర్లిప్తంగా ఉంటుంది. కావలసిన ఆహారాన్ని సంపాదించుకోగలిగిన దీర్ఘశరీరం ఉండికూడా కొరదచిలువ వాంఛితాహారం కోసం తపించక ప్రాప్తించిన దానితో సంతృప్తిపడి ఉంటుంది. వాటి వర్తనం చూచి నాకు జ్ఞానోదయం అయింది. అంచేత జుంటీగను, అజగరాన్ని నిజగురువులుగా భావించి నిశ్చింతగా ఈ నిర్జన స్థలంలో. కర్మజాలం యొక్క గజిబిజి లేకుండా హాయిగా గౌరవంగా ఉన్నాను. నాకు ఏ కోరికలూ లేవు. దైవప్రాప్తమయిన దానిని భుజిస్తాను.

లేడి చర్మమైనా, నారచీరలైనా, మెత్తని సూక్ష్మాంబరమైనా, పట్టుబట్టలైనా లబ్ధమైనదేదో దానిని సంతోషంతో ధరిస్తాను. ఏదీ లభించకపోయినా విచారించను. దిగంబరుడనుగా ఉంటాను. ఆందోళిక (పల్లకి)గాని, రథంగాని, గుఱ్ఱంకాని, ఏన్గు గాని లభిస్తే ఎక్కిపోతాను. లేకపోతే చింతించను. నడచి పోతాను. కర్పూరం, చందనం, కస్తూరి మొదలైన మైపూతలు దొరికితే గ్రహిస్తాను. లేకపోతే భస్మాన్ని అలదికొంటాను. శయనించడానికి హంసతూలికా తల్పంకాని, శిలా కఠినమైన నేల గాని, తృణపర్ణశయ్యగాని, భసితంగాని నాకు ఏదైనా ఒక్కటే. సగౌరవంగా ఇచ్చినా, నిందాపూర్వకంగా ఇచ్చినా, తియ్యగా ఉన్నా, చేదుగా ఉన్నా, ఉత్తమమైనదైనా, అల్పమైనదైనా, చాలినా చాలకపోయినా లభించిన దానిని భుజిస్తాను.

లేదని ఎవ్వరినీ అడగను. రాదని చింతించను. ఇతరు లేదైనా ఇస్తే కాదనను. ఖేదం, మోదం లేకుండా నేను నిత్య సంతోషంతో ఉంటాను. నే నెవరినీ నిందించను. స్తుతించను. కష్టం వస్తే ఆక్రందించను. సుఖం లభిస్తే ఆనందించను. సుఖ దుఃఖాలను సమంగా భావించి నిత్య సంతుష్టుడనై ఉంటాను. ఇంకా ఏ కోర్కెలు లేకుండా ఒక్కొకప్పుడు దిగంబరుడనై పిశాచంలాగా ఉంటాను. చాలాకాలం నుంచి నేను అజగర వర్తనం గ్రహించి నిమిలిత నేత్రుడనై ఏకాంత భావాన్ని విష్ణు పరాయత్తంచేసి ఉంటున్నాను.

అంతే కాదు. జాతిరూపాది వికల్పాన్ని చిత్తమందును, చిత్తాన్ని అర్థరూప విభ్రమంగల మనస్సు నందును, మనస్సును అహంకారమందును, అహంకారాన్ని మాయ యందును, మాయను ఆత్మానుభూతియందును, లయం పొందించి సత్యాని

దర్శిస్తూ విరక్తుడనై స్వానుభవంతో ఆత్మస్థితుడనై ఉన్నాను. నీవు భగవత్పరుడవు. అంచేత అతిరహస్యమైన పరమహంస ధర్మాన్ని, నా అనుభవంచే ఎఱిగిన రీతిని నీకు మనోగోచరమయ్యేలాగా చెప్పాను - అని అజగరుడు వచించగా ప్రహ్లాదుడు ఆ మునీంద్రుని యథోచితంగా పూజించి మనస్సులో ఆనందిస్తూ నిజ నిలయానికి వెళ్ళాడు - అని నారదుడనగా యుధిష్ఠిరుడు - మునీంద్రా! నాలాంటి జడుడైన గృహస్థునకు ఇటువంటి పదవి ఎలా లభిస్తుందో చెప్పు-మని అర్థించేసరికి నారద మునీంద్రు డిలా చెప్పడం మొదలు పెట్టాడు-

గృహస్థుడైనవాడు గృహ కృత్యాలను వాసుదేవార్పణంగా చెయ్యాలి. మహర్షులను సేవించి వారివలన శ్రీహరి దివ్యావతార కథలు వినాలి.... ఆ యా విహిత కాలాల్లో సాధుజన సాంగత్యం చెయ్యాలి. పుత్ర మిత్ర కళత్రాదుల సాంగత్యం స్వప్నం లాంటిదని గ్రహించాలి. అంతరంగంలో ఏ విధమైన ఆసక్తి లేకుండా పైకి ఆసక్తి కలవానివలె వ్యవహరిస్తూ పురుష యత్నం చెయ్యాలి. తలిదండ్రులకు గాని, సహోదరులకుగాని, మిత్రులకుగాని, జ్ఞాతులకుగాని నిష్కామంగా ధనం ఇచ్చి వారిని సంతోష పరచాలి. దైవలబ్ధాలైన ధనంగాని, ధాన్యంగాని, నిధానంగాని, నిరభిమానంగా అనుభవించాలి.

ఇంటిలో గాని పొలంలో గాని చొరబడి ఉదరపోషణానికి సరిపడ మాత్రం దొంగిలించిన వానిని దండించరాదు. తేళ్ళను, ఎలుకలను, కోతులను, పాములను, గాడిదెలను, ఒంటెలను హింసించక కన్న బిడ్డల్లాగా చూచుకోవాలి దేశకాలదైవముల కొలదిని ధర్మార్థకామాలు పాటించాలి. కుక్కలకు, పతితులకు, చండాలాదులకునా ఉచితరీతిని భోజ్యపదార్థా లివ్వాలి. స్వవృత్తిచే లభించిన అన్నాదులచేత దేవతలను, ఋషులను, పితృదేవతలను, భూతకోటినీ, మానవులను సంతృప్తి పరచాలి. పంచమహా యజ్ఞాలు చేయగా మిగిలిన దానితో అంతర్యామి యైన పరమ పురుషుని యజించాలి. ఆత్మజీవనం చెయ్యాలి.

పరమేశ్వరుడు బ్రాహ్మణుని ద్వారా హవ్యాదులను గొని సంతృప్తుడైనట్లు అగ్నిముఖమున గొని సంతుష్టుడు కాడు. కనుక బ్రాహ్మణులను యథాయోగ్యంగా అన్నాదులచే ఆరాధించి బ్రాహ్మణముఖుడైన పరమాత్మను సంతసింప జేయాలి. అనంతరం తక్కిన మానవులను పశుపక్ష్యాది జీవులను సంతృప్తి పరచాలి.

నిజవిత్తానుసారంగా ఆయా కాలాల్లో శ్రాద్ధాది కర్మములను జపతపాదులను చెయ్యాలి. ధర్మనందనా! కర్మాచరణానికి గాని ధర్మాచరణానికి గాని ఏఏ కాలాలు తగినవో ఏ దేశాలు అర్హమైనవో ఏపాత్రలు ఉత్తమమైనవో చెపుతాను. విను.

భాద్రపదశుక్లమందు మహాలయం అనెడి శ్రాద్ధంచెయ్యాలి. దక్షిణోత్తరాయణాల ప్రారంభదినాల్లోను, వ్యతీపాతంలోను[1] దినక్షయంలోను, చంద్రగ్రహణ సూర్యగ్రహణ సమయాల్లోను, శ్రవణ ద్వాదశియందును దర్శమందు[2]ను, పితృశ్రాద్ధం చెయ్యాలి. కార్తిక శుద్ధనవమి యందును, వైశాఖశుక్లతృతీయ యందును, శిశిర హేమంతాల కృష్ణ పక్షాష్టమీ తిథులందును, మాఘశుద్ధ సప్తమి యందును, మాఘపూర్ణిమ యందును, మాస నక్షత్రాలతో గూడిన పున్నమ లందును, అనూరాధతోగాని, శ్రవణంతోగాని, ఉత్తరతోగాని, ఉత్తరాషాఢతోగాని, ఉత్తరాభాద్రతోగాని గూడిన ద్వాదశియందును, ఉత్తరాత్రితయంతో గూడిన ఏకాదశి యందును, జన్మనక్షత్రంతోగాని, [illegible] నక్షత్రంతోగాని గూడిన యుక్తమైన దినమందును తల్లిదండ్రులకు, బంధువులకు శ్రాద్ధకర్మములు, జపహోమస్నానవ్రతాలు, దేవ బ్రాహ్మణ సమారాధనం ఆచరించాలి. భార్యకు పుంసవనం[3], సంతానానికి జాతకర్మాదికం, తనకు యజ్ఞదీక్షాదికం, ప్రేతజనులకు దహనాదికం, మృతదినాన సాంవత్సరికం జరపాలి. ప్రశస్త కాలాలు చెప్పాను.

ఇక ఏయే దేశాలు కర్మాచరణానికి శ్రేష్ఠమైనవో చెపుతాను. విను. ఏ దేశాల్లో దయాసముద్రులూ, తపోనిష్ఠా గరిష్ఠులూ అయిన బ్రాహ్మణులుంటారో ఏస్థలాల్లో భాగీరథి మొదలైన పుణ్యనదులు ప్రవహిస్తాయో, ఎక్కడ నిరంతర హరి పూజలు జరుగుతూఉంటాయో ఆ స్థలాలు ప్రశస్తమైనవి. పుణ్యప్రదమైనవి. వాటిని వివరిస్తాను. విను. హరి యందు లోకాలుంటాయి. ఆ హరిసత్పాత్రల యందుంటాడు. శుభంకరులైన సత్పాత్రపురుషులుగల దేశం పుణ్యప్రదమైనది.

కురుక్షేత్రం, గయాశీర్షం, ప్రయాగ, పులహాశ్రమం, నైమిశం, ఫాల్గునం[4], సేతువు, ప్రభాసతీర్థం, కుశస్థలి, వారణాసి, మధురాపురి, పంపాబిందు సరోవరాలు, నారాయణాశ్రమం, సీతారామాశ్రమం, మహేంద్రం, మలయాచలం మొదలైన కులపర్వతాలు, శ్రీహరి ప్రతిమను ఆరాధించెడి తావులు, హరిసేవాపరులైన పరమ భాగవతులు నివసించెడి పుణ్యక్షేత్రాలు శుభాన్ని కాంక్షించేవాడు సేవించాలి. రాజేంద్రా! ఇలాంటి పుణ్యప్రదేశాల్లో మానవుడు చేసేధర్మం అల్పమైనా అది శ్రీహరి కృపచేత వేయిరెట్లు ఫలం ఇస్తుంది.

'ఈ చరాచర ప్రపంచం అంతా విష్ణుమయం. అందేత యోగ్యతను నిర్ణయించడంలో నిపుణులైన విద్వాంసులు నారాయణుడే ముఖ్యపాత్రమని అంటారు. ధర్మనందనా! ఎందరోదేవతలు, ఋషులు, బ్రహ్మపుత్రులైన సనకాదులు ఉండగా

1. వ్యతీపాతం = గ్రహయోగం
2. దర్శం = సూర్యచంద్రుల సంగమం, అమావాస్య
3. పుంసవనం = పురుష సంతానంకోసం గర్భవతికి చేసెడి శుభకర్మ
4. ఫల్గునీనది ప్రవహించెడి దేశం.

నీవు చేసిన రాజసూయంతో శ్రీకృష్ణుడు అగ్రపూజకు సమ్మతించలేదా! అనేక ప్రాణి సమూహాలతో సంకులమైన బ్రహ్మాండమనెడి వృక్షానికి శ్రీహరి మూలం. ఆ కారణంచే ఒక్క నారాయణుని తృప్తిపరిస్తే సకల జీవజాలాన్ని సంతృప్తి పరచి నట్లవుతుంది. ఋషులు, నరులు, తిర్యక్కులు[1], దేవతలు - వీరి శరీరాలు పురాలు. ఆ శరీరాల్లో తరతమభేదంతో భగవంతుడైన హరి జీవరూపంతో వర్తిస్తాడు. అంచేత అతన్ని పురుషుడంటారు. అందులో జంతుకోటి యందుకంటె పురుషునిలో అధిక్యత

ఉండడం చేత పురుషుడు పాత్రం[2]. ఆ పురుషుల్లో హరికి శరీరమైన వేదాన్ని ధరించి దయాగుణాన్వితుడై తపోనిష్ఠుడైన బ్రాహ్మణుడు పాత్రం. ఆ బ్రాహ్మణుల్లో కూడా ఆత్మజ్ఞాన పరిపూర్ణుడైనయోగి ముఖ్యపాత్రం. పరస్పర పాత్రలను సహించని మానవులకు పూజార్థం త్రేతాయుగంలో హరిప్రతిమలు కల్పింపబడ్డాయి. ఉత్తమ పాత్రలుగా నిర్ణయింపబడిన వారిని కొందరు ద్వేషించి ప్రతిమార్చనం చేస్తారు. అలాంటి వారికి ప్రతిమార్చనం ముఖ్యార్థ ప్రదంకాదు. అల్పాధికారంగలవారికి మాత్రం ప్రతిమార్చనం పురుషార్థ ప్రదానం అవుతుంది.

అఖిల లోకాలకు దైవతం హరి. తన పాదధూళిచే ముల్లోకాలను పాలనంచేసే బ్రాహ్మణుడు ఆ హరికి దైవతం. ఆ బ్రాహ్మణుల్లో కొందరు కర్మనిష్ఠులు, కొందరు తపోనిష్ఠులు, కొందరు వేదశాస్త్రనిష్ఠులు, కొందరు జ్ఞానయోగ నిష్ఠులు. వారిలో జ్ఞాననిష్ఠునకు అనంతఫలకామియైన గృహస్థుడు పితృజనుల నుద్దేశించి కవ్యాన్ని[3], దేవతల నుద్దేశించి హవ్యాన్ని పెట్టడంముఖ్యం. దైవకార్యానికి ఇరువురినిగాని ఒక్కని గాని, పితృకార్యానికి ముగ్గురనుగాని ఒక్కనిగాని భోజనం చేయించాలి. ధనవంతు నికైనా శ్రాద్ధవిస్తారం[4] తగదు. దానివలన నష్టమే కాని ప్రయోజనం లేదు. ఎందు కంటే, శ్రాద్ధానికి దేశకాల పాత్రాలు యథోక్తమైనవి ఉండాలి. అందుకు తగిన శ్రద్ధ ఉండాలి. తగిన ద్రవ్యం, పూజాసాధనాలు లభించాలి. అందు దౌహిత్రాదులే నియ మితులుకావాలి. ఆలోచించగా స్వజనాన్ని తక్కిన ద్రవ్యజాలాన్ని సమకూర్చుకొన డం దుస్తరం. అంచేత శ్రాద్ధాన్ని విస్తరించడం వలన నష్టమేకాని లాభంలేదు.

దేశకాల ప్రాప్తమైన కందమూల ఫలాదికంతో విధిచోదితంగా శ్రీహరికి నివే దించినది అక్షయ ఫలాన్ని యిస్తుంది. ధర్మతత్వం తెలిసినవాడు మాంస ప్రదానం చేయరాదు. మాంసభక్షణం చేయరాదు. కందమూలాదుల దానం వలన నయ్యేది

---

1. తిర్యక్కులు = జంతువులు
2. పాత్రం = అర్హతగలవాడు
3. కవ్యం = పితృదేవతలకు ఈయదగిన అన్నం
4. శ్రాద్ధవిస్తారం = విరివిగా శ్రాద్ధం చెయ్యడం

ఫలం పశుహింసనం వలన లభించదు. ప్రాణిహింస చెయ్యకుండా వర్తించడంకంటె పరమధర్మం లేదు. యజ్ఞతత్వ విదులైన జ్ఞానులు జ్ఞానమయములైన-యాగాలవే చేస్తారు. కాని పశుహింసతోగూడిన యజ్ఞయాగాలు చెయ్యరు.పశుహింసనంచేసి క్రతువులు ఆచరించే మానవులను చూచి భూతకోటి - ఇతడు దుష్టుడు. ఇతడు మమ్మల్ని చంపుతాడు - అని దుఃఖంతో కృశిస్తాయి.

కనుక ధర్మజ్ఞుడైనవాడు దైవ ప్రాప్తాలైన కందమూలాదికంతో నిత్యనైమిత్తిక క్రియలు చెయ్యాలి. నిజ ధర్మానికి బాధ కలిగించెడిది విధర్మం. పరప్రేరితమైనది పరధర్మం, వేదవిరుద్ధమైనది పాషండం, ఇతరులను వంచించడానికి ఆచరించెడిది దాంభిక ధర్మం, నాలుగు ఆశ్రమాల కంటెను వేఱయినది ఆభాసధర్మం. ధర్మవిదుడు వీటిని విడిచిపెట్టాలి. స్వధర్మాచరణం దురిత శాంతి సమర్థం. ధనహీనుడు పుణ్యయాత్రల కోసమైనా గాని ధనాన్ని యాచించరాదు.

దైవ ప్రాప్తమగు దానితో మాత్రమే సంతృప్తి పడి జీవించు సర్పంలాగా దైవలబ్ధమగు దానివలనకే ప్రాణధారంచేసి వర్తించెడు వానికి నిత్యసుఖం కలుగుతుంది; నిష్కాముడు, నిత్యసంతుష్టుడు, ఆత్మారాముడు అయిన వానికి కలిగినంత సుఖం విషయ సుఖాలకాసపడి ఆ సుఖ సంపాదనంకోసం దశదిక్కులయందు పరిభ్రమించెడి వానికి కలుగదు. పాదరక్షలుగల వానికి మొలపనేల అయినా, ముండ్లున్నా భయ ముండదు. అలాగే నిష్కామునకు సర్వత్రా సుఖమేకాని ఎక్కడా మీఏ భయ ముండదు.

స్త్రీవాంఛతోను, జిహ్వాచాపల్యంతోను పురుషుడు పెంపుడు కుక్కలాగా ఊరకే తిరుగుతూ సంతుష్టిలేక చెడిపోతాడు. సంతుష్టిలేని బ్రాహ్మణుని విద్యగాని తపస్సుగాని విభవంకాని నిరర్థకం. ఇంద్రియలోలత్వంతో విజ్ఞానం నశిస్తుంది. కనుక ఏ విధంగానైనా కామాన్ని జయించాలి. సంకల్పవర్జనం వలన కామాన్ని, కామవర్జనం వలన క్రోధాన్ని జయించవచ్చు. అలాగే, అర్థానర్థ విచక్షణ వలన లాభాన్ని, అద్వైతానుసంధానంచేత భయాన్ని, ఆత్మానాత్మ వివేకంవలన శోకమోహాలనూ, సాత్త్విక సేవ వలన దంభాన్ని, మౌనంచేత యోగానికి అంతరాయభూతాలైన లోకవార్తాదులను, దేహాదులందు నిస్పృహచేత హింసను నిర్జించవచ్చు.

అదే విధంగా ఆధి భౌతిక దుఃఖాన్ని హితాచరణం వల్లను, ఆధి దైవిక తాపాన్ని సమాధి బలం చేతను, ఆధ్యాత్మిక దుఃఖాన్ని యోగశక్తి చేతను, నిద్రను సాత్త్వికాహారం చేతను, సత్వగుణం చేత రజస్తమో గుణాలను, సత్త్వగుణమైన అంతఃకరణాన్ని ఉపశమనంచేతను, గురుభక్తిచేత సమస్త దుర్గుణాలను జయించాలి. తనకు జ్ఞానోపదేశం చేసేవానిని సామాన్య మానవుడని ఎవడు భావిస్తాడో

వాని భక్తిశ్రద్ధలు కరిశౌచం[1] లాగా నిరర్థకాలు. నరేంద్రా! శ్రీకృష్ణుడు పరమేశ్వరుడు, మహాత్ముడు, ప్రధానపూరుషుడు, దేవశ్రేష్ఠుడు, సజ్జనవిధేయుడు, అనంతుడు. యోగీశ్వరులు కూడా ఆతని పాదపద్మాలను సేవిస్తారు. అలాంటి దేవదేవుని లోకులు మతిలేక సామాన్య మానవునిగా భావిస్తారు.

మనస్సుతోగూడి ఇంద్రియాలు ఆరు. విహితధర్మాచరణం వలన ఆ యింద్రియాలను నిగ్రహింప గలిగినా అది ధారణను, ధ్యానాన్ని, సమాధిని సాధింపలేకపోతే కేవల శ్రమమేకాని ప్రయోజనం ఏమీలేదు. కృషి మొదలైనవి సంసార సాధనాలే కాని మోక్ష సాధనాలు కావు. కుటుంబ సంగం చేత చిత్తవిక్షేపం కలుగుతుంది. చిత్తాన్ని జయించాలంటే సన్న్యసించి దారసుతాదుల సంగమం విడిచిపెట్టాలి. భిక్షువై ఒంటరిగా ఉంటూ భిక్ష వలన లభించిన అన్నాన్ని మితంగా భుజించాలి. పవిత్రమైన సమప్రదేశంలో సుఖాసీనుడై ప్రణవాన్ని జపించాలి.

అనంతరం పూరకం, కుంభకం, రేచకం అనబడు ప్రాణాయామాలచేత ప్రాణాపానాలను నిరోధించి కామాహతమైన మనస్సు శబ్దాది విషయాల నుండి మరలి నిశ్చల మయ్యేదాకా, నాసాగ్రాన దృష్టి నిలపాలి. ఇలా యోగాభ్యాసం చేసేవాని చిత్తం కాష్ఠం దగ్ధమయ్యాక తనంతట తాను శాంతించేది అగ్నిలాగా శాంతి చెందుతుంది. అలా కామాదులచే వేధింపబడక సమస్త వ్యాపారాలను వదలిన చిత్తం బ్రహ్మానందం పొంది అందులో లీనమై పోతుంది. ఇక ఎప్పటికీ అందుండి వెలికి రాదు.

బ్రాహ్మణుడు సన్న్యసించి యతియై ధర్మార్థకామాలను విడిచిపెట్టి తిరిగికొంత కాల విలంబం అయ్యాక మళ్ళీ ఆ ధర్మార్థకామాలను సేవిస్తే లోభవశాన కక్కిన కూడు మంచిదని భావించి దాన్ని భుజించేడి నీచుడు లాగా అపహాస్యభాజనుడౌతాడు. ప్రాజ్ఞులు శరీరం ఆత్మకాదనియు, హేయమై, మలభూయిష్ఠమైన శరీరం ఎప్పటికైనా పురువులు పట్టి నశించేదనిన్నీ గ్రహిస్తారు. అజ్ఞులలాకాక మందబుద్ధులై శరీరాన్నే ఆత్మయని భావించి పొగడుతారు. బ్రహ్మచారికైనా నియత వ్రతాలు మానరాదు. గృహస్థుడు స్వీయ కర్మములు విడిచి పెట్టరాదు. తాపసి ఊళ్ళో ఉండరాదు. సన్యాసికి స్త్రీ సాంగత్యం పనికిరాదు.

శరీరం రథం, సారథి బుద్ధి, ఇందిౖయాలు గుఱ్ఱాలు. పగ్గాలు మనస్సు. ప్రాణాది దశవిధ పవనాలు[2] ఇరుసు. ధర్మాధర్మాలు చక్రాలు. బంధం చిత్తం. శబ్దాదులు సంచార భూములు. దేహాభిమానంగల జీవుడు రథి. ఓంకారం విల్లు.

---

[1] కరిశౌచం = ఏనుగు స్నానం చేసి ఆ పిమ్మట మట్టిచల్లుకొంటుంది. కనుక దాని స్నానం నిష్ఫలం

[2] ప్రాణం, అపానం, వ్యానం, ఉదానం, సమానం - నాగం, కూర్మం, కృకరం, దేవదత్తం, ధనంజయం - ఇవి దశవిధ వాయువులు

శుద్ధ జీవుడు బాణం, పరమాత్మ లక్ష్యం. రాగం, భయం, మదం, ద్వేషం, శోకం, క్రోధం, మోహం, మానం, మత్సరం మొదలైనవి శత్రువర్గం.

పురుషుడు శరీర రూపమైన రథాన్ని తనవశం చేసుకొని మహాభాగవతుల చరణ సేవవలన పదునెక్కిన విజ్ఞానమనే కత్తితో శ్రీహరి కృపావిశేషం తోడుగా రాగాది శత్రువులను నిర్మూలించాలి. అనంతరం ప్రణవమనెడి విల్లుకి శుద్ధజీవుడను బాణాన్ని సంధించి పరబ్రహ్మను గురిచేసి ప్రయోగించాలి. అపుడు అభిమాన సంయుతుడైన రథికుడు రథికత్వం విడిచి ఆత్మానందం అనుభవించాలి. అలా చేయలేనప్పుడు బహిర్ముఖాలైన ఇంద్రియాలనెడి గుఱ్ఱాలు, బుద్ధియను సారథి, దేహిని ప్రవృత్తి మార్గం పట్టించి విషయాలనెడి శత్రువుల పాలుచేస్తాయి. ఆ విషయ శత్రువులు విజృంభించి దేహిని భయంకరమైన చీకటి వంటి మృత్యువుతోగూడిన సంసార కూపమధ్యంలో కాల్చివేస్తాయి.

రాజేంద్రా! విను. వైదిక కర్మం ప్రవృత్తం, నివృత్తం, అనిరెండు విధాలు. అందులో ప్రవృత్తంవలన పునర్జన్మం నివృత్తంవలన మోక్షం సిద్ధిస్తాయి. ప్రవృత్త కర్మంలో ఇష్టాపూర్తాలను రెండు మార్గాలున్నాయి. అగ్నిహోత్రాది కర్మములు, దర్శ పూర్ణ మాసములందు చేయు క్రియలు, పశుయాగం, సోమయాగం, వైశ్వదేవం,బలిహరణం మొదలైన కామ్యకర్మములుఇష్టాలు. దేవాలయం, వనం, కూపం, తటాకం మొదలైనవి పూర్తాలు. నిష్కామంగా ఆచరించినపుడు ఇవే నివృత్తి కర్మము లౌతాయి.

ప్రవృత్తి ధర్మపరాయణుడైనవాడు దేహత్యాగంచేసి మరో దేహం ధరించేందుకు ముందు సూక్ష్మావస్థపొందిన పృథివ్యాది భూతాలతోగూడి మొదట ధూమాకృతిపొంది పిమ్మట రాత్రిని,కృష్ణపక్షాన్ని,దక్షిణాయనాన్ని,పితృలోకాన్ని,ఆకాశాన్ని అతిక్రమించి చంద్రలోకం చేరతాడు. తాను చేసిన ఇష్టాపూర్తాది ఫలాన్ని అక్కడ అనుభవించి విలీనదేహుడై వృష్టి(వాన)ద్వారమున క్రమంగా ఓషధులను,అన్నాన్ని, రేతస్సును (శుక్లం) పొంది భూమియందు తిరిగి జన్మిస్తాడు. ఇది పునర్జన్మ రూపమైన పితృయానం.

నివృత్త కర్మనిష్ఠుడైనవాడు జ్ఞానప్రదీపకాలైన చక్షురాదీంద్రియాలయందు కర్మేంద్రియ వ్యాపారాలను, జ్ఞానేంద్రియాలను సంకల్ప వికల్పాత్మకమైన మనస్సునందును, మనస్సును శాస్త్రీకమయిన వాక్కునందును, వాక్కును వర్ణసమామ్నాయమందును,వర్ణసముదాయమును ఓంకార మందును, ఓంకారాన్ని బిందునాదమందును, బిందునాదాన్ని ప్రాణమందును, ప్రాణాన్ని జీవునియందును, జీవుని పరబ్రహ్మ మందును నిలపాలి.

అలాంటి నివృత్తి ధర్మపరుడు పగటిని, శుక్లపక్షాన్ని, పూర్ణిమను, ఉత్తరాయణాన్ని అతిక్రమించి సూర్యద్వారాన బ్రహ్మలోకం పొందుతాడు. అతడు తిరిగి

జన్మమరణాది రూపకమైన సంసారంలోకి రాడు. అక్కడ భోగావసానమందు స్థూలోపాధియైన విశ్వరూపుడై, స్థూలాన్ని సూక్ష్మమందు లయించి-సూక్ష్మోపాధియైన తేజోరూపుడై, సూక్ష్మాన్ని కారణమందు లయించి - కారణోపాధియైన ప్రాజ్ఞుడై, కారణాన్ని సాక్షిస్వరూపమందు లయించి-శుద్ధాత్ముడై ముక్తుడౌతాడు. అతడు తిరిగి జననమరణాది రూపకమైన సంసారమందు చేరడు. ఇది దేవయానం.

ధర్మనందనా! దేవనిర్మితాలైన ఈ పితృ దేవయానాలను శాస్త్ర దృష్టితో తెలిసికొను వాడెప్పుడును మోహం చెందడు. జ్ఞానాతిశయంతో అతిశయిస్తాడు. భగవంతుని పొందు మార్గం ఉపదేశించాను. ఇక పరమేశ స్వరూపాన్ని వివరిస్తాను. విను. భగవంతుడు దేహాదులకు కారణత్వంచే ఆదియందును అవధిత్వం (ఆయుః పరిమితి) చేత అంతమందును నడుమ జీవకోటి అంతర్బహిర్భాగము లందును ఉంటాడు. అల్పమైన వస్తువుగాని, అనల్పమైన వస్తువుగాని జ్ఞానాత్మకమైన జీవ స్వరూపంగాని, జ్ఞాన శూన్యమైన వస్తువుగాని, సమస్తం పరమాత్మ స్వరూపమేకాని వేఱుకాదు.

ప్రతిబింబవస్తుత్వంచేత వికల్పితం(భ్రాంతి)గాతోస్తుంది. అలాగే ఇంద్రియ సంబంధియైన సర్వం అర్థత్వంచేత వికల్పితంగా తోస్తుంది కాని పరమార్థంకాదు. దేహాదులు మిథ్యాత్మకాలు కనుక వానికి హేతువులైన పృథివి మొదలగు వానికిని మిథ్యాత్వం సిద్ధం. పరమాత్మకు అవిద్యచేత ఎంతవరకు వికల్పం ఉంటుందో అంతవరకు భ్రాంతి కూడా ఉంటుంది. అవిద్యానివృత్తితో సర్వం మిథ్య అని తెలుస్తుంది. స్వప్నావస్థలో నిద్రించినట్లూ, మేల్కొని నట్లూ కూడా భావిస్తాం. కాని వాస్తవంగా మేల్కొనిన తర్వాత వెనుకటి బోధగాని నిద్రగాని భ్రాంతిమూలక మని తెలిసికొంటాం.

శరీరాత్మలు కలిసియున్నందున ఆత్మయందలి జ్ఞానాది గుణాలు దేహాదులందారోపించి దేహాత్మలొక్కటే యని భావిస్తాం. కాని ఆత్మజ్ఞానంలభించినతర్వాత ఆ ప్రతీతి భ్రాంతిమూలకమని తెలుస్తుంది. అయితే శాస్త్రసమ్మతమైన అద్వైతమే (ఒక్కటే యనుభావన) విశ్వసనీయం కాని ప్రతీతి వలన వచ్చునది కాదు.

భావాద్వైతం, క్రియాద్వైతం, ద్రవ్యాద్వైతం అనునవి శాస్త్రానుమతాలు. పటతంతువుల* వలె కార్యకారణములందు మూలపదార్థం ఒకటే యనుఆలోచనచేసి భేదం లేదని(ఒకటేయని) భావించడం భావాద్వైతం. మనో వాక్కాయ కృతాలైన సర్వకర్మములను ఫలభేదం పాటింపక పరబ్రహ్మార్పణంగా చెయ్యడం క్రియాద్వైతం. పుత్ర మిత్ర కళత్రాది సర్వప్రాణులకూ,తనకూ,దేహానికీ పంచభూతాత్మకత్వంచేత భోక్త ఒక్కడే అను పరమార్థంతో అర్థకామములందు ఐక్య దృష్టి చెయ్యడం ద్రవ్యాద్వైతం. నేర్పుతోను, ఆత్మతత్త్వానుభవంతోను, అద్వైత

---

* వస్త్రం, దారాలు

త్రియాన్ని పరిగణించి మునియైన వాడు వస్తుభేదబుద్ధిని, కర్తృభేదబుద్ధిని, స్వపర బుద్ధిని స్వప్నగతాలుగా దలచి పోనాలి.

ధర్మజా! వేయి మాటలెందుకూ? ప్రాజ్ఞుడైనవాడు గృహస్థుడైనా వేదోక్త విధులను పాటిస్తూ ఆదరభావంతో శ్రీహరి చరణారవిందాలు సేవిస్తే ముక్తిపదం పొందుతాడు. మీరు భక్తి తత్పరత్వంతో శ్రీకృష్ణుని పాదాంబుజాలను సేవించడం వలన కాదూ? ఆపదల్లో ఒక్కటి పడకుండా దిగ్విజయం సాధించి మహేంద్ర వైభవంతో రాజసూయ యాగం చేసింది!

## నారదుని పూర్వజన్మ వృత్తాంతం

ధర్మనందనా! నా పూర్వజన్మ వృత్తాంతం చెపుతాను విను. గడచిపోయిన మహాకల్పంలో నేను ఉపబర్హణుడను పేరుగల గంధర్వుడను. నా సౌందర్యానికి, మధుర వచో విలాసాలకు, గాంభీర్యాది గుణాలకు సుందరీజనం ముగ్ధులై నన్నెంతో ప్రేమించేవారు. నేనున్నూ పరవశించి వారితో క్రీడిస్తూ ఉండేవాడను. అలా ఉండగా ఒకనాడు విశ్వసృష్టలైన బ్రహ్మలు దేవసత్రమనెడి యాగంచేస్తూ అందులో నారాయణ కథలు గానం చెయ్యడానికి అప్సరలను గంధర్వులను పిలువనంపారు.

నేను కూడా వారితో కలిసి అక్కడకు వెళ్ళి విష్ణుగాథలు కొన్ని పాడాను. కాని కామ వ్యామోహంతో మదించి అప్సరలను వెంట బెట్టుకొని వారెవరికీ చెప్పకుండా అక్కడనుండి వెళ్ళిపోయాను. నా అవిధేయతకు ప్రజాపతులు ఆగ్రహించి "నిస్తేజుడవై భూలోకంలో శూద్రజాతి స్త్రీకి సుతుడవై పుట్టు" మని నన్ను శపించారు.

విశ్వసృష్టల శాపఫలంగా నేనొక బ్రాహ్మణ దాసికి పుత్రుడనై జన్మించాను. అచట బ్రహ్మవాదులైన పెద్దలకు శుశ్రూషచేసే భాగ్యం నాకు లభించింది. దాని ఫలితంగా ఈ మహాకల్పంలో నేను బ్రహ్మకు కొడుకునై పుట్టాను.

ధర్మజా! ఏ ధర్మం ఆచరించి గృహస్థుడు మోక్షానికి వెళ్తాడో తేటతెల్లంగా చెప్పాను. నీ వెంతో అదృష్టవంతుడవు. నీ మహిమను నేను ఏమని వర్ణించను? అఖిలాధారుడూ, బ్రహ్మాదులకు కూడా దుర్లభుడూ అయిన విష్ణువు మానవాకృతితో నీ యింటనుండి నీవు చేసిన యాగంలో అగ్రపూజ లందుకున్నాడు. మీ సేవలు పొందాడు.... మిమ్మల్ని సేవించాడు....తాను సుఖించాడు. మిమ్మల్ని సుఖపెట్టాడు. చెలియై చుట్టమై మంత్రియై మీకు మనోనందం కల్పించాడు.

అని నారదుడు చెప్పిన వృత్తాంతమంతా విని ధర్మనందనుడు అనురాగాతిశయంతో పరవశించి వాసుదేవుని పూజించాడు. వాసుదేవుని చేతను ధర్మనందనుని చేతను పూజితుడై నారదమునీ దేవమార్గాన వెళ్ళిపోయాడు" అని శుకయోగీంద్రుడు పరీక్షన్నరేంద్రునకు చెప్పాడని సూతుడు శౌనకాదులకు చెప్పాడు.

* *



# ఎమెస్కో వచన మహాభాగవతం

## (మూడవ సంపుటం)

శ్రీ పోతన మహాభాగవతమునకు అనుకృతి

## అయినంపూడి గురునాథరావు

శతావధాని శ్రీ॥శే॥ శ్రీ కోట వీరాంజనేయ శర్మగారి ఎమెస్కో వచన రామాయణం ప్రచురణ పూర్తి కాగానే - అనూహ్యంగా శ్రీ దేవీ భాగవతమును వచన రూపంలో వెలువరించాలని సంకల్పం కలిగింది.

ఈ సంకల్పము కలుగుటయే తరువాయి - మా చూపులు సంస్కృతాంధ్ర ఆంగ్ల, హిందీ భాషా చతుర్ముఖులు అయిన విద్వాన్ శ్రీ అయినంపూడి గురునాథ రావుగారి దెస ప్రసరించాయి. శ్రీ గురునాథరావుగారు మా కోరిక ననుసరించి-శ్రీ దేవీ భాగవతమును ఆంధ్రీకరణములో సంస్కృత మూలమునకు తీసిపోకుండా సరళ వచన రచనములో ధారాళముగా రచన గావించారు. ఆ రచనను పూర్తిగా మూడు సంపుటాలుగా వెలువరించి యున్నాము.

ఎమెస్కో రామాయణమును సమాదరించినట్లుగా శ్రీ గురునాథరావుగారి రచన శ్రీ దేవీ భాగవతమును పాఠకులు సహృదయముతో భక్తి పూర్వకముగా సమాదరించియున్నారు. ఈ సమాదరణ-మమ్మలను ఆయనచే-బమ్మెర పోతన శ్రీ మద్భాగవతమును ఆంధ్రలోకమునకు సరళవచనములో అందించ తలంపునకు పురికొల్పినది.

బమ్మెర పోతన భాగవతము అనగానే భక్తి ప్రపూరితమైన గాథలు-గజేంద్ర మోక్షము, ప్రహ్లాద చరిత్ర, వామన చరిత్ర రుక్మిణీ కళ్యాణం, అంబరీషోపాఖ్యానము-ఈ భక్తమణుల మూల సూత్రమైన వాసుదేవతత్వమూ మనలో పొంగి పొరలుతుంది. హరికీ, యోగివరులకూ అభిలషితమైన భాగవత గాథలు మధుర భక్తిలో ముంచి పచ్చలతురాయిని కూర్చిన బమ్మెర పోతన తెలుగు కావ్యం భాగవతగాథను సంపూర్ణముగా సరళ తెనుగు వచనంలో అందజేస్తున్నాము.

ఈ సంపుటములను కూడా పాఠకులు భక్తి ప్రపత్తులతో సమాదరించగలరని మా భావన.

## యం. శేషాచలం అండ్ కంపెనీ
మచిలీపట్నం - సికింద్రాబాదు